

# భారతి


వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

సెప్టెంబర్ 1975

వెల: రూపాయి న్నర

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

సెప్టెంబరు 1975

సంపుటము : 52 : సంచిక : 9 :

విడిప్రతిక వెల రూపాయిన్నర

# మన జాతి మేలుకొన్నది

మన జాతి మేలుకొన్నది అంతర్వాణి ప్రబోధం విన్నది
తన శక్తి తాను తెలుసుకున్నది "ఇక పదండి ముందుకు" అన్నది.

మన ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధి భారత మాత మెడలో యిరవై మణి పూసల హారం వేసింది. ప్రగతి పథంలో మరొక ముందడుగు వేసింది. ఆ మణి కాంతుల ధగద్ధగలు యిప్పుడు దేశమంతటా అల్లుకుంటున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో..........ఆకాశమంటిన ధరలు అంతలో తగ్గిపోయాయి. భూ సంస్కరణల అమలు కృషి శరవేగంలో జరుగుతోంది. ఈ యేడు జూన్ నెలాఖరునాటికి 16 లక్షల 50 వేల యకరాలకు పైగా బంజర్లు పేదవారికి పంచారు. మార్చి నెలాఖరు నాటికి లక్షా ఎనభై అయిదు వేల కుటుంబాలకు–అంటే బలహీన వర్గాలవారికి–ఇండ్ల స్థలాలు యిచ్చారు.

భారీ మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టుల కేటాయింపు రు. 38 కోట్ల నుండి రు. 49 కోట్లకు పెంచారు. విద్యుచ్ఛక్తి మీద ప్రణాళిక పెట్టుబడి రు. 53.50 కోట్లకు పెరిగింది.

ఈ యేడు మన రాష్ట్రం రు. 10 కోట్ల విలువచేసే–ఎగుమతికి పనికివచ్చే చేనేత వస్త్రాలను ఉత్పత్తి చేస్తుంది. ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయం రాష్ట్ర విద్యుచ్ఛక్తి సంస్థ, రోడ్డు రవాణా సంస్థలలో 500 మందికి శిక్షణ యిస్తారు. ఇందులో మన రాష్ట్రానిదే ప్రథమ తాంబూలం.

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు. నెం. 24/75-76.

3

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1975

# దీప్త చైతన్యం

డా. సి. నారాయణ రెడ్డి

విను విను విను
మనసా విను.
    చిగురాకుల సవ్వడులను
    సెలయేరుల అలజడులను
    పాత యిరుల మాటలను
    లేత విరుల పాటలను
విను విను విను
మనసా విను.
    ఆరు రుతువుల భజనలను
    పారాలో తడిసిన 'గజళ్ల'ను
    పగలు మలిగి రేయి వెలిగి
    ప్రతిధ్వనించే పాదరిశ్వను
విను విను విను
మనసా విను.
    పలకరించే సుగంధాన్ని
    పరిమళించే ప్రబంధాన్ని
    లక్షల అపశ్రుతుల తోపిడిలో
    లయ తప్పని ఆనందాన్ని
విను విను విను
మనసా విను.
    ఇన్ని విన్న చెవులతో
    ఇదీ విను మనసా!
వంద గొంతులు చలిస్తే,
వేయి గుండెలు పిలిస్తే
లక్ష చేతులు కలిస్తే
కోటి అడుగులు ధ్వనిస్తే
    ఉదయిస్తుంది ఒక గుప్త సైన్యం
    అదే అదే దీప్త చైతన్యం.



# తెలుగులో స్వరసమీకరణ

శ్రీ చేకూరి రామారావు

ఒక వర్ణంగాని, వర్ణసమూహంగాని పొరుగున ఉన్న వర్ణంతోగాని వర్ణ సమూహంతో కనీసం ఒక అంశంతో అయినా సమమైతే (సమతను పొందితే) దాన్ని సమీకరణం అంటారు. ఈ సమీకరణానికి పక్కనేఉన్న వర్ణం కారణం కావచ్చు. కొంచెం దూరంలో వర్ణం కారణం కావచ్చు. ఈ సమీకరణం రెండు వ్యంజనాల మధ్యగాని, రెండు స్వరాలమధ్యగాని, స్వర వ్యంజనాల మధ్యగాని జరగవచ్చు. గది + లు > గదులు అనేచోట సమీకరణరెండు స్వరాలమధ్యజరిగింది. తెలుగు + కథ > తెలుక్కథ అనేచోట రెండు వ్యంజనాలమధ్య స్వర లోపానంతరం సమీకరణ జరిగింది. ప్రాచీన ద్రావిడంలోని కెవి తెలుగులో చెవిఅయింది. తన తరవాతఉన్న తాలవ్య స్వరప్రాబల్యంవల 'క' వర్ణం తాలవ్య వ్యంజనంగా మారింది. ఇది వ్యంజనం స్వర ప్రాబల్యంవల్ల మారటానికి ఉదాహరణ. అట్లాగే స్వరవ్యంజనంతో సమత్వం పొందవచ్చు. ప్రసిద్ధమైన ఉదాహరణలు లేవుగాని, మూర్ధన్య వ్యంజనాలముందు అచ్చులు మూర్ధన్యత్వాన్ని పొందటం కంఠ్యాచ్చులు తాలవ్య హల్లుల తరువాత తాలవ్యతను పొందటం ఇట్లాంటివి.

స్వర సమీకరణలో విశేషమేమిటంటే రెండు స్వరాలు మధ్యలో ఉన్న హల్లుల్ని కూడా దాటవేసుకొని సమమవుతై. హల్లులు కూడా మధ్యలోఉన్న అచ్చుల్ని అతిక్రమించి సమం కావటానికి వీలున్నా ఇట్లాంటివి అరుదు. దూరంగా ఉన్న అచ్చులమధ్య జరిగే సమీకరణ ఇప్పుడు వ్యవహృతమవుతున్న భాషల్లో కనిపిస్తుంది. దూరంగాఉన్న హల్లుల సమీకరణ సాధారణంగా చారిత్రక పరిణామాల్లో కనిపిస్తుంది.

స్వర సమీకరణ కాస్తో కూస్తో చాలా ద్రావిడభాషల్లో ఉంది. కాని ఆ భాషా వ్యాకరణాలను పరిశీలిస్తే తెలుగులో ఉన్నంత విస్తృతంగా ఉన్నట్టు కనపడదు. స్వర సమీకరణ భారతీయ భాషలకే పరిమితం కాదు. భిన్న ఖండాల్లో భిన్న కుటుంబాలకు చెందిన భాషల్లో ఈ స్వర సమీకరణ పద్ధతి ఉంది. టర్కిష్, హంగేరియన్ నెజ్ పర్స్ (Nez Perce) భాషల్లో స్వరసమీకరణ భాషాపరిశోధకులకు సుపరిచితమే. స్వరసమీకరణను ఆధారంచేసుకొని ఇటీవలి కాలంలో కొన్ని ముఖ్యమైన సిద్ధాంత చర్చలు జరిగినై. ఈ దృష్ట్యా తెలుగులో స్వర సమీకరణను గురించిచేసే పరిశీలనకు ప్రాధాన్యం ఉంది.

తెలుగు స్వర సమీకరణ ప్రాచీనాధునిక వ్యాకర్తల దృష్టిని ఆకర్షించినట్టు వారి రచనలనుబట్టి గ్రహించవచ్చు. ప్రాచీనుల్లో దీన్ని విశేషంగా గుర్తించినవాడు పరవస్తు చిన్నయసూరి (1806-1862). ఆంధ్రశబ్ద చింతామణిలో (కర్త, కాలాదుల్ని గురించి పండితుల్లో ఏకాభిప్రాయంలేదు. 17వ శతాబ్దానికి ఇటీవలిది కాదని చెప్పటానికి మాత్రమే ఆధారాలున్నై) కూడా స్వర సమీకరణను సూచించే సూత్రాలున్నై. ఆధునికుల్లో వడ్లమూడి గోపాలకృష్ణయ్య, భద్రిరాజు కృష్ణమూర్తి, జెరల్ కెలీ, చేకూరి రామారావు, కొరుమూరి వెంకట సుబ్బారావు, వెన్నెలకంటి ప్రకాశం, చిరుమామిళ్ళ రామచంద్రరావులు తమతమ గ్రంథాల్లోగాని ప్రత్యేకమైన వ్యాసాల్లోగాని స్వర సమీకరణను పరామర్శించారు. ఈ వ్యాసంలో వీరి ప్రతిపాదనలు అవసరమైనచోట ప్రస్తావించబడతై.

ఈ వ్యాసంలో ప్రధానంగా నామ ప్రాతిపదికల్లోను, ధాతువుల్లోను జరిగే స్వరసమీకరణ చర్చించబడుతుంది. ఈ రెంటి మధ్యలో సంఖ్యావాచకాల్ని గురించికూడా కొద్దిపాటి పరిశీలన జరుగుతుంది. ప్రత్యయాల్లో జరిగే సమీకరణకూడా ప్రస్తావించబడుతుంది. అయినా ప్రస్తుత పరిశీలనను సమగ్రమనటానికి వీల్లేదు. కృదంతాలను, శబ్దపల్లవాలనుగురించి అంతలోతుగా పరిశీలించకపోవటం ఈ వ్యాసంలో ప్రధాన లోపం. తెలుగులో సమీకరణను సంపూర్ణంగా అర్థంచేసుకోటానికి అట్లాంటి పరిశీలన అవసరమని గుర్తింపు ఈ వ్యాసకర్తకుంది. చారిత్రక పరిణామాల పొరలను విప్పటంలోగల ఇబ్బందులే పైన పేర్కొన్న లోపానికి కారణం.

తెలుగు నామాల్లో రెండక్షరాలనుంచి నాలుగక్షరాలవరకు (అక్షరం = Syllable) పరిమితిగల పదాలున్నై. వీటిల్లో కొన్ని ఇదంతాలు వీటికి లు, కు, ను వంటి నామ విభక్తులు చేరతై. లు— బహువచన ప్రత్యయం. ఇది చేరినప్పుడు నామం తుది ఇత్వానికి ఉత్వమవుతుంది. మూడచ్చులున్న మాటలో అనాద్యమైన అచ్చు ఇత్తు అయితే అదికూడా ఉత్తు అవుతుంది. కాని తత్సమ శబ్దాల్లో నడిమి అచ్చు ఇట్లా మారదు. కు, ను విభక్తులు చేరినప్పుడు ఈ మార్పు జరగదు. ఈ ప్రత్యయాల్లో ఉత్వమే నామం చివరి ఇకార ప్రభావంవల్ల (ఈమార్పుకు తత్సమ తత్సమేతర విభేదంలేదు) ఇత్వమవుతుంది.

ఉదా : గది > గదులు, గదికి, గదిని

కొలిమి > కొలుములు, కొలిమికి, కొలిమిని

సమితి > సమితులు, సమితికి, సమితిని

అతిథి > అతిథులు, అతిథికి, అతిథిని

స్త్రీ > స్త్రీలు, స్త్రీకి, స్త్రీని

ఈ మార్పులు ప్రాచీనాధునిక భాషలకు సమానం. పైన పేర్కొన్న నామంలో సమీకరణ కొన్ని తెలంగాణామాండలికాల్లో లేనట్లు తెలుస్తున్నది. అప్పుడు వారి భాషకు సమీకరణను సూచించే సూత్రం అవసరం లేదు. సమితి + లు > సముతులు అని వాడే వారున్నారు. వారి భాషలో 'సమితి'ని తద్భవంగా గ్రహించాల్సిఉంటుంది. కెలీ (1965) గుర్తించినట్లు తత్సమ, తద్భవ విభాగం వ్యవహర్తలనుబట్టి ఉంటుంది. పైన పేర్కొన్న ప్రత్యయాల్లో మార్పు సర్వమాండలికాల్లోనూ సమానం.

పై ఉదాహరణల్లోని మార్పుల్ని చింతామణికారుడు "ఉద్బహుత్వే' 'ఇదుపోత్తమానాం బహువచన ఉపోత్తమేత ఉద్భవతి" అస్మద్యుద్యాచ్యా దేవత్య ఇతోని, వి." అని సూత్రీకరించాడు. వీటిని ఇంకా విపులీకరించి బాలవ్యాకరణకారుడు "ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు (తత్సమ- 45)" "వికృతియం దికారాంతముల యుపోత్త మేత్వంబున కుత్వంబగు (తత్సమ-46)" ఇకారంబుమీది కు, ను, వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు (తత్సమ-26)" అని సూత్రించాడు (చిన్నయసూరి, 1858). ఈ విషయంలో ప్రాచీనాధునిక భాషలకు భేదం లేనందున వ్యావహారిక భాషా వ్యాకరణంలోనూ ఇట్లాంటి సూత్రాలే ఉన్నై (గోపాలకృష్ణయ్య, 1958).

నడిమి అచ్చు మారని రూపాలు కూడా ప్రాచీన భాషలో ఉన్నై. పందిరులు, పిడికిలులు, రాపిడులు, తొమ్మిదులువంటి శబ్దాల్లో ఈ మార్పు జరగటంలేదని గమనించిన చిన్నయసూరి "ర, ల, డోపధ నవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు (తత్సమ-47) అని సూత్రీకరించారు. 'వ్యావహారిక భాషావ్యాకరణం'లోనూ ఇట్లాంటి సూత్రమే ఉంది. కాని వీరెవ్వరూ యకార పూర్వకమైన ఇత్తు మారదని చెప్పలేదు. ప్రాచీన భాషలోనైనా పొయ్యి, సాయి, వంటి నామాలకు పొయ్యులు, అని బహువచన రూపాలున్నట్లు కనిపించదు. (రామారావు, 1970)

నడిమి ఇత్తు ఉత్తుగాని 'ఎనిమిది; పగిది, చెయిది' రూపాల్ని చూపి రామమూర్తి (1950) ఉదాహరిస్తూ బాలవ్యాకరణసూత్రం (తత్సమ-47)లో 'నవార్థాదుల' అనే దళంలో ఆదిశబ్దంచేత గ్రాహ్యాలన్నారు. ఇందులో 'పగిది' శబ్దానికి 'విధం; రీతి' అర్థంలో బహువచనరూపం ఉండదు. కష్టం అనే అర్థంలో బహువచనరూపం ఈ వ్యాకర్తకు కనపడలేదు. చెయిది అనే రూపంలో నడిమి ఇత్తు ఉత్తు కాకపోవటానికి యకార పూర్వకతే కారణంగా భావించవచ్చు. రెండక్షరాలకన్నా ఎక్కువున్న పదాల్లో అనాద్యమైన అచ్చులు ఉ–ఇ క్రమంలో ఉండవచ్చుగాని ఇ-ఉ క్రమంలో ఉండవు. ఇకారం యకార పూర్వకమైనప్పుడే ఈ క్రమం సాధ్యం. ఉదా : అయిదు, పయిరు. ప్రాచీన భాషలో యకారపూర్వకంగాని నడిమి ఇత్తుతో 'ప్రిదిలు' అనే ధాతువున్నప్పటికీ దానికి ప్రిదులు అనే రూపాంతరం ఉంది. స్వర క్రమానికి సంబంధించిన పై నియమమే తెలుగు బహువచన రూపాల్లో స్వరసమీకరణను కలిగిస్తున్నట్లు చెప్పవచ్చు. యకార పూర్వకమై ఇత్తున్న పదాల్లో ఈ నియమం వర్తించకపోవటానికి యకారమూ, ఇత్తూ రెండూ తాలవ్యవర్ణాలు కావటం కారణం. యకారాన్ని అక్షర నిర్మాణ శక్తిలేని స్వరంగా కూడా భావించవచ్చు. (అక్షర నిర్మాణశక్తి స్వరాల ప్రధాన ధర్మం. యకారం ప్రాణం లేనిస్వరం).

ఆధునిక భాషలో పందిరులు> పందిళ్ళు, రాపిడులు> రాపిళ్ళు; పిడికిలులు> పిడికిళ్ళుగా మారినై. దీన్ని ఆధారం చేసుకొని ప్రకాశం (1972) రామచంద్రరావు (1974)లు నడిమి ఇత్తు ఉత్తు కాకపోవటానికి సంయుక్త వ్యంజన పరతను కారణంగా

భావించారు. కాని ఆవిరి + లు > ఆవిరులు, ఆవిర్లు అని సంయుక్తా సంయుక్త రూపాలు రెండూ సాధువులే. బాలవ్యాకరణకర్త సూచించిన రళడోపధ పరిసరమే ఎక్కువ సమంజసమైనది. దీన్ని ఇంకాస్త విస్తృతపరచి ఈ వ్యాసకర్త (రామారావు, 1969, 1970) ట, నలను కూడా పరిసరంలో చేర్చాడు. అంటే దంతమూల తాలవ్య వ్యంజన పరకమైన నడిమి ఇత్తు ఉత్తు కాదన్నమాట. పై శబ్దాలన్నీ చతుర్మాత్రాక శబ్దాలుకావటం కూడా గమనించదగింది. చతుర్మాత్రాక శబ్దాల్లో ఉపోత్తమమైన ఇత్తు ఉత్తు కాదని కూడా సూత్రీకరించుకోవచ్చు కాని ఉసిళ్లు' అనే నిత్యబహువచనరూపం ఇందుకు ప్రతిబంధకంగా ఉంది. 'ఉసిళ్లు' కు 'ఉసుళ్లు' అనేరూపం కొందరి వ్యవహారంలో ఉంది కాని పై చతుర్మాత్రాక శబ్దాలకిట్టాంటి రూపవైవిధ్యం లేదు. సూత్రానియమాన్ని పరిసరంగా నిర్దేశిస్తే సంఖ్యావాచకాలను పరిహరించాలి. వినుముదులు, తొమ్ముదులు అనే రూపాలు ఆధునిక భాషలో ఉన్నై. నళడరటోపధ శబ్దాల్లో మాత్రం అపవాదాలులేవు. నోపధానికి ఉదాహరణ లభించలేదు గాని టోపధానికి 'పెనిమిటి' శబ్దాన్ని ప్రకాశం (1972) ఉదాహరించారు.

నామాల స్వర సమీకరణలో ఇంకో విశేషంఉంది. ఉత్వ పరిసరంలో ఇ > ఉ అవుతున్నది గాని ఇత్వపరిసరంలో ఉ > ఇ కావటం లేదు. "టి, తి వర్ణంబులు పరంబులగు నపు డుత్వంబగు (అచ్చిక-36)" అనే బాలవ్యాకరణసూత్రం ఇందుకు పతిబంధకం కాదు సూత్రోదాహరణల్లోఉన్న "రెండిటికి మూడిటికి' నాలుగిటికి, పగలిటికి, మొదలిటికి" అనే రూపాలు సంఖ్యావాచకాలు, క్రియా విశేషణాలు. పగలు, మొదలు శబ్దాలను నామాలుగా భావిస్తే ప్రాచీన భాషలో ఇవి అపవాదులవుతై. కాని ఆధునిక భాషలో ఇవి పగటి, మొదటి రూపంతోనే ఉంటై. బాలవ్యాకరణ కారుడు పై సూత్రం కింద "కొండకచో నుత్వంబున కిత్వంబు చూపట్టెడు" అని వృత్తి రాసి "నెత్తుటికి" అని ఉదాహరించారు. ఇక్కడ కొండొకచో బదులు నామపదాల్లో అంటే సరిపోతుంది. ఆధునిక భాషలో అయితే అపవాదాలుకూడా ఉండవు. కొండొకచో అనే దానికి ఆదేశ టి వర్ణమని రామమూర్తి (1950) వివరణ. మార్పు వచ్చే చోట టి, తి వర్ణాలు ఆగమ వర్ణాలు.

నెత్తుటికి అనేచోట ఉత్వం ఇత్వం కాకపోవటానికి వ్యావహారిక భాషావ్యాకరణకారులు (గోపాలకృష్ణయ్య, 1958) భిన్న మార్గాలను అవలంబించారు. "రళడోపధల" అనే సూత్రం (శబ్దా-235) కింద వృత్తిలో "నెత్తుటికి, నుదుటికి, నడకుదుటి వీరరాజు–ఇత్యాదుల్లో మూలపదం రోపధ కావటంవల్లనే ఉత్వం లేదని గుర్తించాలి" అని రాశారు. ఈ వాక్యం దురవగాహంగా ఉంది. మూలపదం రోపధం కావటంవల్ల ఉత్వం లేనిది ఏవర్ణానికి? బహుశా టి శబ్దంలో ఇత్వానికి అయితే ఈ సూత్రం అనవసరం. "ఇకారంబు మీద కునువు" సూత్రంవల్ల 'కునువు > కినివి' అవుతై. ఇట్లా అనుకోటానికి నడకుదుటి వీరరాజు శబ్దంలో ఇత్వం ఉత్వం అయ్యే పరిసరమే కనిపించటంలేదు. బహుశా ఇక్కడ ముద్రణదోషం ఉండవచ్చు. "ఉత్వాని కిత్వం లేదని గ్రహించాలి" అనేది అసలు వాక్యం కావచ్చు. ఇట్లా అయితేనే ఈ వాక్యానికిక్కడ సంగతిశుద్ధి ఉంటుంది. ఈ అర్థం సరిఅయిందయితే రళడోపధ పరిసరమే ఇత్వంఉత్వంకావటాన్ని ఉత్వంఇత్వంకావటాన్నినిరోధిస్తున్నదనివ్యాకర్త ఉద్దేశం. ఔపవిభక్తిక ప్రత్యయాలు ప్రాయికంగా రళడోపధ పరిసర శబ్దాలకే రావటంవల్ల ఇటా సూత్రించి ఉంటారు. ఇంకోచోట "రు వర్ణాదేశ టి వర్ణం పరమైతే ఉత్వాని కిత్వంరాదు. (శబ్దా-471)" అనే వేరే సూత్రం రచించి పై ఉదాహరణలే ఇచ్చారు. 'రళడోపధ' సూత్రమే ఈ శబ్దాల్ని సాధిస్తే 'రు వర్ణాదేశ టి వర్ణ" సూత్రం అనవసరం. ప్రక్రియా వైవిధ్యం చూపించటం వ్యాకర్త ఉద్దేశం కావచ్చు. కాని 'రు వర్ణాదేశ టి వర్ణ' పరిసరాలో నేగాక ఇంకా మరికొన్ని పరిసరాల్లోకూడా ఈమార్పు జరగదు. అటువంటి వాటిల్లో ఒకటి 'పొద్దుటి' అనే రూపాన్ని గోపాలకృష్ణయ్య గుర్తించి "టి వర్ణం పరమైతే ద్విత్వోపధల ఉత్వానికి ఇత్వంరాదు (శబ్దా 472)" అని సూత్రించారు కాని అల్లుడికి, కూతురికి, దేముడికి." వంటి రూపాలో కూడా ఉత్వం ఇత్వం కావటంలేదు. దీన్నిబట్టి చూస్తే నామ పదాలో పదమధ్యమైన ఉ > ఇ గా మారదని సూత్రించుకోవటమే ఆధునిక భాషా లక్షణానికి సన్నిహితమైనదని తెలుస్తుంది. "అతనికి, కోడలికి, చెల్లెలికి," అనే పదాలో ఉన్న నడిమిఅచ్చు అయిన అత్తు ఎట్లాగూ మారదు.

పై ఉదాహరణలవల్ల ఇంకో విషయం తెలుస్తున్నది. నామపదాల్లో అచ్చులో మార్పులు కలిగించగలిగిన ప్రత్యయం 'లు' మాత్రమే. కు, ను, తో, నుంచి, గురించి, లో వంటి ప్రత్యయాలు మార్పుని కలిగించలేవు. కు, ను ప్రత్యయాలో ఉకారమే సమీకరణకు గురిఅవుతుంది ఇకారాంతాల (ఔపవిభక్తిక ప్రత్యయ ఇకారంగూడా గ్రహించాల) తర్వాత వచ్చిన కు, ను లు కి ని లు

అనచ్చు. బాల వ్యాకరణంలో "ఇకారంబుమీది కనుప్పు" సూత్రం ఇదే చెపుతుంది. కాని ఈ మార్పు ఇకారాంతాలయినా ని, మీ అనే సర్వనామరూపాల తరవాత రాదు. దీన్నే "ఈ ధాతు యుష్మదర్థంబులమీది వానియుత్వంబున కిత్వంబు రాదు (తత్సమ-27)" అని చిన్నయసూరి సూత్రించారు. అయితే 'లు' ప్రత్యయంముందు ప్రాతిపదికలో జరిగే మార్పు కు, ను ప్రత్యయాలముందు ఎందుకు జరగటంలేదు ? ఇందుకు సరియైన కారణం చెప్పటం కష్టం. 'లు' ప్రత్యయం చేరిన రూపాలకు కు, ను లు చేర్చవచ్చు. (అప్పుడు లు > ల అవుతుంది). కాని కు, ను ల మీద 'లు' చేర్చలేము. 'లు' ప్రత్యయంచేరిన తరువాతకూడా పదానికి విస్తరణావకాశంఉంది. కాని కు, నులను చేరి ఏర్పడ్డ రూపాల కట్లాంటి అవకాశంలేదు. ఈ ప్రత్యయాలు పదాన్ని మూసివేస్తై. అయితే "దీన్నిబట్టి" "నిన్ను గురించి" అనేచోట్ల ను ప్రత్యయానికి విస్తరణావకాశం ఉన్నట్టు కనిపిస్తున్నది. కాని పై రూపాల్లో ఉన్న "పటి, గురించి" శబ్దాలు ప్రత్యయార్థంలో ఉపయోగించిన పదాల్లాగా కనిపిస్తున్నై. అంటే దీన్నిబట్టి, నిన్నుగురించి అనే శబ్దసంయోజనను ఏకపదంగా కాక సమాస తుల్యంగా గ్రహించాల్సిఉంటుంది. అందుకు తగినంత సాక్ష్యం కనిపించటంలేదు ఒకవేళ అదే సాధ్యమైతే విస్తరణ సామర్థ్యానికి, సమీకరణ సామర్థ్యానికి సంబంధమున్నట్టు ప్రతిపాదించవచ్చు. ఇది ఎట్లాంటి సంబంధమనేది ఇంకా అంతు చిక్కటంలేదు. క్రియలో కూడా ఇట్లా విస్తరణ సామర్థ్యమున్న ప్రత్యయాలకే సమీకరణ సామర్థ్యం ఉన్నట్టు ఈ వ్యాసం తరువాత భాగంలో తెలుస్తుంది.

నేటి భాషలో దీర్ఘాంత సర్వనామరూపాల తరవాతతప్ప అన్ని చోట్లా కి, ని ప్రత్యయరూపాలను వాడేవాళ్ళున్నారు. దీన్ని సూచించటంకోసం గోపాలకృష్ణయ్య "వు, లు వర్ణాల మీది కు, ను ల ఉత్వానికి ఇత్వం బహుళం (శబ్ద-61)" అని సూత్రించారు. కాని ఇది ఒక్క 'వు లు' వర్ణాలమీదేకాక. "నా, నా, నీ, మీ" అనే సర్వనామరూపాలమీద వచ్చినప్పుడు తప్ప మిగతా అన్నిచోట్లా వస్తుంది. 'ఆవుకి, కుక్కకి, గేదెకి' అనే విధంగా రూపాలున్నై. ఇకారాంతం మీది కి, ని, అనేరూపాలు సాధారణీకరింపబడి సర్వత్రా వ్యవహృతమవుతున్నై. దీన్ని ఆధారంచేసుకొని రామచంద్రరావు (1974) కి, ని రూపాలను మూలంగా గ్రహించి కు, ను అను స్వరసమీకరణ ద్వారా సాధించాలని ప్రయత్నించారు. ఉదంత నామాల తరవాత కి, ని అనేరూపాలు కుమలు అవుతయ్యని ఆయన ఉద్దేశం. కి, ని రూపాలనుంచి కు, ను రూపాలను స్వరసమీకరణ సాధించగలిగితే ప్రకృతి ప్రత్యయాలలో జరిగే సమీకరణం ఒక లాంటిదేనని చెప్ప గలుగుతాం. కాని భాషాప్రయోగాలు అందుకు విరుద్ధంగా ఉన్నప్పుడు ఎట్లా చెప్పగలుగుతాం ?

అధిక పరిసరాల్లో కి, ని అను ప్రయోగించేవారి భాషలో వీటినే మూలరూపాలుగా గ్రహించి సర్వనామాల తరవాత వచ్చే కు,ను లను మారిన రూపాలుగా సాధించగూడదా? అని ప్రశ్నించవచ్చు. ప్రత్యయాలను స్వరసమీకరణపరిధినుంచితొలగించటం ఈ ప్రతిపాదన ప్రయోజనం. ఈప్రతిపాదనచరిత్రకూ,తెలుగువారి భావనకూవిరుద్ధం. ఇవి అంతప్రధానమైన ఆటంకాలు కావు. ఇంతకన్నా ముఖ్యమైన [illegible] లున్నై. ఇకారాంతనామాలతరవాత' కి,ని''లు,దీర్ఘాంతసర్వనామాల తరవాత "కు, ను" నిత్యంగా వచ్చినా ఇతర శబ్దాల తరవాత కి ~ కు, ని ~ ను ల వికల్పత్వంవల్ల సిద్ధించే రూపాల జంటలు వ్యాకరణ సమ్మతం అనే విషయం మరుగున పడుతుంది సర్వనామాల తరవాత ఇత్తుఉత్తు కావటానికిసరైనకారణంకనిపించదు. నీటితో సమంగా వర్తించే వి ~ వు లు మి ~ ము లకు ఈ ప్రక్రియ ప్రవర్తింపజేస్తే చిక్కులు అధికమవుతై ,

ఇంతవరకూ పరిశీలించిన దాన్నిబట్టి ప్రత్యయాల్లో ఉన్న 'ఉ' ఇకార పూర్వకమైనప్పుడు 'ఇ' గా మారుతుందని నామాల్లో 'లు' పరకమైన పదాంతమైన తు , కొన్నిచోట్ల నడిమి ఇత్తు ఉత్తుగా మారుతున్నదని తెలుస్తున్నది. హ్రస్వ ఇకార ఉకారాలే సమీకరణకు గురి అవుతయ్యని రామచంద్రరావు (1974) గుర్తించినా నామాల ఉ> ఇ కాదని, గుర్తించలేదు. నామాల్లో ఇత్తు, ప్రత్యయాల్లో నూ, ధాతువుల్లోనూ ఉత్తు స్వరసమీకరణకు గురి అవుతయ్యని వేరుపరచలేదు. సంఖ్యావాచకాల్లో ఇత్తు, ఉత్తులు రెండూ పరస్పర సమీకృతులవుతై. పది> పదులు, తొమ్మిది> తొమ్ముదులు ఎనిమిది> ఎనుముదులు అన్న రూపాల్లో నామాల్లోలాగా అనాద్యమైన ఇత్తు ఉత్తుగా మారింది. 'బాలవ్యాకరణ' సూత్రంలో 'పదార్థాదుల' అనే దశ ఆధునిక భాషకు వర్తించదు. గురు అనే ప్రత్యయం ముందు కూడా ఈ సమీకరణ జరిగింది. పది + గురు> పదుగురు. షష్ఠీ విభక్తికటి శబ్దంముందు అనాద్యమైన ఇత్తులు ఉత్తులుగా మారినై.

ఉదా: రెండు—రెండిటికి. మూడు-మూడిటికి, నాలుగు నాలిగటికి. కాలాన్ని బోధించే ఇంటికి ఈ సామర్థ్యం ఉన్నట్టు కనిపిం

చను. నాలుగు + ఇంటికి > నాలుగింటికి (నాలుగు గంటల సమయానికి అనే అర్థంలో). నాలింటికి అని వ్యవహరించేవారికి ఈ నిషేధం వర్తించదు. ఈ వ్యాసకర్త వ్యవహారంలో నాలిగిటికి అంటే నాలుగు వస్తువులకు అని, నాలుగింటికి అంటే నాలుగు గంటల సమయానికి అని అర్థాలు. అయితే ఈ అర్థభేదాన్ననుసరించి రూపభేదం అందరి వ్యవహారంలో ఉండకపోవచ్చు. ఒకే రూపానికి రెండర్థాలను బోధించగల సామర్థ్యం ఉండే అవకాశం ఉంది. అర్థభేదం ఉన్నా లేకపోయినా నాలిగిటికి అనే వ్యవహారం ఉన్నవారి భాషకు ఉ> ఇ గా మారే పద్ధతివి గుర్తించాలి. నలుగురు అనే రూపంలో గురు అనేది ఒకే ప్రత్యయంగా భావిస్తే ఇది సవీకరణకు గురికాదని నలుగురికి అనే రూపం వల్ల తెలుస్తున్నది. గురు ప్రత్యయానికున్న విస్తరణ సామర్థ్యాన్ని కూడా పై పదం సూచిస్తుంది. అందువల్ల దీనికి సవీకరణ సామర్థ్యం ఉంది కాని తనకు తాను అందుకు గురికాదు.

పొదుటి, మారుటి అనే రూపాలు నామాలు కావటంవల్ల ఉ> ఇ గా మారటంలేదు.

ప్రత్యయాల్లో నామవిభక్తులు కావటంవల్ల కు, ను లు మాత్రమే చర్చించబడినై. ఇవికాక ఆఖ్యాత పదానికి కర్తృబోధకంగా వచ్చే 'ను, ము, వు, రు' అనే ప్రత్యయాల్లో అచ్చు కూడా ప్రకృతిలోని అచ్చుతో సవీకృతమవుతుంది. ను, వు లకు ఇకారాంతాల తరవాత 'ని, వి' అనే రూపాలునై. ఇకారేతర స్వరాంత శబ్దాల తరవాత కూడా 'ని, వి' అనే రూపాలను వాడేవారున్నారు. ఈ విషయంలో వీటికి నామ విభక్తులైన కు, ను లతో పూర్తిగా సామ్యం ఉంది. ఉదా :– మనిషివి, మనిషివి, స్త్రీవి, స్త్రీవి, రైతును = రైతుని, రైతువు = రైతువి, ము, రు, లు బహువచన బోధకా బహువచనలు. నామాల్లో చివరి 'ఉ' ప్రత్యయాలముందు 'అ' గా మారుతుంది ముసి>, రు> రి అయ్యే ఘట్టాలు దొరకటం కష్టం. బహువచన ప్రత్యయం లేకుండానే బహుత్వ బోధకాలయిన శబ్దాల తరవాత మార్పును గమనించవచ్చు. ఉదా:– మనుషులము, నలుగురము = నలుగురిమి, పదిమందిమి. ఆధునిక భాషలో కొన్ని మారుమూల వ్యవహారాల్లో ప్రచురంగాను, అరుదుగా అర్థవిశేషంలో మిగతా ప్రాంతాలో వస్తిని, వస్తిమి, వస్తివి, వస్తిరి అనే రూపాలు వాడుకలో ఉన్నై. "ఇకారంబువిూది కుచువు క్రియావిభక్తి" ఆధునిక భాషలో కూడా వర్తిస్తుందని పై రూపాలు సాక్ష్యం ఇస్తున్నై. ను, ము, రు లకు విస్తరణ సామర్థ్యం లేకపోవటం ఇక్కడ కూడా గమనించదగింది.

చిన్నయసూరి ప్రత్యయాల్లో మార్పును ముందు వివరించారు. ఆ తరువాత ప్రకృతుల్లో మార్పు వివరించబడింది. ప్రకృతి ప్రత్యయాల్లో జరిగే మార్పులు భిన్నమైనవని చిన్నయసూరి చేసిన నిర్ణయం సరి అయినదేనని పై చర్చవల్ల స్పష్టం. నామాల్లో లు సంఖ్యల్లో గు(రు) మాత్రమే ప్రకృతుల్లో సవీకరణను కలిగించవని తేలింది. 'కు, ను, ము, వు, రు' ప్రత్యయాలు సవీకరణను పొందుతై. ప్రకృతి ప్రత్యయాలలో జరిగే మార్పుల్ని ఒకే గాటకట్టి వెయ్యటానికి చేసే ప్రయత్నం (రామచంద్రరావు 1974) భాషాలక్షణానికి విరుద్ధమని స్పష్టం.

క్రియల్లో సవీకరణను గురించి కూడా సాంప్రదాయిక వ్యాకర్తలు గుర్తించారు. ప్రాచీన భాషలో ఉ> ఇ అనే మార్పు మాత్రమే కనిపిస్తున్నది. దాన్నే చిన్నయసూరి "ఇత్వంబుగాని యిత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు (క్రియా 85)" అని సూత్రించారు. ప్రాచీన ధాతువుల్లో ఉన్మధ్య, అన్మధ్య, ఇన్మధ్య–అని మూడు రకాల ధాతువులున్నై. స్వరసవీకరణం ఉన్మధ్య ధాతువులో నే జరుగుతుంది. అది కూడా తాలవ్యపరకమైనప్పుడు మాత్రమే. ప్రాచీన భాషలో నామాలో > అనే విధంగా క్రియలో ఉ> ఇ అనే విధంగానూ ... న్యాయంగా ఉండేది అకార పరకమైనప్పుడు ఈ మార్పు జరగలేదు. అడుగు> అడుగి అనే ఉండేది. అన్మధ్యధాతువులో ఇకారం పరమైనప్పుడు సమీకరణం జరగలేదు. కదలు> కదలి అనే ఉండేవి. ఇన్మధ్య ధాతువులకూ ఇటాగే మార్పులు లేకుండా తెలియు తెలియు అనే రూపాలుండేవి. ఈ క్రియలు ఆధునిక భాషలోకి వచ్చేటప్పటికి కొన్ని మార్పులు జరిగినై. ఆధునిక భాషలో వ్యవహార భ్రష్టాలయి పోగా మిగిలిన అన్మధ్య ధాతువులన్నీ ఉన్మధ్య ధాతువులుగా మారినై. కదలు, మెదలు మొ॥ ని కదులు, మెదులు అని మారినై. ఇన్మధ్య ధాతువుల్లో కదియు, ప్రిదులువంటి ధాతువులు వ్యవహార భ్రష్టాలయినై. వ్యవహారంలో మిగిలిన కలియు, బలియువంటి ధాతువులు కలుస్/కలుపు. బలుస్/బలుపు అని మారినై. ఉపధ 'య కారం ల కార వ కారాలుగా మారగానే నడిమి ఇ> ఉ గా మారింది ఇన్మధ్యను రక్షించే యకారపరకత తొలగగానే ఇత్తుకున్న ప్రాధాన్యం పోయి ఉత్తుగా మారింది. 'తెలియు' మాత్రం ఇంకా ఇన్మధ్యంగానే మిగిలి తెలియదు, తెలీదు, తెలేదువంటి రూపాలు వ్యవహారం కావటమే కాక ప్రామాణికంగా పరిగణించబడుతున్నై. ఇదైనా చాలామంది భాషలో తెలుస్/తెలుప్‌గా మారింది. మారుమూరి భాషలో దీన్ని అపవాదంగా గుర్తించటమే మలువైన మార్గం.

ఆధునిక భాషలోకూడా ఇన్మధ్య, అన్మధ్య ధాతువుల్ని గుర్తించాలని సుబ్బారావు (1971) సూచించారు. ఇన్మధ్యధాతువుకు వర్ధిల్లు అనే ఉదాహరణచూపించారు. ఘటిల్లు, రంజిల్లు, వర్ధిల్లు వంటి తత్సమ ధాతువులలో దేశ్య ధాతువులలో సమానమైన మార్పులు జరగవు. పైగా ఇక్కడ ఇల్లు అనేది ధాతు నిష్పాదక ప్రత్యయం. ధాతు నిష్పాదక ప్రత్యయాది ఇకారాన్ని ధాతుమధ్య స్వరంగా పరిగణించకూడదు. ఆ స్వరం తెలుగు ధాతువుల్లో స్వర సమీకరణం కలిగించగలదేకాని, తనకు తాను మార్పుకు గురికాదు. ఉదాహరణకు కరిగించు–, పిలిపించు–, ఊగించు–వంటి అనంత రూపాలను గమనిస్తే ఇంచు ప్రత్యయాది స్వరం మార్పుకు గురి కాదని తెలుసుకోవచ్చు. ఇది ధాతు విస్తరణ ప్రత్యయం (stem extending suffix) అనీ, స్వర సమీకరణ సమర్థకమని కూడా తెలుసుకోవచ్చు. పదనిర్మాణ సమాపక ప్రత్యయాలు (word closing suffixes) మాత్రమే సమీకృతమవుతయ్యని కూడా ఇంతకు ముందే సూచించబడింది. ఇన్మధ్యధాతువులను గుర్తించాల్సివస్తే అది తెలియు, కలియు, వంటి ధాతువుల విషయంలోనే అని స్పష్టమవుతున్నది.

అన్మధ్య ధాతువులకు సుబ్బారావు చెమర్చు అనే ధాతువును ఉదాహరించారు. ఇవేకాక కలగు, కలచు, పెనగు వంటి ధాతువులను చాలా ఉదాహరించవచ్చు. ప్రాచీన భాషలో ఇవి నిస్సంశయంగా అన్మధ్య ధాతువులే. కాని సాహిత్య పరిచయంవల్ల, ఇతర సాంస్కృతిక ప్రచార సాధనాలద్వారా విద్యావంతులు, ఉన్నత, మధ్యమ తరగతుల "సంస్కార వంతులు" ప్రాచీన భాషాపదాలను వాడుతుంటారు. వీటికి కారణాలనేకం. వీరినే "శిష్టులు" అని కొందరు వ్యవహరిస్తుంటారు. వీరి భాషలో ఇతర భాషాపదాలుకూడా బహుళంగా ఉంటై. సూత్ర నిర్మాణంలో ప్రాచీన భాషాపదాలనుకూడా, ఇతర భాషా పదాలతోపాటు వేరుచెయ్యాలి.

అన్మధ్య ధాతువులను గుర్తించాల్సిన ఘట్టాలు ఆధునిక భాషలో కొన్ని కనిపిస్తున్నై. నేటి తెలుగులో. కొందరి వ్యవహారంలోఉన్న కడచిన, తొలగిన, వంటిరూపాల్లో ధాతువులను ప్రాచీన భాషనుంచి ఎరువు తెచ్చుకున్నట్టు భావించినా అణకువ, మెలకువ, కదలిక, మెదలిక, బడలిక వంటి కృదంత రూపాలను సాధించాలంటే ఈ రూపాల్లో ధాతువుల్ని అన్మధ్య ధాతువులుగా గుర్తించాలి. కదలు ధాతువుకు ఇక ప్రత్యయం చేర్చినప్పుడు మారని మధ్యస్వరం-ఇంచు ప్రత్యయంచేర్చినప్పుడు (కదలిక – కదిలించు) మారిందనాలి ధాతువునుంచి నామం నిష్పన్నమయినప్పుడు మారదని, ధాతువునుంచి ధాతువే నిష్పన్న మయినపుడు సమీకరణ జరుగుతుందని సూత్రించుకోవాలి. కాని ఈ ప్రతిపాదన చాలా వ్యయంతో కూడుకున్నది. అంటే ఈ ప్రతిపాదనకోసం అన్మధ్యధాతువుల్ని గుర్తించాలి, ఆ అత్తు సమీకరణాన్ని పొందుతుందని చెప్పాలి. దీనివల్ల వచ్చే లాభం కృదంత రూపాల సాధన ఖర్చుతో పోల్చుకుంటే లాభం బహుస్వల్పం. ఎందుకంటే కృదంతప్రత్యయాలు అధిక నిష్పాదన శక్తి (productivity) గలవి కావు. వీటికోసం అన్మధ్యధాతువుల్ని గుర్తించటంలో పొదుపు (economy) లేదు. సాంప్రదాయిక వ్యాకరణాల్లో కృదంత పరిచ్ఛేదాల్ని ఒకసారిచూస్తే ఈ కృత్ప్రత్యయాలు ధాతువుల్లో కలిగించే మార్పులు ఒక క్రమంలో ఉన్నట్టు కనపడవు. దానికి కారణం భిన్నకాలాల్లో ధాతువులున్న రూపాల్నిబట్టి భిన్న విధాలయిన కృద్రూపాలేర్పడినై. వాటిని ఇప్పుడున్న ధాతురూపాల్నుంచి నిష్పన్నం చెయ్యటం చాలా కష్టమైనపని. అందుకే ఈ వ్యాసం మొదటి భాగంలో 'చారిత్రక పరిణామాల పొరలను విప్పటం' లో ఇబ్బందులున్నయ్యన్నది.

కృదంతప్రత్యయాలకోసం అన్మధ్య ధాతువుల్ని గుర్తించినా వాటిని క్రియాపద నిర్మాణంకోసం ఉన్మధ్య ధాతువులుగా మార్చుకోవాలి. "కుదురు- కుదిరిక; కదలు కదలిక" అనే రూపాల్ని చూస్తే ఇదాది ప్రత్యయాలముందు ధాతుగతమైన ఉత్తు మారుతుంది గాని అత్తు మారటంలేదని గమనించవచ్చు. అటువంటి అత్తును పదనిర్మాణంలో ('కదిలింది' అనే పదంలో లాగా) ఇదాది ప్రత్యయంముందు మారిందని చెప్పటం ఎట్లా ? ఇదాది ప్రత్యయాలముందు ఉత్తు సర్వత్రా మారుతుంది, అత్తు క్రియాపద నిర్మాణ ప్రత్యయాలముందే మారుతుందని ఒక విచిత్ర సూత్రాన్ని రచించుకోవాలి దీనికన్నా కృదంతప్రత్యయాలకోసం అన్మధ్య, ఇన్మధ్య ధాతువుల్ని గుర్తించి క్రియాపద నిర్మాణ విభాగ ప్రారంభంలో "ధాతుమధ్యాచ్చులు ఉత్తులుగా మారుతై" అని సూత్రించు కోవాలి. ఒకరకంగా చారిత్రకంగా జరిగింది కూడా ఇదే,

ప్రాచీన భాషలో నడిమి ఉత్తు తాలవ్యాచ్చులముందు ఇత్తుగా మారింది. అచ్చాది ప్రత్యయాలముందు మారలేదు. ఆధునికభాషలో అదాది ప్రత్యయాలముందు అత్తుగా మారింది ప్రాచీన భాషలో అడుగ, కడుగ వంటి రూపాలే ఉంటై. ఆధునిక భాషలో ఇవి అడగ, కడగ అని మారినై. ప్రాచీనభాషలో ఇత్సమీకరణమే ఉంది. ఆధునిక భాషలో అత్సమీకరణం అదనం. అయితే ప్రాచీన భాషలో వండక, వండకు, వండని, వండమి వంటి రూపాల్ని సాధించటానికి చిన్నయసూరి ఒక విశేషమైన మార్గాన్ని అనుసరించారు. ఆ ధాతువు చివరి అచ్చును మాత్రమే మార్చటానికి ఇత్సంజ్ఞలను విధించి. కజి, కుజి, నిజి, మిజి అనే విధంగా ప్రత్యయాలను గ్రహించి 'జిత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు (క్రియ-20)" అని సూత్రించారు. ఇక్కడ స్వరంలో మార్పుకు సమీకరణంతో సంబంధంలేదని స్పష్టమే. [సశేషం]

# "నే నింకా చచ్చిపోలేదు"

శ్రీ చొప్పకట్ల చంద్రమౌళి

పడమటి దిక్కున గుత్తులు గుత్తులుగా వ్రేలాడి
పరామర్శించిన రాగమంజరులు
నిర్దాక్షిణ్యంగా నన్నువదలి కనుమరగై
మొన్నటి సాయంత్రం అపరసంజవేళలో
జీవితాశయాల ఆశాదళాలు ఒక్కటొక్కటే
రాలి గాలిలో ఎగిరిపోయిం తర్వాత
నిన్నటి ఉదయం తొలి పొద్దు పొడవకముందే
కన్నకలలు తుదిరూపం దిద్దుకోక ముందే
మోసం చేసిన మొగ్గలనే వలచి
మీసం మెలవేసిన కాలాన్ని తలచి
నేను ఖచ్చితంగా నిన్ననే చచ్చిపోయానని
పిల్లగాలికి కూడా వినరాకుండా
ఆత్మగతంగా ప్రకటించుకున్నాను
రగిలిన నిరాశలను నెమరు వేస్తే నిద్రమత్తులో
పగిలిన కలల ముక్కల నిద్రమాత్రలను మింగి
భళ్ళున తెల్లవారిన ఉదయం రాకెట్ వేగంతో దూరి
ఛెళ్ళున చెంపదెబ్బకొట్టి లేపినప్పుడు
బయటి తోటలో పూలమొక్క చిగురిస్తున్న తన
లేత ఎరుపు చిగుళ్ళ సిగ్గులను ఒలకబోస్తున్నప్పుడు
పసిడి వెలుగులు పడిన జలతారు పైటను
పైరగాలిలో సవరించుకుంటున్నప్పుడు
కిటికీ పైకి ప్రాకడానికి ప్రాకులాడే జాజి తీగ
చీకటిని జయించి సిగలో వెన్నెల గుత్తులను ధరించి
పూల వెలుగుల నెత్తావి సందేశాన్ని అందించినప్పుడు
'ఓహో, నేనింకా చచ్చిపోలేదేమోనని వి[illegible]చాను'
ఆహా, ఇదేదో కొత్తరోజులా ఉందని ఒళ్ళువిరిచాను.

# ద్రవ్యోల్బణ - నివారణలు

శ్రీ కె. వి. కె. రావు

గత పాతిక సంవత్సరాలనుంచి దేశంలో జరుగుతున్న ప్రణాళికాబద్ధమైన ఆర్థికకృషితోపాటు ధరలస్థాయిరేక ద్రవ్యోల్బణకూడా పెరుగుతూవస్తోంది. ధరలలోని యీ అధికమైన పెరుగుదల సామాన్య ప్రజానీకాన్నేగాక జాతీయ ఆర్థిక వ్యవస్థను గూడ కుంగదీస్తోంది. 1973 74 లేక 1974–75 సంవత్సరాల ద్రవ్యోల్బణాల తీరుతెన్నులు మన సాంఘిక, ఆర్థిక, రాజకీయ వాతావరణాల నెంతో ప్రభావితం చేసింది.

ద్రవ్యోల్బణను యెలా నిర్వచించినా నిరాటంకంగా ధరలు పెరుగుతూ శాశ్వతమగు వున్నతస్థాయిని సంతరించుకోవడమే అని అనాల్సివుంటుంది. ప్రజల ద్రవ్యరూప ఆదాయాలు పెరిగే వస్తువులకూ, సేవలకూ గల గిరాకీ ద్రవ్యోల్బణకాలంలో అధికంగా వుంటుంది వస్తుసేవల ఉత్పత్తి తక్కువగావుండటంవల్ల వాటిధరలు పెరుగుతూ వుంటాయి. ద్రవ్యోల్బణను యుద్ధం, భయంకర రోగాలు, క్షామాల కన్న భయంకరమైనదిగా వర్ణిస్తూ వుంటారు. ద్రవ్యోల్బణకాలంలో ప్రజలందరి ఆదాయాలు ఒకే నిష్పత్తిలో పెరిగినా లేక వస్తుసేవలన్నింటిధరలు ఒకే నిష్పత్తితో పెరిగినా దీనివల్ల ఆందోళన పడవలసిన పనివుండదు. కాని అలా జరగకపోవడంవలన అధికసంఖ్యాకులైన ప్రజలు కష్టనష్టాలకు గురికావలసి వస్తోంది. పెన్షన్‌దార్లు, స్థిరాదాయంకల వుద్యోగులు, శ్రామికులు, జీవనప్రమాణాల్లో, వాస్తవాదాయాల్లోను తరుగుదల అంగీకరించవలసి వుంటుంది. గ్రామీణ ప్రజలు, వ్యవసాయకార్మికులు పట్టణ ప్రాంతాల్లోని చిల్లర సేవలను అందించేవ్యక్తుల వినియోగ ప్రమాణాలు తగ్గి ఋణగ్రస్తతకుగూడ దారితీస్తుంది. పరిమిత సంఖ్యలోగల అంచనా వ్యాపారులు, ధనవంతులు, గుత్తాధిపతులు అధిక మొత్తాలలో లాభాలను సమకూర్చుకోవడానికి యిది సహాయపడతుంది. తమ వ్యవసాయోత్పత్తులను తక్షణం మార్కెటుకు చేరవేసే అవసరం లేని పెద్దభూస్వాములు కూడా ద్రవ్యోల్బణవలన గాలివాటుగావచ్చే లాభాలను పొందగల్గుతారు. ఆదాయము, ధరలు పెరిగే నిష్పత్తిలో పెరగనందున అభివృద్ధి కార్యక్రమాలకు అవసరమగు పెట్టుబడి ప్రభుత్వానికి లభించక భావి ప్రగతికి అవరోధమేర్పడుతుంది.

ఆర్థిక వ్యవస్థపట్ల ప్రజల విశ్వాసాన్ని పెంపొందించి వారిలోని నిరాశా నిస్పృహలను తొలగించే ధ్యేయంతో గతకొద్ది రోజులుగా ప్రభుత్వం చిత్తశుద్ధితో కొన్నివిధానాల ననుసరిస్తోంది. వేతనాలు, లాభాలు, నిర్బంధ డిపాజిటు, ఆర్డినెన్సులు, పరపతి నియంత్రణ, పన్నుల ఎగవేతను అరికట్టే చర్యలూ, అభివృద్ధికి తోడ్పడని వ్యయాన్ని తగ్గించడం, ప్రభుత్వంపరంగా వినియోగ వస్తువుల పంపిణీ మొదలగు అంశాలతోపాటు ద్రవ్యవిధానము, కోశాగార విధానాలు దేశంలోని ద్రవ్యోల్బణను అదుపుచేయడానికి వుద్దేశింపబడాయి. గత కొద్ది రోజులుగా ఆంతరంగిక భద్రతాచట్టంక్రింద ప్రభుత్వం తీసుకొంటున్న వివిధ చర్యలవలన ధరలపెరుగుదల ధోరణి తగ్గి ధరల స్థాయి తగ్గుముఖం పట్టింది. ఈ సందర్భంలో మనదేశంలోని ద్రవ్యోల్బణ స్వరూప స్వభావాలను పరిశీలించి నివారణకు సహాయపడగల ఒక నూతన విధానాన్ని శాశ్వతంగా రూపొందించుకోవలసిన ఆవశ్యకత యెంతైనావుంది.

భారతదేశంలోని ద్రవ్యోల్బణ, లేటిన్ అమెరికాదేశాల ద్రవ్యోల్బణను పోలివుంది. మన దేశంలోని పెరుగుదలకు ద్రవ్యసంబంధమగు కారణాలు తక్కువ. అందుచే ఋణవిధానాలు, కోశాగార విధానాలు సరియైన ఫలితాల నివ్వలేవు. పైగా ఉత్పత్తికి అవి ప్రతిబంధకాలు కావచ్చు. మన ప్రణాళికల వివరాలను, ఆర్థిక వ్యవస్థయొక్క ప్రగతిని పరిశీలించిన తరువాతనే ద్రవ్యోల్బణ నివారణకు సూచనలు చేయడానికి వీలుపడుతుంది. వర్తమాన కాలంలో మన ఆర్థిక వ్యవస్థ చలన రహిత స్థితిలోవుంది. ద్రవ్యపరిమాణంలోని పెరుగుదల ద్రవ్యోల్బణకు కారణం కావడానికి వాణిజ్య బ్యాంకుల నిల్వలూ, విధానాలూ ఒక బుజువు.

ప్రభుత్వరంగంలోని పెట్టుబడి సాంఘిక సంక్షేమ పథకాలూ, సిబ్బంది పెరుగుదలవలన ప్రభుత్వ వ్యయం ఈ మధ్యకాలంలో ఎన్నో రెట్లు పెరిగింది ప్రయివేటు వ్యయంకూడా దీనికి కలుపతే వస్తు సేవలకుగల గిరాకీ తెలుస్తుంది. దీంతో పోలిస్తే జాతీయోత్పత్తిలోని పెరుగుదల చాల తక్కువ. ఇందువలన గిరాకీ, సరఫరాలమధ్య అసమతూకం యేర్పడి ధరలూ, జీవనవ్యయాలు ఎంతో పెరుగుతూ వచ్చాయి. 1971–72, 1972–73, 73–74 సంవత్సరాలు జాతీయ ఆదాయపు సమగ్ర వివరాలు లభించకపోయినా అందుబాటులో ఉన్న సమాచారం ప్రకారం ఈ సంవత్సరాలలోని పెరుగుదలలో నిలకడలేక ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్క విధంగా వుంటోంది. 69-70లోని పెరుగుదల రేటు 7.3% అయితే 70-71లో యిది 4 6%

పై విశ్లేషణ వలన జాతీయోత్పత్తిలోని పెరుగుదల మందకొడితనం ప్రస్తుత ద్రవ్యోల్బణకు కారణం అని స్పష్టం. అందుచేత ద్రవ్యకోశాగార విధానాలు దీన్ని అదుపుచేయడానికి ఎక్కువగా తోడ్పడవు. ఆర్థిక పురోభివృద్ధికి వివిధ చర్యలను తీసికోవడమే ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం. వివిధ ప్రణాళికలలోను మనం పారిశ్రామిక వైవిధ్యాన్ని కొంతవరకు సాధించినా మన ఆర్థిక వ్యవస్థ వ్యవసాయ వస్తువుల ఆహార ధాన్యాల ఉత్పత్తిమీదనే యింకా ఆధారపడి వుంది వ్యవసాయోత్పత్తులు నిలకడలేక తరచుగా మారుతున్నాయి. వ్యవసాయ ఉత్పత్తి ఏమాత్రం తగ్గినా మనం గిజగిజలాడవలసి వస్తోంది. 1966-72 సంవత్సరాలమధ్య హరిత విప్లవ ఫలితంగా మన వ్యవసాయోత్పత్తి పెరిగినా తలసరి ఆహార ధాన్యాల అందుబాటు దినానికి 468 గ్రాములనుండి 457 గ్రాములకు దిగజారింది.

ఈ విషయాలను ఆధారం చేసుకొని చూస్తే ఆహార ధాన్యాల సేకరణ, ఆహార సంస్థ స్థాపన మొదలగునవి ఆహార ధాన్యాల సరఫరాను తగినంతగా పెంపొందించలేవు. వ్యవసాయరంగంలోని ఉత్పాదకతను పెంపొందించడమే తక్షణ కర్తవ్యం. హరిత విప్లవం ఫలితంగా కొద్ది మంది పెద్ద భూస్వాములు మాత్రమే ప్రయోజనాన్ని పొందారు వివిధ పంటలను పండించే వ్యవసాయదారులకు దేశవ్యాప్తంగా ప్రోత్సాహం లభించేటట్టు కృషిజరగాలి. వ్యవసాయరంగంలోని ఉత్పత్తులను పెంపొందించకపోతే నిలకడతో కూడిన అభివృద్ధి కష్టతరమవుతుంది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థకూ వ్యవసాయరంగానికి ప్రాధాన్యతను యిచ్చి అత్యవసర వినియోగ వస్తువుల ఉత్పత్తిని పెంచినపుడే ధరలను అదుపు చేయడం సాధ్యమవుతుంది. తక్కువ ఆదాయ వర్గానికి చెందిన ప్రజలు, మధ్యతరగతి ప్రజలు ద్రవ్యోల్బణను భరించలేక పోవడానికి కారణం ఆహార వస్తువుల, యితర వస్తువుల కొరత, పప్పుదినుసులు, చక్కెర, వంటనూనెలు, ఆహారధాన్యాల తలసరి అందుబాటు కొంతవరకు తగ్గింది అనడం అతిశయోక్తి కాదు.

పారిశ్రామిక ఉత్పత్తులను కూడ మెరుగుపరచవలసిన అవసరం ఎంతో వుంది. నాల్గవ ప్రణాళికలో పారిశ్రామికాభివృద్ధి లక్ష్యం 8% నుండి 10% కాగా సాధించిన అభివృద్ధి తక్కువగా వుంది. పారిశ్రామికోత్పత్తులు పెరగక పోవడానికి కారణాలనేకం వున్నాయి. అత్యవసర ముడిపదార్థాల కొరత, పారిశ్రామిక సంబంధాలు, పారిశ్రామిక విధానాలు వీటిలో చాలా ముఖ్యమైనవి. 1956 తరువాత వచ్చిన మార్పుల ననుసరించి ఒక నూతన పారిశ్రామిక విధానాన్ని ప్రకటించడం అవసరమేమో ననిపిస్తుంది. సామ్యవాదం పేరుతో ఆర్థిక స్తోమతలేని సంస్థలకు అవకాశం ఈయరాదు. సంస్థల గరిష్ఠ శక్తిననుసరించి ఉత్పత్తి జరిగినపుడే కొత్త సంస్థలకు 'లైసెన్సులు' మంజూరు చేయాలి. అత్యవసరమగు వినియోగ వస్తువులను-సామూహిక వినియోగ వస్తువులను నిర్ణయించి వాటి ఉత్పత్తిని పెంచుటకు వలయు వివిధ చర్యలను తీసుకోవాలి.

అత్యధికమగు పెరుగుదలరేటును సాధించాలంటే పెట్టుబడి నుండి లభించు ప్రతిఫలాలను గరిష్ఠ స్థాయికి పెంచాలి. మనపెట్టుబడిలో అధిక భాగం ప్రభుత్వరంగంలోని పరిశ్రమలలో కేంద్రీకరింపబడివుంది. ఈ రంగంలోని ఉత్పత్తి మెరుగుపడందే ఆర్థికవ్యవస్థలో అభివృద్ధిసాధించడానికి వీలుపడదు, అందుచే ప్రభుత్వరంగంలోని పారిశ్రామిక సంస్థల నిర్వహణా విధానాల పునర్వ్యవస్థీకరణ అవసరమై వుంది. ఉత్తేజకరమగు నూతన విధానాలపై దృష్టిని మరలించనంతకాలం ప్రభుత్వసంస్థల ఆర్థిక నిర్వహణ లోపభూయిష్టంగా వుంటుంది. వ్యాపారపు సడలింపులు నిర్వాహకులకు సంబంధించిన నూతన ప్రమాణాలను ప్రభుత్వ సంస్థలో ప్రవేశపెట వలెను. నిపుణులు, సమర్థులు అని ఋజువు చేయబడిన వ్యక్తులను తమ సంస్థల కధిపతులుగా నియమించుటకు ప్రభుత్వ సంస్థలు మరింత ముందుకురావాలి.

అత్యాడంబరాల విందులు, వినోదాలు, అలంకారాలు, ఆభరణాలు, విదేశమోటార్లు, ఫైవ్‌స్టార్ హోటళ్ళు మొదలగు ఆడం

బర వినియోగాలపై జాతీయస్థాయిలో అభిశంసన ప్రారంభింపబడాలి. సామాన్య పౌరుని ఆర్థిక దుస్థితికి నోటిమాటలతోగాక ఆడంబర వ్యయాన్ని తగ్గించుకొనగలిగే జాతీయతాభావం పెంపొందాలి, ఆర్థిక వ్యవస్థలో నల్లధనాన్ని అంచనావేయడం సుసాధ్యంకాకపోయినా సమాంతరమగు మరో ఆర్థిక వ్యవస్థను రూపొందించ గలిగేంతగా ఈమధ్య పెరిగిపోయింది. ప్రభుత్వంకొద్ది నెలలుగా జరుపుతున్న కృషివల్ల తాత్కాలిక సర్దుబాట్లు జరుగుతున్నాయి. అక్రమ పద్ధతులలో ఆర్జించిన మొత్తాలపై పన్నును ఎగవేయడానికి తప్పుడు లెక్కలు చూపించి ఈ ధనాన్ని ఆర్జిస్తారు. ఈ నల్లధనమే సాంఘిక, ఆర్థిక విపత్తుకు మూలకారణం. నైతికలోపాన్ని పక్కకు పెట్టినా ఈ నల్లధనంతో, ప్రభుత్వం కళ్ళుగప్పి, కొంతమంది భోగభాగ్యాలతో తేలాడుతున్నారు నిజాయితీగ తమ ఆదాయాన్ని వెల్లడించిన పౌరులు ద్రవ్యోల్బణభారంతో, పన్నుల బాధలతో, బ్రతుకు దుర్భరంగా గడుపుతూ వున్నారు. ఈ నల్లధనం పెట్టుబడిగా ఉత్పత్తిని పెంపొందించుటకు బదులు అధికస్థాయిలో వినియోగానికి ఆధారమవుతోంది. సాంఘిక, ఆర్థిక వాతావరణాన్ని పాడుచేస్తూ అవినీతి పద్ధతులలో కొందరు లాభాన్ని పొందుతుంటే నిజాయితీగల ప్రజలు కష్టించి పనిచేయడానికి మనసొగ్గరు. దీన్ని బయటకు తీయడానికి ప్రభుత్వం తక్షణ చర్యలను తీసికోవలసివున్నది. నల్లధనం పెరుగుదలను నిర్మూలించి, ప్రజల నైతిక స్థాయిని పెంపొందించాలి.

ఉద్యోగుల ప్రతిఘటనను ఎదుర్కొనడానికి ద్రవ్యోల్బణకాలంలో కూడా వేతనాల్ని, కరువుభత్యాల్ని పెంచే ధోరణిలో ప్రభుత్వరంగం, ప్రయివేటురంగం సిద్ధంగావుంది. నిజానికి ద్రవ్యరూప వేతనాలు పెరిగినందువల్ల ; ధరలు పెరిగే వస్తుసేవలరూపంలోని వాస్తవాదాయాలు క్షీణిస్తాయి. వాస్తవ వేతనాలు, ద్రవ్యవేతనాలమధ్యగల సంబంధం తెలియనందున కార్మిక సంఘాలు ద్రవ్యవేతనాల పెరుగుదలకు సుముఖంగా వుంటాయి. వారి ప్రయోజనాలతోపాటు దేశ ప్రయోజనాల కొరకు వేతనస్తంభన లేక యితర చర్యలకు కార్మికులు సిద్ధపడాలి.

వివిధ సంస్థల ఉత్పత్తి వ్యయాల పెరుగుదల ఈమధ్యకాలంలో సంభవించిన ఆర్థిక మార్పులలో ఒకటి. అధిక ధరలరూపంలో ఉత్పత్తివ్యయాలు వినియోగదారునిపై నెట్టివేయగలగడంతో సంస్థలు ఉత్పత్తిఖర్చును గురించి ఆలోచించాల్సిన అవసరంలేదు. అవసరానికి మించిన సిబ్బంది, ఇతరవస్తువుల ధరలు పెరగడం, ఉత్పత్తివ్యయం పెరుగుదలకు కొన్ని ముఖ్యకారణాలు. పారిశ్రామిక సంస్థలు, ప్రభుత్వ కార్యాలయాలు శాస్త్రీయమగు పద్ధతులద్వారా తమవ్యయాన్ని తగ్గించేందుకు కృషిచేయాలి. వేతనాల పెరుగుదల శ్రామిక ఉత్పాదకతతో జోడింపబడాలి. వ్యవసాయ క్షేత్రాలు, కర్మాగారాలు, సేవాసంస్థలు, ప్రభుత్వ కార్యాలయాలు మున్నగునవి ఉత్పాదకతను సర్వే సర్వత్రా పెంచాలన్న లక్ష్యంతో సాగిపోవాలి.

సాంఘికన్యాయం, సమానత్వం ప్రాతిపదికలుగా సామ్యవాదరీతి సమాజం సాధింపబడాలంటే ద్రవ్యోల్బణ అదుపులో వుంచబడాలి. అందు కవసరమైన అన్ని సాంఘిక, ఆర్థిక పరమగు చర్యలను సంయుక్తంగా మనం అందరం అమలుచేయాలి. ఈ మహాకృషిలో ప్రభుత్వానికి సంపూర్ణ సహకారం చేయూతనిచ్చి అండదండలుగా నిలవాలి అప్పుడే మన స్వరాజ్యం సురాజ్యం అవుతుంది.



# వ్యాకరణం గొడవ

శ్రీ ఎ. శంకర్

దేశి భాష ధ్యాసలేక
భేషుగాను రాయాలంటు
మతిబోయే ప్రాస-యతిని
గతి తప్పక వేయాలంట.

సంఘంలో గణవిభజన
సాహిత్యం గణవిభజన
ఇంద్రగణం చంద్రగణం
విడిచేస్తా నీ క్షణం.

కాదన్నా పోదన్నా
పరీక్షేమొ తప్పదాయె
చిన్న యసురి వ్యాకరణం
విక్కదాయె వాకర్మం.

మధ్యాక్కర మధురాక్కర
రావేవీ మనకక్కర
'రగడల'పై లేనిపోని
జగడమేల చేయాలో?

వద్దన్నా వస్తున్నవి
వరుసలో యతిప్రాసలు
ఇన్నేండ్లుగ చదివినట్టి
బూజు చదువు ఫలితమేమొ.

చిన్నవారు పెద్దవారు
తెలుసుకుంటే సరేకదా!
పనికిరాని పాఠాలకు
ఈ పూటనె టాటావోయ్!!

# సాతవాహన. సాతకర్ణి అనే పేర్లు: సాతవాహన నాణాలమీద శ్రీవత్స చిహ్నం

## శ్రీ ఇంగువ కార్తికేయశర్మ

"సాత" బహుశ సంస్కృతం పదం "సప్త" తో సమానం అయి ఉంటుందని ప్రొఫెసర్ కోశాంబి సూచించారు; "సప్త" అంటే "ఏడు" అన్న అర్థంకాక "గుర్రం" అన్న అర్థం వస్తుందని ఆయన అన్నారు. అంటే, సరయిన సంస్కృతరూపం, కల్కిపురాణంలో[1] కనిపించినట్లు, "సప్తవాహన" అయిఉండాలి. సప్తవాహనుడనే పేరు విష్ణువు వెయ్యి పేరులలో ఒకటి: సహస్రార్చిస్ = సప్త జిహ్వా = సప్తైధాస్ = సప్తవాహనః మహాభారతంలో విష్ణువుకి, సూర్యుడికీ దగ్గిర సంబంధం ఉంది. "సాతవాహన" అనే కులనామం (గ్రాంథిక ప్రాకృతంలో "సత్తవాహన") "సప్తవాహన" అన్న మాటకి ప్రాకృతరూపం అని డా. గోపాలాచారిగారి అభిప్రాయం. స్కాంధపురాణంలోని కాశీఖండంలో సప్తవాహనుడంటే సూర్యుడనే అర్థం.[2]

"సాతవాహన" అనే కులంపేరు (లేదా సప్తవాహన అనే పేరు) ఈ వంశానికి చెందిన మొదటివారి కొందరి గాఢ వైష్ణవ మతాభిమానం[3] వల్ల వచ్చింది అనిపిస్తుంది. ఆరంభంలో వీరికి సామంత ప్రభుత్వ అంతస్తు ఉండి ఉండవచ్చు. క్రమంగా ఈ వంశానికి చెందిన ఒకరు తమ అధికారాన్ని పెంచుకొనటంతో, స్వతంత్రంగా పాలకుడు కావటంతో "సప్త(ప్తి)వాహన" అన్న కులంపేరు కూడా ప్రముఖం అయి బాగా ప్రచారంలోకి వచ్చిఉండవచ్చు. ఈ పాలకుడు ఎవరోకాదు, "సిముకుడు" లేక "శ్రీముఖుడే" అయి ఉండవచ్చు. మొట్టమొదటి పాలకుడే కులదైవమయిన, ఒక సప్తవాహనుడయిన విష్ణుపేరు ధరించడం గమనింప దగిన విషయం. నానాఘాట్ మొదటి శాసనం అర్థం, దానిమీద కనిపించే బొమ్మ పేరు సందర్భంగా "రాయాసీముక్ సాతవాహనో సిరిమతో" అన్న

### శ్రీ వ త్స చి హ్న ము





1 వ బొమ్మ శాతకర్ణి — నెవాసా, క్రీ. పూ. 2 వ శతాబ్దము పరిమాణము 2/1.

మాటల అర్థం ("సాతవాహన కులానికి చెందిన శ్రీ...") ఏమిటో కూడా ఇక్కడే తెలుస్తుంది.[4] ఇంతకుముందు కొందరు పండితులు ఈ రాజ వంశాన్ని స్థాపించిన వ్యక్తి ఎవరన్న విషయం మీద కొన్ని ఊహలు చేశారు; పురాణాలలోని 'శ్రీముఖుడు ఈ వంశాన్ని స్థాపించినవాడు కాడని వారు అనుకున్నారు. ఈ ఊహ సరికాదని ఇప్పుడు తెలిసిపోయింది.[5] అతని పేరు సిముకుడు లేక శ్రీముఖుడు అయి ఉండాలని స్పష్టం అయిపోయింది. ఇతని సుప్రసిద్ధ వంశం పేరు (సాతవాహన లేక సప్తవాహన) ఆ వంశంవారి కుల దైవమయిన విష్ణువు మూలంగా వచ్చిందన్నమాట. నానాఘాట్ శాసనంలోని ప్రార్థనని పరిశీలించినట్లయితే మొదటి సాతవాహన రాజులు వృష్ణిసిరస్ (లేక వాసుదేవకృష్ణుడి)ని పూజించేవారని తెలుస్తుంది.[6] అసలు సిముకుడి సోదరుడి పేరు కృష్ణుడే. ప్రాచీన భారతీయరాజుల పేరులు చాలావరకు బ్రాహ్మణ మతం యొక్క దైవాలవే అయిఉంటాయి; వారి వంశ నామాలుకూడా ఈ దైవాల పేరులనుంచే ఉత్పన్నమవుతూ ఉంటాయి. మహామేఘవాహనుడు, విష్ణుకుండినులు మొదలయిన నామధేయాలు ఈ విధంగా వచ్చినవే.

"సాతవాహన అన్న వంశనామం సూర్యవంశపు రాజునే సూచిస్తుందేమో," అని గోపాలాచారి అన్నారు[7]; ఈ అభిప్రాయంతో ఏకీభవించటం వీలుకాదు. సాతవాహనులు క్షత్రియులని పయి సిద్ధాంతం సూచిస్తుంది. దీనిబదులు మేము మరొక సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నాము. "ఏక పుణస, ఏకధనుదరస, ఏకసురస, ఏకబమ్హనస" మొదలయిన బిరుదులు గౌతమీపుత్ర సాతకర్ణికి ఉన్నాయి. వీటినిబట్టి అతను ఒక శ్రేష్ఠమయిన ప్రముఖ బ్రాహ్మణ కులానికి చెందినవాడని గ్రహించవచ్చు.[8] అదే శాసనంలో గౌతమీపుత్రుడు "ఆగమాన నిలయస" (అంటే "వేదాది శాస్త్ర జ్ఞానస్య ఆధారస్య") అన్నమాటలతో వర్ణింపబడ్డాడు.

గోతమీబాలశ్రీ తను రాజర్షి వధువుని చెప్పుకుంది కనుక కొందరు పండితులు ఈ వంశం బ్రాహ్మణ–నాగ మూలం కలదని భావించారు. ఆమె సందేహం లేకుండా పట్టమహిషి అయింది; అందుచేత ఈ వర్ణన యదార్థమయినదని అనుకోవాలి. గౌతమీపుత్ర సాతకర్ణి తండ్రి ఒక క్షత్రియ రాజకుమార్తెని వివాహం చేసుకొని ఉండవచ్చు. అందువలన ఆమె రాజర్షి వధువు అయి ఉండవచ్చు. ఇది ఏకువాలికాలంలో జరిగిన వివాహం. దీనినిబట్టి సాతవాహనవంశం యొక్క కులాన్ని నిర్ణయించ నక్కరలేదు. గౌతమీపుత్ర సాతకర్ణి కొడుకు వాశిష్ఠీపుత్ర సాతకర్ణి ఒక శకరాజకుమారిని పెళ్ళిచేసుకున్నాడు. అందుకని సాతవాహనులు శకజాతికి చెందినవారని ఊహించలేము. రాజవంశాలలో అనులోమ వివాహాలు సాధారణంగా జరుగుతూనే ఉండేవి, మనువు వీటిని సమర్థించాడు కూడా.





2 వ బొమ్మ – సాతవాహనుని నాణెము. నెవాసా, క్రీ. పూ. 2 వ శతాబ్దము పరిమాణము 2/1.

అంతేకాక, గౌతమీపుత్ర యజ్ఞసాతకర్ణి శాసనం ఒకదానిలో "అరక" అన బిరుదు రాజా, మంత్రుల పేరులముందు కనిపిస్తుంది.

రెండవపంక్తి : అరకసిరియణ్ణ సాతకణిస.

నాలుగవపంక్తి : అరకమహా తరకేనమహా...[9]

ఈ అర్థవంతమయిన బిరుదుకి పండితులు అనేక విధాలుగా వ్యాఖ్యానాలు చెప్పారు. వీటి వాగ్వివాదాలలో పాలుగొనకుండా ప్రాకృత పదం 'అరక" అన్నది "అర్క" (సూర్యుడన్న అర్థంకల) పదం వచ్చిందని ఇక్కడ సూచించవచ్చు. విక్రమార్క, అర్కతేజ-వంటి 'మాటలలో వాడినట్టే అరకని వాడారనవచ్చు. అర్కశ్రీ అన్నపేరు సప్తవాహన' లేక 'సాతవాహన' అన్న వంశనామానికి పర్యాయ పదంగా వాడబడింది. అతని మంత్రి మహతరక పూర్తిపేరు ఇప్పుడు మనకి లభించటంలేదు.

## మొదటి సాతవాహనుల నాణాలమీద శ్రీవత్స చిహ్నం

మొదటి సాతవాహనుల నాణాలమీద కనిపించే చిహ్నాలలో 'శ్రీవత్స' చిహ్నం ప్రత్యేకమయినది. దీనికి విశేషమయిన ప్రాముఖ్యత ఉంది అందుకనే ఇక్కడ దీనినిగురించి చర్చ జరుపబడుతోంది. ఇంకా సూచనలు ఏవయినా ఉంటే కృతజ్ఞతతో స్వీకరింపబడతాయి.

సిరి సాతకర్ణి, సాతవాహన రాజుల నాణాలమీద కనిపించే అపూర్వచిహ్నం 'య్య' అని అనుకున్నారు ఎందరో పండితులు[10] ఇది 'య్య' కాదని స్పష్టంగా చెప్పవచ్చు.[11] ఇది మనకి తెలిసిన శ్రీవత్స చిహ్నంయొక్క అతి ప్రాచీన రూపం అనటంలో సందేహంలేదు.

శ్రీవత్సం అష్టమంగళాలలో ఒకటన్నది సువిదితం. విష్ణువు యొక్క విగ్రహం 'శ్రీవత్సాంకితవక్షం' కలదిగా వరాహమిహిరుడు వర్ణించాడు ప్రాచీన నాణాలమీద, శిల్పాలలో ఈ చిహ్నానికి శివ, విష్ణువులు ఇద్దరితోనూ సంబంధం ఉండేదని డా. జె. ఎన్. బెనర్జీ అంటారు[12] అయినా ఇది విష్ణువు, శ్రీలతోనే ఎక్కువ కలిసి కనిపిస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఇంకా చెప్పాలంటే భాగవతం మతంయొక్క ప్రారంభదశలో దీనికి 'వీరపూజ' (వీరవాదం)తో దగ్గర సంబంధం కలిగి ఉండేది. ఇది మొదటి సాతవాహనుల నాణాల మీద కనిపించే భాగవత చిహ్నం అని మా అభిప్రాయం[13] మహాపురుష లక్షణం కనుక బౌద్ధశిల్పంలో కూడా శ్రీవత్స చిహ్నం కనిపిస్తుంది. యక్షిణీ శిల్పాల కంఠాభరణాలలో మధ్య 'పూస'గా దీనిని చూడవచ్చు[14] భార్హుత్ కటకటాలమీద చెక్కబడిఉన్న తామర పువ్వు అలంకరణంమీద ఇది కనిపిస్తుంది.[15] బేస్నగర్ స్తంభంమీది గరుడుడి వక్షంమీద ఈ చిహ్నాన్ని ఇదే స్వరూపంలో చూడవచ్చు[16] లెక్కలేని శుభసూచకమయిన చిహ్నాలతోబాటు ప్రముఖంగా చెక్కబడి ఉన్న శ్రీవత్స చిహ్నం ఒకటి ఒక పాతబుద్ధ పాదంమీద కనిపిస్తుంది; ఈ బుద్ధపాదం క్రీ. పూ 2వ శతాబ్దానికి చెందిన అక్షరాలు కలిగి ఉంది. ఇది కేసనపల్లివద్ద దొరికింది.[17] అయినా, అమరావతి క్రీ.శ. మొదటి దశలలో ఇవి అంత సామాన్యంగా కనిపించదు

ఈ చిహ్నం తన అసలు రూపంలో కొన్ని సాతవాహన శాసనాలలో ఒక 'మంగళం'గా కనిపిస్తూనే ఉంటుంది[18] మహారాజ భారవేలుడి హాథిగుంప ప్రశస్తికల రాతిమీద ఇది మొదటి చిహ్నంగా అగుపించటం అర్థవంతమని గ్రహించాలి[19] ఈ చిహ్నంయొక్క స్వరూపం అచ్చు సాతవాహనుల నాణాలమీద స్వరూపాన్నే పోలి ఉంటుంది. అరుదుగానయినా కొన్ని పాతశిల్పాలలో "శ్రీ" తన 'సగం చిహ్నం స్వరూపం' (ఇంగ్లీషులో, 'సెమీ సింబాలిక్ ఫార్మ్' అని రచయిత రాశారు. అనువాదకుడు) లో కనిపిస్తుంది. దీనినే శ్రీవత్స శ్రీ అంటారు. ఇటువంటి చిత్రీకరణాన్ని కడప జిల్లాలోని చద్దముదియంలో దొరికిన శిల్పంమీద చూడవచ్చు.[20] శ్రీ శివరామమూర్తిగారు అన్నట్లు ఈ చిహ్నం స్వరూపం అప్పుడప్పుడు మారుతూ ఉండేది[21] కుషాన మధురకాలపు కళలో, తరువాత గుప్త కాలం నాటి కళలో ఇది ఒక నిలువుగీతకి ఇరువయిపులా 'S' గుర్తులుకల చిహ్నంగా కనిపిస్తుంది. కొన్ని సందర్భాలలో గీతని రెండుపక్కలా 'నాగ' చిహ్నాలు ఉంటాయి. కొన్ని సందర్భాలలో ఈ అంశాలన్నీ ఒక పట్టీతో 'కట్టబడి' ఉంటాయి.

సాతవాహన నాణాలలో మొదటివాటిలో ఈ చిహ్నం తన సాధారణ స్వరూపంలో కనిపించటమేకాక సంపూర్ణ మానవ స్వరూపంలోకూడా అగుపిస్తుంది. ఈ వంశానికి చెందిన రాజులందరిలోనూ బలవంతుడయిన రెండవసాతకర్ణి ఒక వయిపు లక్ష్మికల నాణాలు వెలువరించాడు. ఈ విధంగా అతను తన ప్రజలకి తన కులదైవం మీద ఎంతభక్తిఉందో నిరూపించుకున్నాడు. ఈ రకం నాణాలు పైఠాన్, కౌండిన్యపుర్, విదిశ ప్రాంతాలలో దొరికినట్టు వార్తలు వెలువడాయి.[22, 23, 24] వాశిష్ఠీపుత్ర పులుమావి, సాతకర్ణివంటి తరువాతి రాజులుకూడా ఈ నాణాలని తమ ముఖ్యమయిన వెలువ

ంపులమీద ( ప్రత్యేకంగా గుర్రం, సింహం కలవాటిమీద) ప్రదర్శించే వారు.[25]

అంటే, మొట్టమొదటినుంచీ శ్రీవత్స చిహ్నాన్ని సాతవాహన రాజులు వాడేవారనటంలో సందేహం లేదన్నమాట. ఈ వంశం రాజులు మొదటినుంచీ విష్ణువు, శ్రీలకి పూజ చేసేవారని స్పష్టం అవుతోంది. వారు ఎప్పుడూ తమ వంశంలో శ్రీ అన్న ఉపసర్గ వాడేవారు. శ్రీ అన్న గౌరవాన్ని సూచించే అక్షరం సాతవాహనులు ప్రసాదించిన సంప్రదాయమే.

## సాతకర్ణి

అసలు సాతకర్ణి అన్నపేరే కౌతుకాన్ని కలిగిస్తుంది. గోపాలాచారి ఎంతో సమంజసంగా చెప్పినట్లు సాతవాహన రాజులు, వారి

### శ్రీవత్స చిహ్నము



పై బొమ్మ – శ్రీవత్స, కల్పలతను ప్రదర్శించే అర చంద్రాకారపు శిలాఫలకము ఆంధ్ర ప్రదేశమందలి వానపల్లిలోనిది.
— (క్రీ. పూ. రెండవ శతాబ్దము).

సామంతులు, చివరికి వారి అధికారులుకూడా సాతకరి పేరు కలిగి ఉండేవారు [26] సాతవాహనులకు చెందిన శాసనాలను చూసినట్లయితే ఇది తెలుస్తుంది.వీటిలో ఈ పేరు కనిపిస్తుంది. [27] సాతకర్ణి అనే రాజా



4 వ బొమ్మ శ్రీవత్స

తన బలాన్ని నిరూపించుకున్న అనంతరం ఇది పరిపాటి అయి ఉంటుంది ఇతను రెండవ సాతకరి తప్ప మరెవరో కాకపోవచ్చు. మత్స్య పురాణంలో ఆరవవాడు, వాయుపురాణంలో నాలుగవవాడు, విష్ణు బ్రహ్మాండ పురాణాలలో అయిదవవాడు ఇతనే. ఈ పురాణాలన్నీ ఇతను 56 సంవత్సరాలు పాలించాడని చెబుతున్నాయి. మొదటి - సాతవాహన రాజులలో ఎవరూ ఇంత బలవంతుడుగా లేడు. ఇతను వెలువరించిన నాణాల సంఖ్య అధికంకనుక ఈ సూచనకి మరింత బలం ఏర్పడుతోంది.

మన ఈ అనుశీలన ఒక విషయాన్ని తెలుపుతుంది—సాత్వాహన లేక సప్తవాహన అన్న గృహదేవత పేరుముందు (విష్ణువు పేరు) వంశనామం తరువాత ఒక రాజవంశం నామం, తదనంతరం ఒకవ్యక్తి పేరు, సాతకర్ణికి పర్యాయపదం అయి, చివరికి బిరుదం [28] పేరు అయింది. (సాతవాహకాహారం) అన్న విషయమే ఇది. ఒక శకం కూడా ఈ పేరుని పెట్టుకుంది. [29] ఇంకా చెప్పాలంటే హాలుడనే సాతవాహనరాజా ఒక కవికూడా: ఇతను తమిళభాష పోషకుడుగా కూడా పేరు పొందాడు. 'నన్నూల్ మయిలయి నాథన్ ఉరయి'లో 'సాతవాహనం' అనే తమిళ గ్రంథానికి రచయిత పోషకుడికనుక పేరు పెట్టబడినట్లు చెప్పబడి ఉంది.

['ఇండికా' అన్న ఇంగ్లీషు పత్రికలో పడిన వ్యాసానికి అనువాదం.]

# అధోజ్ఞాపికలు

(1) డి. డి. కోసాంబి, "డెవలప్‌మెంట్ ఆఫ్ది గోత్రా సిస్టమ్" పి.కె. గోడె కమ్మెమొరేషన్ వాల్యూమ్ (పూనా 1960) 221. అంతేకాక అయస్సాతకర్ణి, లేదా సప్తకర్ణి (గుర్రం చెవి) చిహ్న టోటెమ్ (Totem) అని చెప్పారు.

(2) కాంప్రెహెన్సివ్ హిస్టరీ ఆఫ్ ఇండియా, కె. ఎ. నీలకంఠశాస్త్రి (1957 ప్రతి) II,299 పుట. దీనిని ఇక మీద సి.హెచ్.ఐ. అన్నఅక్షరాలతో సూచించటం జరుగుతుంది.

(3) హాలుడి 'సప్తశతి' లో హరి లేక త్రివిక్రముడు తక్కిన దేవుళ్లకన్నా ఎక్కువ అని చెప్పబడి వుంది. మొదటి సాతవాహన రాజులు వైదికమతానికి చెందినవారు, బ్రాహ్మణకులం వారు, ఒకప్పుడు విష్ణుభక్తులు అయినంత మాత్రాన వారు తక్కిన మతాలని అశ్రద్ధ చేశారని అనుకోనక్కరలేదు. అమరావతి, ప్రతిష్ఠానం, సాంచి, నాసిక్‌లో బౌద్ధ ఆరామాలు పెరిగి, అలంకరింపబడటం సాతవాహన రాజుల ఉదార బుద్ధికి తార్కాణం.

(4) డి. సి. సర్కార్, సెలెక్ట్ ఇన్‌స్క్రిప్షన్స్ బేరింగ్ ఆన్ ఇండియన్ హిస్టరీ అండ్ సివిలిజేషన్, (కలకత్తా 1965) 191, 33 వ చిత్రపటం, నెం. 1. దీనిని ఎస్. ఐ. అన్న అక్షరాలతో సూచించవచ్చు.

(5) ఎ. ఎ. విరాశీ, న్యూమిస్మాటిక్ సీరీస్, నెం. 4, హైదరాబాదు 1950 1—3.

(6) సి. హెచ్. ఐ. II, 384—388.

(7) అదే 300.

(8) సర్కార్ పయిన చెప్పినది 204, ఇంకా ఎపిగ్రాఫియా ఇండియా 8, 60 తరువాతి పేజీలు (ఎ. ఇం. అన్న పొడి అక్షరాలు గమనించాలి.)

(9) ఎమ్. వెంకటరామయ్య, జర్నల్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ, 43(1965) 242, ఓ. సి.

(10) హెచ్. డి. సంకాలియా, ఎస్. ఎ. దేవ్, జడ్. డి. అన్సారీ, సోఫియా ఎర్హార్ట్, ఫ్రమ్ హిస్టరీ టు ప్రి హిస్టరీ ఇన్ నెవాసా, పూనా 1960. ఈ పుస్తకం లో సాతకర్ణి 1, సాతవాహన నాణాల బొమ్మలు వివరాలు చాలా కనిపిస్తాయి. కొన్ని నాణాలు ఈ రాజువే అని మా పరిశోధనలు తెలిపాయి. ఆ పుస్తకం చూస్తే వివరాలు తెలియగలవు. ఇతరస్థలాలలో శ్రీవత్స చిహ్నంతో దొరికిన సాతవాహన నాణ్యా వివరాల కోసం జర్నల్ ఆఫ్ ది న్యూమిస్మాటిక్ సొసయిటీ ఆఫ్ ఇండియా (జె. ఎన్. ఎస్. ఐ.) 8, పుట 13, చిత్రపటం 2, నెం. 1. కొండాపూర్ ఉదాహరణల

వివరాలని అన్నల్స్ ఆఫ్ భండార్కర్ ఓరియంటల్ రిసర్చ్ ఇన్స్టిట్యూట్ (ఎ. బి. ఓ. ఆర్. ఐ.) 22, 181, చిత్రపటం 15, నెం. 1. ఎం. రామారావు, "సాతవాహన కాయిన్స్ ఇన్ ది ఆం. ప్ర. గవర్నమెంట్ మ్యూజియం, హైదరాబాద్ 1961, పుట 33 నెం. 17—19,22 ఎ. వి. మిరాశీ "స్టడీస్ ఇన్ ఇండాలజీ" అనే పుస్తకంలో 3 వ సంపుటం, పుట 6, చిత్రపటం 1, నెం. 2 లో సాతవాహనరాజు నాణాల వివరాలు ఉంటాయి. బులెటిన్ ఆఫ్ ది డెక్కన్ కాలేజి రిసర్చ్ ఇన్స్టిట్యూట్ 6, పుటలు 141—42,, మిరాశీ వంటిన చెప్పిన పుస్తకం చిత్రపటం 1, నెం. 1, జర్నల్ ఆఫ్ ది ఉస్మానియా యూనివర్సిటీ, ఒకటవ భాగం (1968), 123—135 పుటలలో ఆర్. సుబ్రహ్మణ్యం "ఎ యునిక్ సాతవాహన కాయిన్.

(11) జె. అలాన్, కాటలాగ్ ఆఫ్ ది కాయిన్స్ ఆఫ్ ఏన్షంట్ ఇండియా, లండన్ 1936, ఇంట్రడక్షన్ XXX, CXIII—CXIX 50—51.

(12) జె. ఎన్. బెనర్జీ, డెవలప్మెంట్ ఆఫ్ హిందూ ఐకనోగ్రాఫీ, కలకత్తా 1959, పుటలు 104—05, 131, 141. చిత్రపటం 1 బొమ్మలు 14—15, చి. ప. VIII, నెం. 4.

(13) సి.హెచ్. ఐ. 2, పుటలు 385

(14) ఇండియన్ టెంపుల్ ఎండ్ స్కల్ప్చర్, పారిస్ 1959, బొమ్మ 22.

(15) టి. ఎన్. బారువా, భార్హుత్ 3, కలకత్తా 1937, చి. ప. లు 37, 35.

(16) ఆర్కియాలజికల్ సర్వే ఆఫ్ ఇండియా, ఆన్యువల్ రిపోర్ట్, 1913—1914, పుట 241.

(17) ఇండియన్ ఆర్కియాలజి 1965—66, ఎ రివ్యూ, 1—4. (ఐ. ఎ. ఆర్.)

(18) ఆర్కియాలజికల్ సర్వే ఆఫ్ వెస్టర్న్ ఇండియా. 4 వ సంపుటం. ఇందులో చిత్రపటాలు , వివరాలు.

(19) ఎన్. ఐ. 1965, 37. శ్రీ శివరామమూర్తి ఖారవేలుడి శాసనంలో ఈ చిహ్నాలు కనిపించటం గురించి వేరే సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. "ఇది స్వస్తి శ్రీ అనటంతో సమానం. మంగళవాచకాన్ని ఈ విధంగా సూచించటం మనోహరంగా ఉంటుంది," అని ఆయన అంటారు. ఇది నిజమే కావచ్చు కాని అన్ని అర్థవంతమయినవి ఉండగా ఈ చిహ్నాన్ని మాత్రం ఎన్నుకొనటం గమనించాలి. వేరే అర్థం చెప్పటం కూడా ఉచితం. ఈ శాసనం ఖారవేలుడి దిగ్విజయాన్ని గురించి చెబుతుంది కనుక శ్రీవత్సం సాతవాహనుల సామ్రాజ్య చిహ్నం కనుక, ఖారవేలుడు సాతకర్ణి (1) మీద విజయాన్ని పేర్కొంటాడు. కనుక దీని ఎంపిక రాజకీయార్థం కలది అని మా అభిప్రాయం. సి. శివరామమూర్తి, "సాంస్క్రిట్ లిటరేచర్ ఎండ్ ఆర్ట్— మిర్రర్స్ ఆఫ్ ఇండియన్ కల్చర్" మెమొయిర్స్ ఆఫ్ ది ఎ. ఎస్. ఐ. 73, న్యూఢిల్లీ 1970, 98.

(20) ఏన్షంట్ ఇండియా, బులెటిన్ ఆఫ్ ది ఎ. ఎస్. ఐ. నెం. 6, న్యూ. ఢి. జనవరి 1950, చి. ప. 15—4.

(21) అదే పుటలు 43—46, బొమ్మ 29, చి. ప. 18—డి

(22) ఐ. ఎ. ఆర్. 1965—66, 1—55.

(23) ఎన్. జి. దీక్షిత్, ఎక్స్కవేషన్స్ ఎట్ కవుండిన్య పురా (బొం. 1968) 137, చి. ప. 40, ఎ—5.

(24) కె.డి.బాజిపాయ్, న్యూ సాతవాహన కాయిన్స్ ఎండ్ (పెర్స్పెక్స్) సెక్షనింగ్ టు సాతవాహనా హిస్టరీ' ఇది న్యూ.సొ. వారి 59 వ సమావేశంలో చదివిన వ్యాసం. ఐ. ఎ. ఆర్. 1967—68, పుటలు 24, 63 కూడా చూడాలి.

(25) కొండాపూర్ నుంచి గౌతమీపుత్ర సాతకర్ణి వెలువరించిన సీసం నాణాలకి ఎ. బి. ఒ. ఆర్. ఐ, 22, 181, చి. ప. 15, నెం .1—4 చూడాలి. ఈ రాజు కొన్ని నాణ్యముల మీద పద్మం, శంఖం వంటి వైష్ణవ చిహ్నాలు ఉంటాయి. కోస్తా ఆంధ్ర ప్రదేశంలో ఇవి దొరికినట్లు తెలుస్తోంది. అమరావతి వద్ద ఒక గుర్రం రకం నాణం దొరికింది.— దీని మీద సింహాసనం మీద ఉండే శ్రీవత్స చిహ్నాన్ని చూడవచ్చు. అంటే, గౌతమీ పుత్ర సాతకర్ణి తాను జయించిన ప్రాంతం మీద తన అధికారాన్ని చాటుతున్నాడన్నమాట. ఈ నాణం 'సాతవాహనకులయశః ప్రతిష్ఠాపనకర' (జి. ఎన్. ఎస్. ఐ 24, 178 — 179, చి. ప. 9, నెం. 19, 19 ఎ) అనే బిరుదాన్ని సమర్థిస్తుంది. వాసిష్ఠీ పుత్ర పులుమావి నాణాల మీద శ్రీవత్స చిహ్నాలు ఉంటాయి. డా. వి. కె.నారాయణ హైదరాబాదులో ఒక నాణం దొరికిందని చెప్పారు. దీని మీద చక్రం. అక్షరాలు ఉన్నాయి. (జె. ఎన్. ఎస్. ఐ. 27 164 మొదటిది జె. ఎన్. ఎస్. ఐ. 24, పుటలు 178—179 రెండవది) చక్ర పురుషుడయిన విష్ణువు ఈ నాణం చిహ్నం అనటంలో సందేహం లేదు. వాసిష్ఠీ పుత్ర శాతకర్ణి తన గుర్రం రకం నాణాల మీద శ్రీవత్సచిహ్నాన్ని ప్రదర్శిస్తానే ఉన్నాడు. (ఎ. ఏ. 21, 173) గౌతమీ పుత్ర సాతకర్ణి యజ్ఞశ్రీ చైత్యరకం నాణ్యములు— వంపులు ఆరు, స్వస్తికా రకం వాటితోపాటు— శంఖం, పద్మం, స్వస్తికా గుర్తులని ప్రదర్శిస్తాయి. తీరాంధ్రప్రదేశంలో దొరికిన నాణాలు దీనిని స్పష్టంగా నిరూపిస్తాయి. బులెటిన్ ఆఫ్ ది మదరాసు ప్రభుత్వం మ్యూజియం 1939, 16 రెండవ పులుమావి, యజ్ఞశ్రీల నావ రకం నాణాలు చేప, శంఖము, కలిగి ఉంటాయి. చైత్య రకం ఎక్కువగా పద్మం, శంఖం, పద్మనిధి, శంఖనిధి కాక విష్ణువు, శ్రీలు కలిగి ఉంటాయి.

(26) సి. హెచ్. ఐ. 300.

(27) ఖారవేలుడి హాథిగుంప శాసనంలో ఇలాగ ఉంది— అచితయిత సాతకమ్ణిమ్ (ఎన్. ఐ. 213, 1.4) రుద్రదాముడి గిర్నార్ శాసనంలో— దక్షిణాపథ పతేస్ — సాతకర్ణేర్ — ద్విర్ — అపి. . . అని ఉంది. ఇ. ఐ. 8, 44, 1.12 శాంతి వర్మ యొక్క తాళగుండ శాసనంలో "ప్రేమ్ప్స్ కేస్— సాతకర్ణి — అర్చిన్" అని ఉంది. (ఇ. ఐ. 8, 33 1.14)

(28) రెండవ పులుమావి జంగ్ని గుండు శాసనం (మ్యాకదోని శాసనం) (ఇ. ఐ. 14, 153—155. శివస్కందవర్మ యొక్క హిరహడగల్లి రేకులో "సాతహని రట్ఠే' అన్న మాటలు ఉంటాయి. ఎన్. ఐ. 463, 1.27

(29) సి. హెచ్. ఐ, II, 294, నోట్ 1.

# రక్తయజ్ఞం

## శ్రీ కలువకొలను సదానంద

ఎండ కౌగిటో జారిపోయే పసుపుటి పిల్లకాలువలోని చేపపిల్లలా,

మిలమిలలాడే అందమైన కళ్ళు.

సంపంగి మొగ లాంటి ముక్కు.

కెంపుల్లాంటి పెదాలు

అద్దాలవంటి చెక్కిళ్ళు.

మెత్తగా, ఒయ్యారంగా—వీపు మీదుగా జలపాతంలా కిందికి జారిన నల్లని వాల్జడ.

పచ్చని కొండకోనల అంచులను స్పృశించే పండు వెన్నెలలా నిండు యౌవనాన్ని కౌగిలించుకొన్న చామనచాయ.

ఎంత ఆశ్చర్యకరమైన సౌందర్యం!

సృష్టి లోని అందాలన్నీ ప్రోగై ప్రాణంపోసుకుని ఈ అమ్మాయిగా పుట్టిందేమో!

ఆమె తలలో తెల్లని మల్లెలు తురుముకొన్నది. లేత నీలం రంగు పువ్వుల పరికిణీ కట్టుకొన్నది అదేరంగు చోళీ తొడుక్కున్నది. తెల్లపువ్వుల లేత ఆకుపచ్చరంగు వోణీ వేసుకుంది. ఈ రంగుల్లో ఆమె పురివిప్పిన నెమలిలా వుంది.

నీలంరంగు కంటబడితే—మనస్సును జోకొట్టి నిద్రపుచ్చినంత హాయిగా వుంటుంది. సుందరానికి. నీలంరంగు ఆరోగ్యకరమైన రంగు. కళ్ళు చెదిరే తీక్షణత, మనస్సు భరించలేని ప్రకాశం అందులో వుండవు. నీలిమ కంటికి కాటుక లాంటిది. మనస్సుకు పన్నీటి వాన లాంటిది నీలాంబరాలలో ఆ అమ్మాయి ప్రశాంతికి అధి దేవతలా వుంది.

సుందరం ఆమెనే చూస్తున్నాడు.

ఆ అమ్మాయి అందమంతా ఆమె కళ్ళలో సింహాసనం వేసుకు కూర్చున్నది. ఆ కళ్ళలో ఆకాశపు వైశాల్యం, సముద్రపులోతు ఇమిడిపోయాయి. ఆ కళ్ళు మాటిమాటికీ అతనిమీదికే వాలు తున్నాయి. 'మళ్ళీ ఎన్నేళ్ళకు కనిపిస్తున్నావు!' అంటూ పలక రిస్తున్నాయి.

ఎదిలో పచ్చని పెళ్ళిపందిరి. పందిరిక్రింద కళ్యాణవేదిక. వధూవరులు పీటలమీద కూర్చున్నారు. పురోహితుడు మంత్రాలు వల్లిస్తున్నాడు. పెండ్లికి వచ్చిన జనం పందిటినిండా కూర్చున్నారు. పన్నీటి వాసనలు, పువ్వుల ఘుమఘుమలు, పట్టుచీరల రెపరెపలు, చేతిగాజుల గలగలలు, నవ్వుల కలకలలు, కనె సిల వాలుచూపులు... మన్మథుడు కొలువుదీరిన నిండుసభలా వున్నది పెండ్లిపందిరి.

సుందరం బస్సుదిగి, సరిగ్గా ముహూర్తవేళకు పందిట్లో అడుగుపెట్టాడు. పెళ్ళికొడుకు తనకు దగ్గరిబంధువు. ముహూర్తం దాటిపోకముందే చేరగలిగినందుకు తేలిగా నిట్టూర్చాడు సుందరం.

అతను కళ్యాణవేదికవైపు ఒకసారి చూశాడు. అలాచూసిన మరుక్షణమే ఆ అమ్మాయి అతని దృష్టిని ఆకర్షించేసింది. పెళ్ళి కూతురికి కాస్త దగ్గరగా కూర్చున్నది ఆమె. సుందరం వచ్చిన మరుక్షణమే అతన్ని తన చూపులతో కట్టిపడవేసింది. ఆమె మెడ త్రిప్పినా, ముందుకు వంగినా, సన్నగా నవ్వినా, వెనక్కితిరిగినా ఎందుకో కొద్దిగా విసుగును ప్రదర్శించినా—సుందరం మనస్సెందుకో తెలియరాని మాధుర్యంతో ఉక్కిరిబిక్కిరౌతున్నది.

శాంతమ్మత్త జ్ఞాపకం వచ్చిందతనికి. ఆమెకోసం పంది

ంతా చూపులు సారించాడు. శాంతమ్మత్త కనిపించింది. ఆమె ింట్లో పరికి, పందిట్లోకి తిరుగుతూ పెళ్ళింతుకు అవసరమైన సామానులు ఒక్కొక్కటీ అందించే పనిలో వుంది.

సుందరం మళ్ళీ ఆ అమ్మాయివైపు చూశాడు. పందిటిమీద పరచిన కొబ్బరిమట్టల నడుమలోంచి ఉదయపు చిలిపి ఎండ ఆమె చెక్కిలిమీదపడి చురుక్కున్న పడి ముద్దు పెట్టుకొన్నది. ఆమె చెంపకు చేయి అడ్డం పెట్టుకున్నది. పక్కన కూర్చున్న పిల్లకు తన చూపుతోనే సుందరాన్ని చూపించి, ఆమె మీదికి ఒదిగి మెల్లగా ఏమో అంటున్నది.

అతను ఉలికిపడ్డాడు. గోటుమేళం ఢమ ఢమ్మమంటూ అతనిగుండెలో ప్రతిధ్వనించింది. వరుడు పెళ్ళికూతురికి మంగళ సూత్రం కడుతున్నాడు. అందరూ అక్షింతలు చల్లుతున్నారు సుందరం చెయ్యి కాస్త ఆలస్యంగా పైకి లేచింది. అతను గురిచూచి ఆ అమ్మాయి నెత్తిమీద పడేటట్టు అక్షంతలు విసిరాడు.

ఆమె తలెత్తి అతనివైపు చూచింది. నెత్తిమీది అక్షంతల్ని దులుపుకుంటూ తలొంచుకుని సన్నగా నవ్వుకొంది. ఆమె ప్రక్కన కూర్చున్న పిల్ల ఆ యిద్దర్నీ చూస్తూ వెకిలిగా నవ్వింది.

'రామయ్య పెళ్ళికొడుకాయెనే, మా సీతమ్మ పెళ్ళికూతురాయెనే' అంటూ సన్నాయి వాయిస్తున్నారు మేళగాండ్రు. పెళ్ళికి వచ్చిన జనమంతా ఒకరొక్కరే పందిరి బయటకు వెళ్ళిపోతున్నారు. చదివింపులైపోయిన తరువాత నూతన దంపతులు కూడా లేచి ఇంటి లోపలికి వెళ్ళిపోయారు.

అది డబాయిలు. పెద్దదే. అయితే పెళ్ళికి వచ్చిన చుట్టాలు ఎక్కువ కాబట్టి ఇల్లు చాలటంలేదు అప్పటికప్పుడే కొందరు సెలవు తీసుకుని ప్రయాణమైపోయినా—సందడీ, రద్దీమాత్రం తగ్గలేదు.

పెళ్ళికి వచ్చిన లోడికోడళ్ళతో మాట్లాడుతూ హాల్లో కూర్చున్నది శాంతమ్మత్త. అక్కడే ఒకవారగా కోడరు అనుకుని కూర్చున్నది, సుందరాన్ని ఆకర్షించిన ఆ అమ్మాయి.

సుందరం హాల్లో పలికి తొంగిచూశాడు శాంతమ్మత్త చిరునవ్వులో అతన్ని పరామర్శించింది.

'రా నాయనా సుందరం బాగున్నావా?'

'బాగున్నానత్తయ్యా!'

'అమ్మ కులాసాయే గదా ?'

'ఊఁ!'

ఆ అమ్మాయి కళ్ళు కిందికి వాల్చి, చూపులు మాత్రం సుందరంపైన నిలిపి, కొంగుకొసి వేలికి చుట్టుకుంటోంది.

అందరు ఆడవాళ్ళమధ్య హాస్యమాడాలనిపించింది సుందరానికి. ఆ అమ్మాయిని కొత్తమనిషిని చూచినట్టు చూస్తూ 'ఆ పిల్ల ఎవరత్తయ్యా?' అని అడిగాడు.

ఆ ప్రశ్న విని శాంతమ్మ నవ్వింది.

ఆ అమ్మాయి కూడా నవ్వింది, నోట్లో దాచుకున్న ముత్యాల వరుస బయటపడేలా.

'ఎవరో దాన్నే అడుగు నాయనా !'

'తెలియనట్టు అడుగుతావేంరా సుందరం? అది నీ పెళ్ళామే కదా!' అన్నది శాంతమ్మ లోడికోడలొకామె.

అందరూ నవ్వేరు.

ఆ పిల్ల ముఖం సిగ్గుతో ఎరబారింది.

ఆమె ఎవరో అతనికి తెలుసు.

'ఏం సుశీ?...' అన్నాడు.

'ఏం బావా?...' అంది.

బావా అనే సంబోధన అతనికి కొత్తగాను, వింతో తీయగానూ వుంది. అంతమందిలో ఆమెతో ఏం మాట్లాడాలో అతనికి తోచలేదు సిగ్గువేసింది శాంతమ్మవైపు తిరిగి, 'మామయ్య కూడా వచ్చాడా అత్తయ్యా?' అన్నాడు.

'బయట వున్నారు, చూడు నాయనా!'

సుందరం బయటకు నడిచాడు.

'సుశీల పెళ్ళి ఎప్పుడు చెయ్యాలనుకున్నావక్కా ?' అని అడిగింది లోడికోడలు

'వాడేమంటాడో తెలుసుకోవద్దా?' అంది శాంతమ్మ.

'ఏమంటాడు? వద్దనకుండా చేసుకు టాడు. ఇదేమన్నా వాడంటే ఏమోగానీ...'

సుశీలలేచి వంటింటివైపు వెళ్ళి యింది.

ఆ మాటలా సుందరం చెవిలో పడాయి.

'సుశీల పొద్దంటుందా? ..అలాఅనేస్తే, తరవాత ఈ బతుకు బతక్కాలేం?...అనదు. నాకు తెలుసు!...నాకుగాక యింకెవరికి తెలుసు?...'

* * *

శాంతమ్మ సుందరానికి మేనత్త అవుతుంది.

భర్తతో, ఐదుగురు పిల్లలతో ఓ పల్లెటూళ్ళో వుంటోంది ఆమె.

సీనయ్యమామ ఓ చిన్నపాటి రైతు. తనకున్న ఎకరం మాగాణితో, నాలుగెకరాల మెట్టభూమితో సంసారం గడుపుకుంటున్నాడతను.

సుశీల వారి మొదటి సంతానం.

చిన్నప్పటినుంచీ ఆమెతో సుందరానికి బాగా చనువు వుంది. అప్పుడప్పుడూ సెలవుల్లో అత్తయ్య యింటికి వెళ్ళేవాడతను. అక్కడ సెలవులంతా సరదాగా గడిపి యింటికి తిరిగి వెళ్ళేవాడు.

తాను సుశీలను చివరిసారిగా చూచి యిప్పటికి ఐదేళ్ళవుతున్నాయి. ఐదేళ్ళక్రితం స్కూల్ఫైనల్ పరీక్ష రాసి, వాళ్ళింటికి వెళ్ళాడు తాను. నెలరోజులపాటు అక్కడే వున్నాడు.

మరపురాని రోజులవి.

సహజ సౌందర్యాన్ని, చల్లదనాన్ని, పచ్చదనాన్ని, ప్రశాంతతను ప్రేమించే తనకు ఆ పల్లె వాతావరణం మనస్సుకు హత్తుకు పోయేంత హాయినిచ్చింది. చుట్టూ పచ్చని పైరులు, చెరకుదోటలు, మామిడితోపులు, వాటిచుట్టూ ఎర్రటి గుట్టలు, ఆ గుట్టల అంచులో మేసే ఆలమందలు, పల్లెచుట్టూ పొలాల్లో ఎక్కడ చూసినా ఏదో ఒక పనిచేసుకుంటూ కనిపించే పల్లెప్రజలు...ఇంకా తన కళ్ళకు కట్టినట్లే వున్నాయి ఆ దృశ్యాలు. ఎండ, ఎండలో చెట్ల కింద నీడలు, నీడల్లో చల్లదనం; నీలాకాశం, బరువుగా కదిలే మబ్బులు, వాన, వానలో స్నానమాడే చెట్లు, వాన జల్లులోని పులకింత, వాన వెలసిన తరువాత కాళ్ళక్రింద జారే బురద, ఆకాశంలో మెరిసే ఇంద్రధనుస్సు...బాగా జ్ఞాపకం వున్నాయి.

పిల్లలంతా జట్టుగట్టి పొలాల వెంబడి తిరిగేవాళ్ళు. సీమచింతకాయలు, వెలక్కాయలు, మామిడిపిందెలు కోసుకుని తినేవాళ్ళు. బావుల్లో ఈదులాడేవాళ్ళు. కోతికొమ్మలాట లాడేవాళ్ళు.

పల్లె పక్కనే చెరువు వుంది. సుందరం రోజూ సాయంకాలాల్లో ఆ చెరువు గట్టుమీదికి వెళ్ళేవాడు. చెరువులోని నీళ్ళు అలలు అలలుగా ఒడ్డును తాకేవి. చెరువుమీదినుంచి చల్లని గాలి దూసుకొచ్చేది. పడమటి ఆకాశం ఎర్రగా నీళ్ళలో ప్రతిబింబించేది. తెల్లటి కొంగలు గట్లవెంబడే ఎగురుతూ పిలుచిక్కినప్పుడల్లా చటుక్కున చేపల్ని నోటగరచుకునేవి. రైతులు నీళ్ళలో దిగి పశువుల్ని కడిగేవారు. పల్లె పడుచులు గడ్డిమోపులు తలపైన బెట్టుకుని చెరువుగట్టుమీదుగా నడిచి వచ్చేవాళ్ళు. దూరంగా ఒకవైపునుంచి కోయిల కూత వినబడేది. మరోవైపునుండి ఎవరో పాడే పల్లెపాటలు గాలిలో సన్నగా తేలివచ్చేవి. సుందరం ముగ్ధుడై పోయి కూర్చునేవాడు. అప్పుడప్పుడూ తాను చూచిన దృశ్యాలను కాగితంమీద చిత్రించేవాడు. వాటిని సుశీల కిచ్చేవాడు. ఆమె వాటిని తీసుకెళ్ళి తన స్నేహితురాండ్రకు చూపేది.

ఆ పల్లెలో చాలమందిని పూరిండే! సీనయ్య మామది కూడా! విశాలమైన లోగిలిలో ఐదేసి అంకణాల పూరిండ్లు రెండున్నాయి. వంట చేసుకోటానికి ఓ చిన్న గుడిసె వుంది. ఇంటి వెనక పెదబావి, పెరడూ వున్నాయి ఇంటిచుట్టూ కోటగోడలా పెద్ద మదురుగోడ. ఆ గోడల పై భాగంలో చేతులు చీరేసే గాజుముక్కలు అయినా, తాను ఆ గోడలమీద ఎంతో చాకచక్యంతో నడిచేవాడు. ఆగోడమీదినెక్కి, పెరట్లోని మునగచెట్టునుంచి మునగకాయలు కోసేవాడు: అతను మునగకాయలు కోస్తూంటే, సుశీల క్రిందవుండి వాటిని ఏరుకునేది.

ఆ యింట్లో ఒక పాలిచ్చే గేదె వుండేది. పాలు, పెరుగు, మజ్జిగకు కొరతేవుండేదికాదు. సుందరం ఒక్కోసారి సందాగా దాని పగ్గంవిప్పి చేతబట్టుకుని మేతకోసం పొలాలవెంబడి తోలుకు వెళ్ళేవాడు. అప్పుడు సుశీల గంప, చెక్కుడుపారతీసి చంకన బెట్టుకుని 'గడ్డికి పోదాం' అంటూ వెంటబడేది.

ఆమె సుందరానికంటే మూడేళ్ళు చిన్నది అప్పుడే ఎనిమిద తరగతి పరీక్ష వ్రాసింది. సన్నగా వుండేది. పావడ, జాకెట్టు వేసుకునేది. నోరుకాస్త దుడుకు. సుందరం అంటే మర్యాద చూపేది కాదు. అతనితో గిల్లికజ్జాలు పెట్టుకునేది. అతని

సుందరం' అనే పిలిచేది. కయ్యాలాడుకున్నప్పుడు 'ఒరే' అనేది. సుందరానికి ఒళ్ళు మండిపోయేది అతను ఆమెను గట్టిగా పట్టుకునే వాడు ఆమె రెచ్చిపోయి, అతన్ని బూతులు తిట్టేది.

నెలరోజులుండి చాలా నిరాశతో యింటికి మరలిపోయాడు. సుందరం అతవి నిరాశకు కారణం సీనయ్య మామ!...సుందరం చాలా తెలివైనవాడు. స్కూల్ ఫైనల్ దాకా మంచిమార్కులతో ప్యాసవుతూ వచ్చాడు. అతనికి కాలేజీలో చేరాలనివుంది. స్తోమతులేదు. శాంత మ్మత్త కంటే అప్పు తలంకెవరూలేరు. కాలేజీలో చేరటానికి సీనయ్య చేయూత లభిస్తుందని అతడు ఆశించాడు. అయితే సీనయ్య నుండి అతనికి నిరాశాజనకమైన సమాధానం వచ్చింది. 'నన్నేంచెయ్య మంటావు నాయనా?... నీకు సహాయపడగల స్థితిలో ప్రస్తుతం లేను. నా పరిస్థితి కూడా ఏమీ బాగాలేదు ఈఏడు వర్షాలూలేవు. పంటలా-పండలేదు అప్పుల్లో వున్నాను. ఏమీ అనుకోవద్దు. ఏదైనా ఉద్యోగం కోసం ప్రయత్నం చెయ్యి అంతగా నీకు కాలేజీలో చేరాలని వుంటే, ఈ సంవత్సరం ఎలాగో అవసరము. వచ్చే సంవత్సర మైనా నా పరిస్థితి బాగుంటుందేమో చూద్దాము? అన్నాడు.

సుందరం యింటికి వెళ్ళిపోయాడు.

అతనికి శాంతమ్మత్త మీద, సీనయ్యమామమీద కోపం వచ్చింది. ఇంకెప్పుడూ వాళ్ళవూరికి వెళ్ళకూడదని, వాళ్ళముఖం చూడకూడదని ఏదైనా ఉద్యోగం సంపాదించుకుని వాళ్ళ కన్నులు కుట్టేలా వచ్చగా బతకాలనీ అనుకున్నాడు.

అతనికి సుశీలమీదకూడా కోపం వచ్చింది. తనమీద వాళ్ళకు అమాతం అభిమానం లేకపోతే, వాళ్ళమ్మాయిని తానెందుకు పెళ్ళిచేసుకోవాలి? దాన్ని చేసుకోకూడదు. బోడిపిల్ల! ప్రపంచంలో తనకు వేరే పిల్లే దొరకదా?...అనుకున్నాడు.

ఐదేళ్ళు గడిచిపోయాయి.

మళ్ళీ అతనప్పుడూ ఆవూరు వెళ్ళలేదు. కాలక్రమాన అతని పసితనపు పట్టుదల సడలిపోసాగింది. సుశీల మాత్రం అతని హృద యంలో స్థిరంగా పీటవేసుకుని కూర్చుండిపోయింది. 'సుశీల ఈ పాటికి వోణీ వేసుకుంటూ వుంటుంది. ఇప్పుడు పెద్దదై వుంటుంది...అప్పుడప్పుడూ నన్ను గురించి తలపోస్తూ వుంటుంది... నేనెప్పుడైనా వాళ్ళవూరికి వస్తానని ఎదురుచూస్తూ వుంటుంది... నన్ను చూడాలని తహతహపడుతూ వుంటుంది...' ఈ విధంగా అతని ఆలోచనలు పరుగెత్తేవి.

సుశీల యిలా హఠాత్తుగా తనకంటబడుతుందని అతడనుకో లేదు. సుశీల పెద్దదైంది అవయువాలు నిండుగా ఎదిగి, అందమే పోతపోసుకున్నట్టుంది. ఇప్పుడామె ఎస్. యస్. ఎల్. సి. పూర్తిచేసి చదువు మానేసింది. ఆమె సోగకళ్ళను, సంస్కారయుతమైన ప్రవర్తనను చూచి, అతని మనస్సు ఒక విధమైన గౌరవభావంతో నిండిపోయింది. ఆమె వన్నని మెడకు తాడుకట్టి, ఆ భువన మోహన సౌందర్యాన్ని, ఆ మధురతర యౌవనాన్ని తనదిచేసుకోవాలనిపిస్తోంది

'సుశీలా! నా సుశీలా! ఎప్పుడు? ఆ మధురవేళ ఎప్పుడు?' అంటూ అతని గుండె కలవరించింది.

* * *

సాయంకాలం కాబోతున్నది.

సుశీల కనిపించటంలేదు.

సుందరం ఏదో పనివున్నట్టు కలవంతా ఓసారి కలయదిరిగి, వీధిలోకి వచ్చాడు. ఇంటి పక్కన పంటచేల దూరంలో ఓచిన్న మామిడితోట వుంది. ఆతోటలో కొందరు చిన్నపిల్లలు కనిపించారు. వాళ్ళ మధ్య సుశీల కనిపించింది

సుందరం తోటవైపు నడిచాడు.

మామిడిచెట్లు పూతదొడగలేదు. ఆకులింకా చిగురెత్తా పెట లేదు. పలగా ముదిరిపోయిన ఆకులు గలగలమంటున్నాయి. ఆ తోటలో ఒకవైపున జామచెట్టుంది. పిల్లలంతా రాళ్ళతో పిందెల్ని రాలగొడుతున్నారు. సుశీల పైకి గెంతుతూ కిందికొమ్మలో వున్న దోరకాయను అందుకోటానికి ప్రయత్నిస్తూవుంది. సుశీల పెద్దతమ్ముడు కిరీటి గిటారు కొమ్మలో కూర్చుని వున్నాడు.

సుందరం ఆమె దగ్గరికి వెళ్ళాడు.

జాంకాయలు కోసుకుంటున్నావా సుశీ?'

ఆమె మాట్లాడలేదు. ఓ పిందెను కసుక్కున కొరికి అవతల పారేసింది.

ఆమెతో ఏదో ఒకటి మాట్లాడాలని తొందరగా ఆలోచిస్తు న్నాడు సుందరం. 'ఉదయం, నీ పక్కన కూర్చున్న పిల్లలో ఎవరిటే నువ్వంటున్నదీ?' అన్నాడు.

ఆమె చిటారు కొమ్మనెవైపు చూస్తూ 'నిన్ను గురించి కాదులే !' అంది.

'నన్ను గురించే ! నాకు తెలుసు !'

'అక్కయ్యా ! మంచి పండు దొరికింది. ఇదిగో...' అంటూ కొమ్మపైనుంచీ కేకవేశాడు కిరీటి.

దబ్బుమంటూ పండు నేలమీద పడింది.

సుశీల వంగి, దాన్ని చేతికి తీసుకుని కొంచెం కొరుక్కుంది. మిగిలిన పండు సుందరం చేతిలోకుక్కి, తోటలోనుంచి గబగబా వెళ్ళిపోయింది.

సుందరం ఆ పండువైపు చూశాడు.

'ఇది ఉడత కొరికిన పండుకాదు. చిలక కొరికిన పండు కాదు. సుశీల కొరికిన పండు ! ఆహా ! దీనిముందు అమృతం ఎందుకూ ?'

* * *

సాయంకాలమైంది.

సీనయ్య మామవాళ్ళు బంధువులందరిదగ్గర సెలవు తీసుకుని ప్రయాణానికి సన్నద్ధమౌతున్నారు.

'ఏం సుందరం ? మావూరికి రావడం బొత్తిగా మాను కున్నావు. వీలుచేసుకుని మీ అమ్మను తీసుకుని ఒకసారి రారాదూ?' అన్నాడు సీనయ్య.

'వస్తాంలే మామయ్యా!...ఇప్పుడు మా యింటికొచ్చి వెళ్ళ రాదూ మీరు?'

'ఎక్కడి పని అలాగే వున్నాయి సుందరం. తీరిక దొరికాక వస్తాంలే!'

'నువ్వైనా రాకూడదా అత్తయ్యా?'

'వొనండీ!...మా వదిన్ని చూసి చాలా రోజులైంది. సుంద రంతో వెళ్ళి ఓ రోజు వుండి వస్తాను.' అంది శాంతమ్మ.

'సరే! క్షేమంగా వెళ్ళి లాభంగా రా!' అంటూ నవ్వాడు సీనయ్య.

అందరూ రోడు మీదికి వచ్చారు.

కొంతసేపటికి సీనయ్య వాళ్ళు వెళ్ళవలసిన బస్సు వచ్చింది సీనయ్య, పిల్లలు బస్సులోకి ఎక్కి కూర్చున్నారు.

సుందరం సుశీలవైపు చూశాడు.

'వెళ్ళొస్తా బావా!' అంది సుశీల.

'వెళ్ళిరా సుశీ!'

వెడుతూన్న బస్సులోనుంచి స్నేహపూర్వకంగా చేయివూపింది సుశీల. బస్సు కనుమరుగైపోయింది.

సుందరం తీయని బాధతో నడిచి వెళ్ళి రోడు ప్రక్కన చింత చెట్టు క్రిందవున్న రాతి తిన్నెమీద అత్తయ్య ప్రక్కన కూర్చున్నాడు.

శాంతమ్మ అతన్ని చూస్తూ కూర్చున్నది. సుందరం సిగ్గు పడి తలొంచుకున్నాడు.

'సుశీలకు సంబంధాలొస్తున్నాయి బాబూ! వాళ్ళకు ఏమీ చెప్పలేకుండా వున్నాము...ఏమంటావు నువ్వు?'

'...మీ ఇష్టం అత్తయ్యా!'

'అంటే...?'

'మీరు ఏం చేసినా నాకు సంతోషమే!'

'సుశీలను నీ కివ్వనా ?'

సుందరం నవ్వాడు.

'అమ్మతో కూడా ఒకమాట చెప్పత్తయ్యా!'

'మరిప్పుడు—నేను నీవెంట రావడం ఎందుకనుకున్నావు?...'

అంతలో బస్సు వచ్చింది. ఇద్దరూ బస్సులోకి ఎక్కారు.

గతుకుల రోడ్డుమీద బస్సు దిగుతూ ఎక్కుతూ మలుపులు తిరుగుతూ పోతోంది. కిటికీలలోంచి గాలి చల్లగా వీస్తోంది. పడమటి ఆకాశం ముఖంనిండా కుంకుమ పులుముకుంటోంది. రోడ్డు ప్రక్కన పచ్చని చెట్లు, పొలాలు వెనక్కి పరుగిడుతున్నాయి. పొలాలో పని ముగించుకొన్న రైతులు ఇళ్ళకు మరలుతున్నారు. ఆకాశంలో పక్షులు బారులు తీరి ఎగురుతున్నాయి.

ఇవేమీ సుందరానికి కనిపించటంలేదు.

అతని సంచేం 'దియాలూ ఇక్కడలేవు.

అవి సుశీలతోబాటుగా మరో బస్సువెంట దూసుకు పోతున్నాయి.

...ఇప్పుడు సుశీల ఆ బస్సులో కూర్చుని వుంటుంది. తనలాగే పరధ్యానంగా వుంటుంది తనను గురించే తలపోస్తూ వుంటుంది పాపం తన గుండెలోలాగే ఆమె గుండెలోనూ తీయనిబాధ సుళ్ళు తిరుగుతూ వుంటుంది...ఆహా! ఈరోజు ఎంత మంచిరోజు! బతుకంతా యిలాంటి రోజులేవుంటే ఎంత బాగుంటుంది!...బహుశా మోక్షమంటే అదేనేమో!

ఐదుమైళ్ళూ ఐదు చిటికెలో వెనక్కు జారిపోయాయి.

'సుందరం! లే! వూరొచ్చేసింది!' అంటూ వీపు తట్టింది శాంతమ్మ.

## 2

ఈ రోజుల్లో సామాన్యుడు మానమర్యాదలతో గుట్టుగా బ్రతకాలంటే కేవలం ఒక్క ఉపాధి మాత్రమే చాలదు. ఏదో విధమైన అదనపు సంపాదనకూడా వుండాలి. కొద్దిపాటి ఆస్తిపాస్తులైనా వుండాలి. కనీసం నెలనెలా అద్దెచెల్లించే దౌర్భాగ్యం లేకుండా ఓ చిన్న స్వంత యిల్లయినా వుండాలి. అంత మాత్రమైనా లేనివాడు మనిషిగా పుట్టడంకంటే మాన్నై పుట్టడం మేలు!

సుందరం మనిషే! అతనికి ఆ వూళ్ళో ఓ పెంకుటిలు వుంది.

తండ్రి యిచ్చిపోయిన స్థిరాస్తి అది.

సుందరం తండ్రి ఏదో చిన్న ఉద్యోగం చేసుకుంటూ వుండేవాడు. ఒక్క శాంతమ్మతప్ప అతనికి అక్కచెల్లెళ్ళుగాని, అన్నదమ్ములుగానీ లేరు. తాను సంపాదించి చెల్లెలికి స్వయంగా పెళ్ళి చేశాడతను. అతని భార్య రాజమ్మ. సుందరం ఒకడే కొడుకు. ఆ కొడుకుమీద అతనికి ఎన్నో ఆశలుండేవి. వాణ్ణి బాగా చదివించి, కొండంతవాణ్ణి చేయాలని అతడు కలలుగనేవాడు. కానీ, దురదృష్టవశాత్తూ— సుందరానికి పదేళ్ళయినా నిండకముందే అతడు ఈ లోకాన్ని వదలి వెళ్ళిపోయాడు.

అతడున్నంతవరకు యింటి గడప దాటకుండా బ్రతికింది రాజమ్మ. ఆమెకు లోకానుభవం లేదు. తన పసుపుకుంకం చెదిరిపోగానే—తనచుట్టూ చీకటి అలుముకున్నట్లయింది ఆమెకు. తనను, తనబిడ్డను ఆదుకోగల ఆప్తులెవరూ కనిపించలేదు.. అపరకర్మకు వచ్చిన చుట్టాలందరూ ఓదార్చి, ధైర్యం చెప్పి వెళ్ళిపోయారు.

రాజమ్మ జారిపోయే ధైర్యాన్ని కూడదీసుకుంది. 'నాయనా! నేనున్నానురా బాబూ! నిన్ను మీ నాన్నలా పెంచుతాను నిన్నో యింటివాణ్ణి చేసి తీరతాను...' అంటూ కొడుకును ముద్దుపెట్టుకుంది. ఆమెకు వాడు, వాడికి ఆమె తోడుగా మిగిలారు.

పొట్ట గడపటానికి పొరుగిళ్ళలో పాచిపని మొదలుపెట్టింది రాజమ్మ. నిమిషమైనా తిరుబడి లేకుండా కష్టపడేది. వాళ్ళిచ్చే ఉపాహారమో, తినుబండారమో ఆదరాబాదరా యింటికి తీసుకువచ్చి సుందరానికిచ్చేది. పొరుగిళ్ళ కూరలలోనే పెరిగి పెద్దవాడయ్యాడు సుందరం.

సుందరం హైస్కూల్లో చేరగానే మంచిబట్టలు కావలసి వచ్చాయి. అతడు కోరినబట్టలు కుట్టించేది రాజమ్మ. అతనికి పుస్తకాలంటే ప్రాణం. ఒక్క పుస్తకం తప్పకుండా అన్నీ కొనేవాడు. పాతపుస్తకాలంటే అతనికి గిట్టదు. అన్నీ కొత్తవే కావాలి. వాటికి అందంగా అట్టలు వేసుకునేవాడు. ముచ్చటైన దస్తూరీతో నోట్సు అన్నీ ఓపిగ్గా వ్రాసుకునేవాడు. వాటినిచూచి మేష్టర్లు మెచ్చుకునేవారు.

అతనికి చదువు బాగా ఒంటబట్టింది. క్లాసంతా ఫస్టు మార్కులు తనవే! సంవత్సరాంతంలో జరిగే వ్యాసరచన, వక్తృత్వపు పోటీలో బహుమతులన్నీ తనవే!...ఇక డ్రాయింగ్ సరేసరి!... స్కూల్‌ఫైనల్‌లో కాస్త బద్దకించాడు. లేకపోతే తనపేరు మెరిట్ బోర్డులోకి ఎక్కివుండేది.

సుందరం తన భవిష్యత్తును గురించి ఎప్పుడూ ఆలోచించలేదు. స్కూల్‌ఫైనల్ ప్యాసవగానే—ఇక తాను ఏం చెయ్యాలి అన్న ప్రశ్న ఎదురైంది. చదువుకోవాలన్నదే అతని అభిమతం. అయితే అంతటి స్థితిగతులు తనకులేవు. సహాయం చేయగలిగిన బంధువులూ లేరు. సీనయ్య మామమీద గుడ్డిగా కొంచెం ఆశపెట్టుకున్నాడు ఆ ఆశకూడా వమ్మయి పోయింది. తన తలరాత యింతే అనుకున్నాడు.

టీచర్స్ ట్రెయినింగుకు దరఖాస్తు పెట్టుకున్నాడు. విప్పున్నీ కోర్సులో సీటుదొరకంది. ట్రైనింగు ఒక్క సంవత్సరం. ఆ సంవ

త్వర కాలంలో తాను కాలేజీలో చేరలేకపోయాననే అసంతృప్తిని మరచి పోయాడు. ఇక తన కర్తవ్యం ఒకటే! ఉద్యోగంతో జీవితంలో స్థిరపడాలి అమ్మను సుఖపెట్టాలి. తన తల్లి దాస్యంలో క్రుంగి పోతున్నది ఆమెను దాని విముక్తురాల్ని చేయడమే తనదీక్ష!... కాయలు కాచిన ఆమె చేతుల్ని చూచినప్పుడల్లా సుందరంగుండె కదిలి పోయేది. తనను పెంచిపోషించడంకోసం తనతల్లి ఒళ్ళు గుల్ల జేసు కుంటున్నది.

ట్రైనింగులోవున్న రోజుల్లో—మిత్రులు కొందరు ఓ జ్యోతి ష్కుడి దగ్గర జోస్యం చెప్పించుకుంటుంటే—తాను కూడా చెయ్యి చూపించాడు సుందరం.

అతడు పరీక్షల్లో ప్యాసవుతాడని చెప్పాడు జ్యోతిష్కుడు. నిండుగా ఎనభైఏళ్ళు బ్రతుకుతాడన్నాడు. ఓ పెళ్ళామూ, ఓ ప్రియు రాలూ వుంటారనీ, ఒక్కొక్కరికీ నలుగురేసి పిల్లలు పుడతారనీ చెప్పాడు. అతడు తల్లిదండ్రులకు అన్నం పెట్టడని అన్నాడు.

ఆ చివరిమాటతో సుందరం మనస్సు చివుక్కుమంది. ఆ రాత్రి అతనికి నిద్రపట్టలేదు...అయ్యో! ఇంతకంటే విపరీతం యింకేముంటుంది? తాను తన తల్లికి అన్నం పెట్టడా? అయితే తానెందుకు బ్రతికున్నట్లు? ఆమె తనకోసం ఇంతగా ఎందుకు పాటు పడుతున్నట్లు? అమ్మ నిజంగా భూదేవి. ఎన్ని కష్టాలు భరిస్తు న్నది! ఎంత చాకిరీ చేస్తున్నది! ఎంత సహనాన్ని చూపుతున్నది! ఎవరికోసం? తనకోసమేకదా? తాను తింటే ఆమె కడుపు నిండి పోతుంది. తాను నీళ్ళు త్రాగితే ఆమె దప్పి తీరిపోతుంది. తాను నిద్రపోతే ఆమె కళ్ళు చల్లబడతాయి. కూలిచేసిన డబ్బులతో తనను చదివించింది. పుస్తకాలు కొనిపెట్టింది. బట్టలు కొనిపెట్టింది. సినిమాలకు సరదాలకు డబ్బులిచ్చింది. ఆమె చర్మంతో తనకు చెప్పులు కుట్టియిచ్చింది. ఆమె ఎముకల గూడులా తయారైంది. చేతులు పుండ్లయిపోయాయి. కేవలం తనను చూచుకుంటూ బ్రతుకుతున్నది. అటువంటి తల్లికి అన్నం పెట్టకపోవడం ఎంత అన్యాయం! రాక్షసుడైనా ఆ పనిచేయగలడా?...తన తల్లి అన్నమైనా లేకుండా నడివీధిలో నిలబడబోతున్నదా? అబ్బ! తలుచుకుంటేనే గుండె చెరువైపోతున్నది...

...సుందరం నేత్రాల్లో కన్నీళ్ళు ఉబికాయి!

'అబద్ధం! అంతా అబద్ధం! ఆ జ్యోతిష్కుడికేమీ తెలియదు. జోస్యమేమిటి, అది జరిగేదేమిటి? బతకటానికి అదోవేషం! అమ్మను చెయ్యి విడువను. ఆమెను సుఖపెడతాను. ఆమెకంటే మించిం ఈ ప్రపంచంలో నా కింకేముంది?...అమ్మకు నేను అన్నం పెట్టక పోవడంకంటె గొప్ప విచిత్రం యింకేముంది?

సుందరం మనస్సు అలసి నిద్రపోయింది.

అతడు ట్రైనింగు ప్యాసయిన తరువాత కొంత కాలానికి—పంచాయతీ సమితిలోని మారుమూల కుగ్రామంలో ఉద్యోగం దొరి కింది. రాజమ్మకు పొరుగిళ్ళ చాకిరీనుండి విముక్తి లభించింది. ఒక సంవత్సరకాలం ఆ గ్రామంలో పనిచేశాక, సుందరం స్వగ్రామానికే బదిలీ చేయించుకున్నాడు. తల్లి ఒడిలాంటి తన యింట్లో, ఎం డీ నుండి తనకు సంక్రమించిన ఆ పెంకుటింట్లో, సుందరం బ్రతుకు సాఫీగా సాగి పోతున్నది.

# 3

'ఏం శాంతా?...ఇన్నాళ్ళకు మా యింటికి దారి కనిపించిందా?' అన్నది రాజమ్మ.

'ఏం చెయ్యను వదినా? ఈ పిల్లలతోను, ఇంటి పనులతోను ఊపిరి సలుపుకోలేక పోతున్నాను. రావాలి రావాలి అనుకుంటూనే రోజులు గడిచిపోతున్నాయి...'

'సుశీల ఎలా వుంది?'

'పెండ్లి కుదిరింది. ఏం, ముందు దాన్ని గురించే అడుగు తున్నావు? నీ కొడుకూ కోడలూ తప్ప తక్కినవాళ్ళ బాగోగులు అవ సరం లేదనుకున్నావా?'

'నా కొడుకూ కోడలంటా వేమిటి? నీ కూతురూ అల్లుడూ అను!' అంటూ నవ్వింది రాజమ్మ.

గోడమీదున్న అన్నగారి ఫోటోను చూచి కాస్సేపు కళ్ళనీళ్ళు పెట్టుకుంది శాంతమ్మ.

ఆ రాత్రి నిద్రపోయేవరకూ వదినా ఆడబిడ్డలిద్దరూ తమ తమ కుటుంబ విషయాలను గురించి మాట్లాడుకున్నారు.

మరునాడు ఆదివారం.

సుందరానికి బడిలేదు.

అతడు యింట్లోనే కూర్చుని బొమ్మలు గీసుకోవడం మొదపెట్టాడు.

సుశీల బొమ్మను వేయాలని వుందతనికి.

ఆమె అందమైన ముఖాన్ని ఊహలో నిలుపుకుని, ఆ రేఖల్ని కాగితంమీద గీయడానికి ప్రయత్నంచేస్తూ ఎన్నో కాగితాలు పాడుచేశాడు.

చేపపిల్లల్లాంటి అందమైన కళ్ళు.

సంపంగి మొగ్గలాంటి ముక్కు.

కెంపుల్లాంటి పెదాలు.

అద్దాల్లా నున్నటి చెక్కిళ్ళు.

నున్నటి మెడ.

...ఆ సౌందర్యాన్ని కాగితంమీద చిత్రించడం ఎలా?... ఆమె యిప్పుడిక్కడుంటే బాగుణ్ణు!...చిట్టచివర ఓ బొమ్మ సంతృప్తికరంగా కుదిరింది. అందులో సుశీల పోలికలు చాలా వున్నాయి.

'ఆహా! ఎంత అందంగా వుంది సుశీల!'

సృష్టిలో అందమైనది ఏది?

పువ్వు!

నవ్వుకూడా!

అయితేనేం?...అవి రెండూ స్త్రీకి నకళ్ళు మాత్రమే!

సృష్టిలో అద్వితీయమైన అందం ఆడదానిది!

అయితే ఆ అందమే అసహ్యకరంగా కనిపించే సందర్భాలు కూడా కొన్ని వున్నాయి. సాక్ష్యం కావాలంటే-వీధికొళాయి దగ్గర కొప్పిపు మంచా!

అక్కడ క్రమతప్పు నియమాన్ని పాటించడం వాళ్ళకు అవమానకరం! కేవలం బాహుబలంతో అడ్డదారి త్రొక్కే అనాగరిక లక్షణమే అక్కడ చెలామణీ ఔతూవుంటుంది. వాళ్ళ నోట్లోనుంచి శరపరంపరలాంటి బూతుమాటలు వెలువడుతూ వుంటాయి. చేతుల్లోని బిందెలు, దుత్తలు గదాయుద్ధాల్లా మోగుతుంటాయి. అందమైన ఆడదికూడా ఆ చోట జుగుప్సాకరంగా కనిపిస్తుంది. ఆడది సాటి ఆడదాన్ని పచ్చిగా తిట్టే దృశ్యం ఎంత చండాలమైనది!

దురదృష్టవశాత్తూ - సుందరం యింటివాకిలి ప్రక్కనే వీధికొళాయివుంది.

నిశ్శబ్దాన్ని, శాంతిని కాంక్షించే సుందరానికి ఆ కొళాయి చెవిలోని జోరీగలాగా దాపురించింది.

ఆ కొళాయిలోంచి మొట్ట మొదటి నీటిచుక్క నేలమీదికి జారడం మొదలుపెట్టగానే అక్కడ యుద్ధ కోలాహలం ప్రారంభమౌతుంది. ఒకరినొకరు నెట్టుకోవడం, తిట్టుకోవడం, ఆ కేకలు, కారుకూతలు వింటే-ఇళ్ళలోని మగవాళ్ళు బయటకు రావడానికైనా సిగ్గు పడతారు. గుక్కతిప్పుకోకుండా వాదించగల స్త్రీ వాగ్ధాటికి సుందరానికి ఎంతో ఆశ్చర్యం వేస్తుంది. వాళ్ళ అరపులకు తన ఇంటిగోడ బీటలు పడిపోతుందేమోనని భయంకూడా వేస్తుంది.

ఆ వూళ్ళో మున్సిపాలిటి వంతు ఖర్చులో మంచినీటి బావులున్నాయి. వీధులు కలిసే ప్రతికూడలిలోను ఒక్కో సర్కారు బావి చొప్పున ఊరిమొత్తంమీద పదిపన్నెండు బావులున్నాయి. దేశంలో కరువుకాటకాలు ఎప్పుడూవున్నా-ఆ వూరిలో నీటికొరత మాత్రం ఎప్పుడూ ఏర్పడలేదు. వర్షాలు లేని రోజుల్లో చేంతాళ్ళపొడుగు కాస్త పెరిగినా-అయిపోయిందంటూ వుత్తచేతులు చూపించే రేషన్ వర్తకుడిలా మాత్రం ఆ బావులెప్పుడూ నీళ్ళులేవు అనలేదు

ఊరి మధ్యలో ఓ బ్రహ్మాండమైన సర్కారు బావివుంది. దానిచుట్టూ పెద్ద నూతిపళ్ళెం. గోడమీదుగా చిన్నపిల్లలు నిక్కి చూస్తే, కళ్ళు గిర్రున తిరుగుతాయి. ఆ బావి ఒక్కటే ఏడాది పొడుగునా-ఊరి మొత్తానికి కావలసినన్ని నీళ్ళు సప్లై చేయగలదు. ఆ బావిచుట్టూ తెల్లవారుజామునుండి రాత్రి పదిగంటల వరకు పదిపన్నెండు గిలకలు కిరకిరలాడుతుండేవి. హోటళ్ళవాళ్ళు పీపాలతో నీళ్ళు నింపి లాగుడు బళ్ళ మీద తీసుకు వెడుతుండేవాళ్ళు. అందరి యిళ్ళలోనూ-ముఖాలు కడుక్కోవడం, స్నానాలు చేయడం, కాఫీలు కాచుకోవడం ఏనాడూ ఆగిపోలేదు.

ఆ వూళ్ళో ఓ పెద్ద ప్రాథమిక పాఠశాల వుంది. జిల్లాలోని పెద్ద పాఠశాలల్లో అదొకటి అందులో ఆరువందల మంది పిల్లలు చదువుకుంటున్నారు. ఒక ప్యూను, ఒక కండక్టర్, పదిహేనుగురు

టీచర్లు పనిచేస్తున్నారు వాళ్ళలో సుందరం ఒకడు. పాఠశాల యంత్రాంగం పనిచేస్తూ వున్నది ఓ అద్దె యింట్లో. అద్దె వంద రూపాయలు. అందులో పావుగంటసేపు కూర్చుంటే చొక్కా తడిసి పోతుంది. ప్రాణవాయువు హరించిపోతుంది. ఆక్సిజన్ అయిపోతే దీపం ఆరిపోతుందని ఋజువు చేయటానికి గాజు బీకరు బోర్లించ నవసరంలేదు. ఆ బడిలో ఓ కొవ్వొత్తి దీపం వెలిగిస్తే చాలు. ఒక రిద్దరు ఉపాధ్యాయులు క్షయరోగగ్రస్తులై అల్పాయుష్కులైపోయారు. పంతులు పాఠం చెబితే పిల్లలకు వినిపించదు. పిల్లలు పాఠం చూపితే పంతులుకు కనిపించదు. క్రిక్కిరిసిన గదులు. చెవులు తూట్లుపడి పోయే ఘోష! అది నిజంగా యంత్రాగారమే! పిల్లలందరూ ఆ యంత్రాగారంలో నలిగిపోయే ముడివస్తువులు! పాఠశాలకు మంచి భవనం నిర్మించి యివ్వాలని ఉపాధ్యాయులందరూ ఏళ్ళతరబడి అధి కారులకు మొరబెట్టుకుంటున్నారు. కొత్త సీసాలో పాతసారాలా వచ్చే పంచాయతీ ప్రెసిడెంటులందరికీ విన్నపాలు సమర్పించుకున్నారు. వాళ్ళను ఆహ్వానించి, పిల్లలముందు ఘనంగా పొగిడి పూలమాలలు వేశారు సంవత్సరాంతపు పరీక్షలకు ప్రశ్న పత్రాలు అచ్చువేయించి, అందులో 'మన పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు ఎవరు?' అనే ప్రశ్నకూడా యిచ్చారు.

ఇక రెండవది - ఊరిచుట్టూ మురుగుకాలువలు, మురుగు గుంటలు బలిసిపోతున్నాయి. మురుగునీళ్ళ పారడానికి మార్గమేలేదు. ఊరిచుట్టూ దుర్గంధం వ్యాపించిపోయింది. చేయి విసిరితే పిడికిలి నిండా వచ్చేటట్లుగా దోమలు వృద్ధిచెందాయి. ఊరి శివార్లలో వున్న దరిద్ర జనాల యిళ్ళలో రొమ్ము రోగాలూ రాజ్యమేలుతున్నాయి. 'అయ్యా మహాప్రభో! ఈ మురుగునీళ్ళు యిలా నిలిచిపోకుండా ఏదో మార్గాంతరం వెదికి, మీ పదవులను దరిద్రనారాయణ సేవకు అంకితం చేయండి స్వామీ!'

ఆ బాలి భారత పౌరులకు, ఈ దరిద్రనారాయణులకు మోక్షం కలగలేదు. 'ఆహా, నా వూరు ఎంత అభివృద్ధి చెందింది!' అని అందరూ ఆశ్చర్యపోయేంత పని ఒకటి జరిగింది. 'ఇక నీళ్ళు కూడా మనకు అందవా?' అనేటట్లుగా ఆ పన్నెండు గిలకల బావి లోని నీళ్ళు ఆకాశంలోకి లేచింది. ఎత్తైన నాలుగు కాంక్రీటు స్తంభాలు. వాటిమీద 'ఓ యబ్బో' అనిపించేటంత పెద్ద నీళ్ళ టాంకు! అక్కడ నిలబడి, ఆ స్తంభాలకేసి ఒక క్షణం చూస్తే 'ట్యాంకు కూలిపడి నలుగురు స్త్రీల దుర్మరణం' అంటూ అప్పు డెప్పుడో వార్తాపత్రికలో వెలువడిన వార్త ఎవరికైనాసరే జ్ఞాపకం వచ్చి తీరుతుంది.

వీధి వీధికీ కొళాయిలు వెలసినా, ఆ కొళాయిల పరిసరాలో ఆడవాళ్ళ దొమ్మీలు ప్రతిరోజూ శతదినోత్సవ చిత్రాలను తలపింప జేస్తున్నాయి. పంచాయతీ ప్రెసిడెంటు వీధుల్లో వెడుతూ ఆ కొళా యిలకేసి, అక్కడ జరిగే దొమ్మీలకేసి, సగర్వంగా చూచి, మీసాలు దువ్వుకుంటున్నాడు.

సుందరం యింటివద్దవున్న కొళాయి దగ్గరున్నంత రద్దీ మరే కొళాయి దగ్గరాలేదు. అది చిట్టచివరి కొళాయి. కేటాయించిన డబ్బు అక్కడికే సరిపోయిందేమో—ఆ వీధికి అవతలవున్న మరి రెండు వీధులకు కొళాయిలు ఏర్పాటు కాలేదు. ఆ రెండు వీధుల్లోని జనాలకు దగ్గరగావున్న కొళాయి ఇదే. వాళ్ళకు ప్రత్యేకంగా ఓ బావివున్నా, అక్కడికి వెళ్ళక మరి రెండడుగులు ఎక్కువగా నడిచి కొళాయి దగ్గ రికి వస్తారు. బావిలోనుంచి చేదుకోవడం—ఎందుకొచ్చిన శ్రమ? గుంపులోదూరి ఓ అరనిమిషంసేపు ఘర్షణపడితేచాలు - బిందె నింపు కోవచ్చు. బలం వుండాలిగానీ, బ్రతుకు లేకుండా పోతుందా?

అలాంటి సమయాల్లో అగ్రతాంబూలం అందుకోగలిగిన ఒక మహాబలవుంది. ఆమె అవతలి వీధినుంచి వస్తుంది. వాళ్ళకు ఓ మిలిటరీ హోటలుంది. కొళాయిదగ్గర నిలబడి చూస్తే ఆ హోటలు బోర్డు ఎర్రగా కనిపిస్తుంది. ఆ పిల్ల నాలుగు బిందెలు ఒక్కసారిగా తెస్తుంది! నల్లబొగ్గుల్లాంటి ముగ్గురు కుర్రాళ్ళు ఆమెవెంట వస్తారు. వాళ్ళు కొళాయినుండి హోటలువరకు అంచెలంచెలుగా నిలబడుతారు. ఆ పిల్ల కొళాయిదగ్గర ఆడసింహంలా నిలబడుతుంది. ఆమె అక్కడినుంచి కదిలి వెళ్ళిపోయే వరకు ఆ నాలుగు బిందెలే ప్రదక్షిణం చేస్తుంటాయి.

ఆమె నిర్మించుకున్న ఈ వ్యూహాన్ని ఛేదించటానికి ఎవరైనా ప్రయత్నిస్తే ఆమె సహించదు. అనరాని మాటలంటుంది. అవతలికి నెట్టి పారేస్తుంది. చాలామంది ఆ బలానికి తట్టుకోలేక వెల్లకిలా పడినవాళ్ళే!...అందరూ దూరంగా తొలగి నుంచోవల్సిందే! ఆఖరికి ఆ వాకిట్లోనే కాపురం వుంటున్న రాజమ్మయినాసరే!... ఈ కడ గండ్లు పడలేకనే రాజమ్మ కొళాయిదగ్గరకు వెళ్ళదు. ఏ రాత్రి వేళనో కొళాయిలో నీళ్ళువచ్చే సమయం కనిపెట్టుకుని నీళ్ళు తెచ్చు కుంటుంది. మరీ అవసరమైతే బావిలోనుంచి తెచ్చుకుంటుంది.

ఆరోజు సాయంకాలం కాబోతుండగా - ఇట్లో నీళ్ళులేక

శాంతమ్మ బిందె పట్టుకుని కొళాయిదగ్గరికి వచ్చింది. పాపుగంట సేపు వేచివుండి, తనవంతు రాగానే కొళాయిక్రింద బిందె పెట్ట బోయింది.

అంతలో—ఆ నాలుగు బిందెల పిల్ల పరుగుపరుగున వచ్చేసింది. శాంతమ్మ పెట్టబోతున్న బిందెను నెట్టివేస్తూ తన బిందె పెట్ట బోయింది. ఆ త్రోపుడుకు యింకెవరైనా అయితే పడిపోయేవాళ్ళే. ఆ పిల్లలాగా శాంతమ్మకూడా బలవంతురాలేగనుక, నిల దొక్కుకో గలిగింది. ఆ పిల్లను దురాక్రమణ చెయ్యనీకుండా, తన బిందెను దృఢంగా పట్టుకుని నీళ్ళు నింపుకోసాగింది.

'ఆపిల్ల ఉరిమి చూసింది,

'ఎందుకమ్మా ఆ తొందర?... ఇప్పుడొస్తున్నావు, బిందె నిండేవరకైనా ఓపిక పట్ట లేవూ?' అంది శాంతమ్మ.

'ఛెటా!...ఇంకొకరైవుంటే చెప్పుదీసుకు కొట్టేదాన్ని!... నువ్వుగాబట్టి వదిలిపెట్టాను.' అంది ఆ పిల్ల.

శాంతమ్మ ఆశ్చర్యపోయింది. ఆమెకు నవ్వు వచ్చింది. 'నీ కంతగా కొట్టాలని వుంటే కొట్టమ్మా!... నన్ను వదిలిపెట్టేంత దయ నీకెందుకు?'

ఆ పిల్లకు తర్కం యిష్టంలేదు. ఆమెకు తెలిసిందల్లా ఒకటే! నోటికి వచ్చినట్టు మాట్లాడటం!...ఆనోరు ఫైరింజను గంటలా మోగడం ప్రారంభించింది.

'నోరు మూసుకోవే జెటా!...ఇంకా యిక్కడే వున్నావంటే-చెప్పతో కొడతానో లేదో నీకే తెలుస్తుంది...ఛెటా!...ముందు యిక్కణ్ణుంచి పోవే ముష్టి ముండా!... అడుక్కులినేముండా!'

ఆమాటలకు శాంతమ్మకు కోపం వచ్చింది. 'ఏమిటే, పెద్దా చిన్నాలేకుండా మాట్లాడుతున్నావు? జెటా గిటా అంటూ దరిద్రపు మాటలంటున్నావు. నన్ను చెప్పతో కొడతావా?...నేను అడుక్కు తినటం నువ్వెప్పుడు చూశావు?...అలాంటి మాటలు ఎవర్ని అనాలో వాళ్ళను అను!' అంది.

అక్కడున్న ఆడవాళ్ళలో కొందరు ఆ అమ్మాయిని వారించ బోయారు. 'వూరుకోమ్మా! కొత్తమనిషిని పట్టుకుని అలాంటి మాటలేమిటి?'

'మీకెందుకూ? మీరూరుకోండే! ... నాతోనా నవాల్ చేస్తావు?...ఛెటా! నేనెవరనుకున్నావు?...' ఆపిల్ల అలా వాగు తూనేవుంది.

ఆ సమయంలో సుందరం తానువేస్తున్న బొమ్మకు రంగులు పూసి, నుదుట ఎర్రటి బొట్టు పెట్టబోతున్నాడు. వీధిలోని కేకలు అతని చెవుల బడ్డాయి. గబగబా లేచి వెళ్ళి వాకిట్లో నిలబడి ఎదిరోకి తొంగిచూశాడు.

సుందరం కళ్ళు చెదిరిపోయాయి.

ఆ పిల్ల దుర్నిరీక్ష్యంగా వుంది! ఆమె నెత్తురులా చిక్కగా వున్న ఎర్రటి బట్టలు కట్టుకుంది. పరికిణీ, జాకెట్టు, వోణీ-అన్నీ ఎర్రగానే వున్నాయి. చేతులో గాజులు కూడా ఎర్రగానే వున్నాయి. ఆ పిల్లకూడా ఎర్రగా వుంది. పెద్ద పెద్ద అవయవాలతో వస్తాదులా వుంది. గుండ్రటి ముఖం. విచ్చిన్న చెంపలు. చిన్నకళ్ళు. బలిష్టమైన మెడక్రింద ముడతలు. సుందరంవంటి వాణ్ణి ఆకర్షించగలిగిన అందంకాదు అది. ఆడదాని కండపుష్టిని మెచ్చుకునే మగవాడికి-ఆమెకంటే అందమైన స్త్రీ కనిపించదు.

ఆమె కొళాయి గోడమీద వుంచి నిలబడింది. ఆ నిలబడిన తీరులో వొయ్యారంగానీ, లావణ్యంగానీ లేదు. దుర్యోధన చక్రవర్తిలో వున్న ఠీవి వుంది. ఆడముఖం కలిగిన మహాకాయునికి చీరగట్టి నుంచోబెట్టి నట్టుంది.

ఐదారేళ్ళ క్రిందటివరకూ సుందరానికి పరిచయమున్న ముఖమే అది.

అత్తయ్యకు జరుగుతున్న ఆ పరాభవానికి అతని మనసు చాలా బాధపడింది. గంగగోవులాంటి అత్తయ్యను ఓ ముక్కూ ముఖం తెలియని పిల్ల వయస్సునైనా పాటించకుండా యింత అన్యాయంగా, యింత నిర్దయగా బండబూతులు తిట్టడం వింత దారుణం!

సుందరానికి అత్తయ్యమీద జాలికలిగింది. ఆ జాలి ఆ పిల్ల మీద కోపంగా మారింది. తన ముఖం చూస్తే అయినా ఆ పిల్ల స్త్రీ సహజమైన మానమర్యాదలతో తగ్గి వూరుకుంటుందేమో ననుకున్నాడు.

తనకు ఏమీ తెలియనట్టు, ఏం జరిగిందో తెలుసుకోబోతు న్నట్టు రెండడుగులు ముందుకువేసి, శాంతమ్మవెనక నిల బడ్డాడు.

ఆ పిల్ల సుందరాన్ని చూచింది. అయితే సుందరం ఆశించిన మార్పుమాత్రం ఆమెలో రాలేదు.

'ఇంకా యిక్కడే వున్నావంటే పొర్లించి తంతాను. లోపలికి పోవే గుడిసేటీ!' అంది.

సుందరం వొళ్ళు కోపంతో వొణికిపోయింది. అంతమంది ఆడవాళ్ళముందర అత్తయ్యను ఆమె అలా తిడుతుంటే-అది తనకే అవమానకరంగా తోచింది. అతని ముఖం ఎర్రబారింది.

'అలాంటి మాటలన్నావంటే నాలుక కోసేస్తాను!' అంటూ ఆ పిల్లకేసి కోపంగా చూశాడు.

ఆమె జంకలేదు. ఆడవాళ్ళయినా, మగవాళ్ళయినా ఆమె కింటికి ఒకటే! కొళాయి గోడమీది చెయ్యి అలాగే వుంది. నడుం మీది చెయ్యి నడుంమీదనే వుంది. 'ఆఁ? ఏమన్నావురా? నాలుక కోస్తావా?...అంతకు పదింతలుగా కోసేందుకు నాకు తెలుసు!... రారా! కోద్దువురా! రారా బేటా!'

'అయ్యో! ఆడవాళ్ళ జగడానికి నువ్వు రాకు నాయనా! నీ కెందుకు? నువ్వెళ్ళు నాయనా!' అంది ఓ ఆవిడ.

'లేకుంటే—ఆ అమ్మాయి అంటూన్న మాటలు చూశా రామ్మా-హద్దూ పద్దూ లేకుండా?'

'ఏయ్! నోరు మూసుకుని లోపలికి పోరా బేట్యా! ఎక్కువ మాట్లాడావంటే తంతాను. నాలుక కోస్తావా? వెధవా!' అంది ఆ పిల్ల.

లాభం లేదనుకున్నాడు సుందరం. ఈ పిల్లతో వాదించి గెలవడం—నాలుగు నోళ్ళున్న ఆ బ్రహ్మకు కూడా శక్యం కాదను కున్నాడు. మళ్ళీ తానేమన్నా అంటే—ఆ పిల్ల అంతకు వందరెట్లు ఎక్కువగా అంటుంది. తనలాంటివాడు అలాంటి సిగ్గు విడిచిన పిల్లతో వాదనకు దిగడం గౌరవకరమైన పనికాదు. ఈ ఒక్క మాటకే తన పరువును కొళాయి నీళ్ళతో కడిగేసింది.

'నువ్వు లోపలికి వెళ్ళు సుందరం!' అంటూ శాంతమ్మ అతన్ని లోపలికి నెట్టింది. బిందెతీసి చంకనబెట్టుకుని అతని వెనుకనే తనూ లోపలికి నడిచింది.

సుందరానికి చాలా అవమానంగావుంది. ఆ పిల్లమీద చాలా అసహ్యంవేసింది. ఛీ! అదేం పిల్ల!...మగవాడికి కూడా వుండదు ఆ రౌడీతనం. రేపోమాపో పెళ్ళికాబోతున్నపిల్ల – సిగ్గూ శరమూ బొత్తిగా లేకపోతే ఎట్లా? ఆడవాళ్ళలో యిలాంటివారుకూడా ఉంటారా?...ఎబ్బెబ్బే!

రాజమ్మ ఆ సమయంలో ఇంట్లో లేదు. ఏదో పనివుండి పొరుగింటికి వెళ్ళింది. బయట ఆపిల్ల బిందెలు నింపుతు కేకలు వేస్తూనేవుంది.

'లోపలికెళ్ళి దాక్కున్నావేంరా ఆడంగి వెధవా! గుండెలుంటే బయటికి రారా...వొచ్చి నా నాలిక కొయ్యిరా!... బయటికి రారా బేట్యా! పెద్ద మొనగాడిలా ఆమాట అనేసి, ఎలా తప్పించుకుంటా వురా?... రాత్రికి నలుగురు మొగాళ్ళను పంపిస్తాను చూడరా! జుట్టుపట్టిలాగి చెప్పుతో కొట్టమంటాను. అప్పుడందువుగాని ఆ మాట!...'

పొరుగింటికి వెళ్ళిన రాజమ్మ తిరిగి వచ్చింది.

ఏమె శాంతా! మొగాళ్ళను పంపి చెప్పుతో గొట్టిస్తానంటూ వుందది ఏమిటీ గొడవ?' అని అడిగింది ఆత్రంగా.

జరిగిన విషయం చెప్పింది శాంతమ్మ.

రాజమ్మ కంగారుపడుతూ మళ్ళీ వీధిలోకి వెళ్ళింది.

'ఏమమ్మా గౌరీ! నీకు పుణ్యంవుంటుంది. వూరుకోతల్లీ!...అది ఒకరి జోలికి పోయేది కాదు, ఒకరితో దెబ్బలాడేదికాదు. ఎంతో మానమర్యాదలతో బతుకుతూవుందది. దాన్ని పట్టుకుని అలాటి మాటలనడం ఏమి బాగాలేదు. అన్నీ నువ్వే అని ఈ ఆగడం దేనికి? నువ్వు లలలు తీయించడానికే వొస్తూన్నట్టుంది. గోరంతలు కొండంతలుచేసి, మొగాళ్ళతోచెప్పి తగూలు పెట్టకమ్మా తల్లీ' అంది.

మరికొంత సేపటికి ఆపిల్లగొంతు వినిపించడం ఆగిపోయింది. బహుశా-కొళాయిలో నీళ్ళు రావడం ఆగిపోయిందేమో—అనుకున్నాడు సుందరం.

శాంతమ్మ ఆ పిల్లను తిట్టుకుంటోంది,

'ఏంచేద్దాం, మనకర్మ! ఈ వూళ్ళో బతకాలంటే, కత్తులు కట్టిన కోడిపుంజుల్లా జగడం వెయ్యగలగాలి!...చేతకాని మెతక వాళ్ళ బతుకంతా యిలాగే వుంటుంది. ఏం కాలమో, పాడుకాలం! పెద్దా చిన్నా అంటూ లేదు...' అంది రాజమ్మ.

ఆ పిల్ల ఆగడం, రాజమ్మ కంగారుచూచి సుందరానికి భయంవేసింది. తరువాత అతను ఏమీ మాట్లాడలేదు. దిగులుపడి పోయాడు. తాను దిగులుపడుతున్నట్లు కనిపించకుండా వుండటానికి ప్రయత్నించాడు.

సంజవేళ అయింది.

సుందరం ముఖం కడుక్కుని బట్టలు మార్చుకున్నాడు. కాఫీతాగి బయటికి వచ్చాడు. కొళాయిలో నీళ్ళు ఎప్పుడో ఆగిపోయింది. తుఫాను వెలిసినట్లు వీధి ప్రశాంతంగా వుంది.

(సశేషం)

# పొగగొట్టాల భుగభుగలు

పరిశ్రమలు అభ్యుదయపు రైలుకు గార్డు చూపిన పచ్చజెండాలు. గిర్......ర్......ర్......ర్......ర్......ర్ మర చక్రాల ధ్వనులు వినడానికి కటువుగా వున్నా అవి దేశ ప్రగతి వసంతంలో కోకిల కూజితాలు

★ ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్

★ రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ

★ చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్

★ ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్

★ ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక ప్రాతిపదిక సదుపాయాల సంస్థవంటి అనేక సంస్థలు తోడ్పడతాయి.

అచిరకాలంలోనే ఆంధ్రప్రదేశ్ మనదేశ పారిశ్రామిక అభివృద్ధి పటంలో ప్రముఖ స్థానం అలంకరిస్తుంది.

సమాచార, పౌరసంబంధశాఖ, హైదరాబాద్

No. 9/75 76

# శరణాగతి

## శ్రీ గడియారం శేషఫణిశర్మ

సీ॥ నరివాహ్న కుల భూషణా !
దేవ !
కరుణించి నన్నేలు నారాయణా !!
సురరిపు గణ భీషణా !
ఏడుగడవీవె !
కరుణించి నన్నేలు నారాయణా !!
విభీషణ కృతాదరా !
శరణంటిరా !
కరుణించి నన్నేలు నారాయణా !!
జగద్ధిత మహోద్యమా !
పాదదాసుండ !
కరుణించి నన్నేలు నారాయణా !!

గీ॥ శుభకర సుగుణ గణ భూషణా !
సద్యశోధనా ! సుమధుర మృదు భాషణా !
పరమాత్మ ! జానకీ మనోహర ! జగదభిరామ !
కావరా యిడుములను ప్రోదోలి ! రామ ! రామ !!

కం॥ శరణు రఘువరా !
దీనుఁడ;
కరుణదలపరా !
తరగని,
కలత లెసగెరా !!
వరదగుణచణా !
కావర !
నరసవితవణా !
శుభకర !
అమిత రిపుగణా !!

---

# పింగళి సూరన కళాపూర్ణోదయముపై వాల్మీకి అద్భుత రామాయణ ప్రభావము

శ్రీ గుమ్మడపు రామకృష్ణరాయణం

కవిత్వ కథాకావ్యమైన కళాపూర్ణోదయమునఁ జెప్పబడిన సర్వ వృత్తాంతములును సూరనార్యుని స్వకపోల కల్పితములేనా? లేక వానికి మూలములు ఎందైనఁ గలవా? అను సంశయమునకు సమాధానముగాఁ జిరకాలమునుండియుఁ ప్రసిద్ధాంధ్ర విమర్శకు లనేకులు పరిశోధనములను సలిపి ఫలితములను రాశివోయుచున్నారు. కాలము గడిచిన కొలఁది కళాపూర్ణోదయ ఘట్టములతోఁ దౌల్యమునుబొందిన ప్రాచీనాంధ్ర సంస్కృత సాహిత్యములలోని సన్నివేశగణనము సూరన సత్కీర్తితోపాటు నేటినికిని పెరుగుచునే యున్నది. ఆ మహా ప్రయత్నమున నొక భాగముగా, పింగళి సూరన కళాపూర్ణోదయముపై వాల్మీకి అద్భుతరామాయణ ప్రభావ మెట్టున్నది చూపుట ఈ వ్యాసోద్దేశము.

బ్రహ్మలోకమునఁ బూర్ణముగను; భూలోకమునఁ బరిమితముగను ప్రకాశించుచున్నదియు, తనకును, బ్రహ్మకును, నారదునకును దప్ప వాల్గవవానికిఁ దెలియనిదియు, ఆశ్చర్యకరమైనదియునగు శ్రీరాముని చరిత్రమును ఆదికవియగు వాల్మీకి ప్రథమమునఁ దన శిష్యుఁడగు భారద్వాజ మునికిఁ జెప్పెను. ఆ సంస్కృతాద్భుత రామాయణము ఇరువదియేడు సర్గలతోఁ గూడియున్నది. ఆ గ్రంథమునకు అద్భుత రామాయణమని పేరున్నను ప్రతి సర్గాంతమునను అది 'అద్భుతోత్తర కాండ'మనియే పేర్కొనబడియున్నది. "ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అద్భుతోత్తరకాండే" అని ప్రతిసర్గాంతమునను గలదు.

## నారదగాన మాత్సర్య వృత్తాంతము

కళాపూర్ణోదయమందలి ద్వితీయాశ్వాసములో (2-69-95) సుమారు ముప్పది పద్యములలో పింగళి సూరన నారదగాన మాత్సర్య వృత్తాంతమును జెప్పియున్నాఁడు. దీనికి మూలమేదియై యుండునని యిప్పటికిఁ బరిశీలన మొనర్చిన విమర్శకు లెల్లరును లింగపురాణమే యీ కథ కాధారమని నిర్ణయించినారు. ఇది సంస్కృత లింగపురాణోత్తర భాగమున మూఁడధ్యాయములలోఁ జెప్పఁబడి యున్నది. ఈ కథకు లింగపురాణము మూలమని ప్రథమమునఁ దెలియఁజేసినవారు శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు[1] నారద తుంబురుల కలహ వృత్తాంతమును సూరన లింగపురాణము నుండి గ్రహించెనని డాక్టర్ వఠా. దురయ్యగారు తమ సిద్ధాంత వ్యాసమున వ్రాసిరి.[2] ఈ కథకు లింగపురాణమే ఆధారమని డాక్టర్ జి. వి. కృష్ణారావుగారును తమ సిద్ధాంత వ్యాసమున సమర్థించిరి.[3] "నాఁటి రాజాస్థానములలోని విద్వత్కవుల మాత్సర్యములకు ప్రతిబింబ ప్రాయమైన యీ కథలోని చమత్కృతి కానందించిన తాత్కాలిక విద్వాంసుఁడొకఁడు దీనిని సంస్కృతీకరించి లింగపురాణమునఁ జేర్చియుండవచ్చుననియు నిది లింగపురాణములోని ప్రక్షిప్త భాగము కావచ్చు" ననియు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారభిప్రాయపడిరి.

పూర్వ విమర్శకులచే నిట్లు లింగపురాణము మూలముగా గలదని నిర్ణయింపఁబడిన కళాపూర్ణోదయమందలి నారదగాన మాత్సర్య వృత్తాంతము వాల్మీకి మహర్షి కృతమైన అద్భుత రామాయణములోని ఆఱు, ఏడు సర్గలలోఁ గన్పించుచున్నది. అద్భుత రామాయణమందలి యీ కథ కళాపూర్ణోదయమునందలి కథకేకాక, లింగపురాణమునందలి కథకును మూలమనుట కాధారము లున్నవి. ఈ విషయమును గూర్చి 'ఆచార్య దివాకర వేంకటావధానిగారి'ట్లు వ్రాసినారు. "ఇందలి కథలో నీతి విస్పష్టతమైనదనియు, సీతారాముల జనవమునకుఁ గారణమైనదియు నారదగాన మాత్సర్య వృత్తాంతము. ఆంధ్ర ప్రబంధములలోఁ గల్పిత కథానుయమగుటచేఁ బ్రత్యేక గౌరవ

1 భారతి. డిసెంబరు 1941

2 ప్రబంధ వాఙ్మయ వికాసము. వ్రాతప్రతి. పుట. 1049.

3 Studies in Kalapurnodayam. Pages 52&57

మునకుఁ బా తనుగుచున్న కళాపూర్ణో దయమున నారదగాన మాత్సర్య వృత్తాంతమున్నది ఈ యద్భుత రామాయణమునకు మూలమైన సంస్కృతాద్భుత రామాయణము ప్రాచీనమును వాల్మీకి కృతము నగు పింగళి సూరన్న యా కథనందుండి గ్రహించెనని చెప్పవలసివచ్చును. ఇందలి కథకును, కళాపూర్ణోదయమందలి కథకును గొంత భేద మున్నను సాదృశ్య మధికముగానున్నది. అందుచే పింగళి సూరన్న కళాపూర్ణోదయమున కద్భుత రామాయణ మొక మూలముగా భావింప వచ్చును.'' 5

లింగపురాణమునకంటె ప్రాచీనమును, ఆదికవి వాల్మీకి కృత మును అగు అద్భుత రామాయణమునందలి నారదగాన మాత్సర్య వృత్తాంతమే కొలఁది మార్పులతో లింగపురాణమునఁ జేరినది. అద్భుత రామాయణ కథా ప్రణాళికలో లక్ష్మీవిష్ణువుల నిద తిని సీతారాములుగా మానవజన్మ నందుఁడని శపించిన నారదునకు మిక్కిలి ప్రాముఖ్యము కలదు. శ్రీమతి కారణముగా విష్ణువు నార దునిచే శపింపఁబడి శ్రీరాముఁడై జన్మించెను. వైకుంఠమందలి గానసభలోనుండి నారదుని తలిమించిన కారణముగా లక్ష్మీదేవి నారద శాపవశత రాక్షస గర్భమున ప్రభవించెను. ఇట్లీ కావ్యనాయికా నాయకు లిరువురి ప్రాదుర్భావమునకు నారదుఁడే కారకుఁడు. అద్భుత రామా యణములో సీతాజన్మ వృత్తాంతము కథనమునఁ బ్రసక్తమైన ఈ నారద గాన మాత్సర్య వృత్తాంతము నెవరో నిపుణముగ మూలము నుండి వేఱుచేసి లింగపురాణమునఁ జేర్చియుందురు. ఇందలి శ్లోకము లధిక భాగము యథాక్షరములై లైంగమునఁ గన్పించుచున్నవి. ఉభ యత్ర కనిపించుచున్న యీ కథయందలి సామ్యభేదములను బరిశీ లించినచో నిందేది ప్రాచీనమో సుఖముగ నవగతము కాఁగలదు.

## సా మ్య ము

స్వల్పాక్షర భేదముతో నీ రెండు గ్రంథములలోని శ్లోకము లొకేవిధముగ నున్నవి. ఉదాహరణమునకై కొన్ని శ్లోకములు చూప బడుచున్నవి.

"తస్మిన్ క్షణే సమారబ్ధో మధురాక్షర పేశలైః
విపంచీ గుణతత్త్వజ్ఞై ర్వాద్య విద్యా విశారదైః
తతస్త్వ్రచ్ఛవణాయాలంచేటీ కోటి సమావృతా
గాయమానా సమాయాతా లక్ష్మీర్విష్ణు పరిగ్రహా"
(అద్భుత రామాయణము. 6-1,2)

"తస్మిన్ క్షణే సమాపన్నా మధురాక్షర పేశలైః
విపంచి గుణతత్త్వజ్ఞై ర్వాద్య విద్యా విశారదైః
మంద మందస్మితా దేవీ విచిత్రాభరణాన్వితా
గాయమానా సమాయాతా లక్ష్మీర్విష్ణు పరిగ్రహా"
(లింగపురాణము 1-68,69)

గానాభ్యాస నియమములనుగూర్చి ఉలూకుఁడు నారదునకుఁ జెప్పిన ఘట్టము.

"స్వాంగే నిరీక్షమాణేన పరమ్ప్రేక్షతా తథా
ఏగాయేదూర్ధ్వ బాహుశ్చ నోర్ధ్వ దృష్టిః కథంచన"
(అ. రా. 7-9)

"నగాయే దూర్ధ్వ బాహుశ్చనోర్ధ్వ దృష్టిః కథంచన
స్వాంగం నిరీక్షమాణేన పరం సంప్రేక్షతా తథా"
(లిం. పు. 3-63)

ఉభయ గ్రంథము లందిట్లధిక భాగము సమానముగాఁ గని పించుచున్నది. లింగపురాణమునందును, అద్భుత రామాయణము నందునను, తుంబుర సన్మానము; నారదుఁడులూకునికడ విద్యా భ్యాసమొనర్చుట, ఉలూకుఁడాతనికిఁ దన పూర్వజన్మవృత్తాంతమును దెలుపుట. పిమ్మట దేవర్షి శ్రీ కృష్ణాంతఃపురమున గానవిద్య నేర్చుట మున్నగు సర్వవృత్తాంతములున్నవి.

## భే ద ము

ఇఁక నీ రెండింటిలోఁగల భేదమును బరిశీలింతము. అద్భుత రామాయణమున నొక పెద్ద కథలోఁ గలిసియున్న దీనిని స్వతంత్ర కథగా విడఁదీయుటచే మూలకథతో దీనికి సంబంధములున్న తావులు లైంగమున మార్పఁబడి కన్పించుచున్నవి.

వైకుంఠమున లక్ష్మీ విష్ణువుల సభలో తుంబురుఁడు గాన విద్యను ప్రదర్శించి సన్మానితుఁడగుటా, దీనిఁగని నారదుఁడు వ్యస

---

4 వ్యాసరత్నావళి. పుట. 135-138.

5 ఆంధ్రాద్భుత రామాయణ పీఠిక. పుట. 5.

వమున మూర్ఛితుఁడగుట అను విషయములు రెండింట నొకే విధముగనున్నను, లక్ష్మిని, ఆ సందర్భమున నారదుఁడు శపించిన యీ క్రింది అద్భుత రామాయణ శ్లోకములను లింగపురాణము విడిచిపెట్టినది.

> "తతః క్రోధేన మహతా జజ్వాల మునిపుంగవః ।
> లక్ష్మీం శశాప సహసా తదాసీ ధిక్కృతస్స్వతః
> యదహం రాక్షసంభావం గృహీత్వా విష్ణుకాంతయా
> చేటీభిర్ద్వారితో దూరం వేత్రాఘాతేన తాడితః
> తస్మాత్త్వం జాయతాం లక్ష్మి రక్షసాంగర్భసంభవా"
>
> (6-13-14)

చెప్పినట్లు అద్భుత రామాయణమున నుండఁగా విష్ణు ప్రసక్తిని పరిహరింపుటకై లింగ పురాణము ఆకాశవాణి చెప్పినట్లుగా దానిని మార్చినది.

> "తతో నారాయణో దేవః ప్రోక్తవాన్నారదం మునిం
> ఉలూకం పశ్య గత్వాత్వం యదిగానే మతిస్తవ"
>
> (అ. రా. 6-25)

> "అథాంతరితే శుశ్రావ నారదోసౌ మహామునిః
> వాణీం దివ్యాం మహాఘోషామద్భుతా మశరీరిణీం
> ఉలూకం పశ్యగత్వాత్వం గానే యది రతామతిః"
>
> (లిం. పు 3-5, 6)

2 లక్ష్మీదేవి తాను మహర్షి రక్తమున రాక్షస గర్భమునయినట్లు, పట్లనుగ్రహింపుమని నారదుని వేడిన విషయమును,[6] లైంగికమున విడువబడినది. శప్తయైన లక్ష్మితోపాటు విష్ణువు నారదుని కడ కేతెంచి గాన విద్యాప్రాప్తికై యాతని నులూకుని కడ వేఁగుమని

3 తన రాకనుగూర్చి ప్రశ్నించిన ఉలూకునితో నారదుఁడు

6 అద్భుత రామాయణము. (6-22-28)

చెప్పఁబడినను ఈ మార్పు లింగపురాణమున జాగ్రత్తగాఁజేయఁ బడినది.

"పశ్చాత్తాపంచమే దృష్ట్వా మాంచ నారాయణో బ్రవీత్
ఉలూకంగచ్ఛదేవర్షే గానబంధుం మతిర్యది"
(అ. రా. 6-42)

"వాణీ మాకాశసంభూతాం త్వాముద్దిశ్య విహంగమ"
(లిం పు. 3-20)

4 నారదు డులూకునికడ విద్యార్జనానంతరము తుంబురుని గృహముకేఁగి యట వికృత రూపులైన స్వరములను గనెనని అద్భుత రామాయణము చెప్పుచుండఁగా. ఆతఁడు విష్ణువుకడకేఁగెనని లింగ పురాణము చెప్పుచున్నది.

"ఏవముక్త్వా యయావిప్రోజేతుం తుంబురు ముత్తమమ్
తుంబురోశ్చ గృహాభ్యాశేదదర్శ వికృతాకృతీన్"
(అ. రా. 7-22)

"ఏవముక్త్వా జగామాథ నారదోపి జనార్దనమ్"
(లిం. పు. 3 75)

ఈవిధముగా అద్భుత రామాయణమున ఏడవసర్గము నందలి 23 నుండి 28 శ్లోకముల లోఁగల విషయమును లింగపురాణము విడిచి శ్వేతద్వీప వాసియగు నారాయణుని నారదుడు చూచెనను అద్భుత రామాయణ కథాభాగముతో ననుసంధాన మొనర్చినది.

5 అద్భుత రామాయణమున నారదుఁడు తుంబురునింటికి రెండు పర్యాయములు వెళ్ళినట్లు వ్రాయఁబడియున్నది. లింగపురాణము నారదుని తుంబుర గృహ ప్రథమ పర్యటనమును బరిహరించి కథను కుప్తీకరించినది.

"పునఃకాలేన మహతాగృహం ప్రాప్యచ తుంబురోః"
(అ. రా. 7-42)

"తత కాలేన మహతా గృహం ప్రాప్యచ తుంబురోః"
(లిం. పు. 3-90)

6 భువనేశ్వరు డనురాజు పూర్వజన్మకృతపాపఫలముగా నులూక రూపముదాల్చి పర్వత కోటరమున, పూర్వజన్మ దేహమును భక్షించు చున్నట్లును, మఱొక జన్మలో శునకమగునట్లు చెప్పిన యముని మాటలును, ఉభయగ్రంథములందున్నను, హరిమిత్రుఁడాతనిగాం యాతని తప్పిదమును క్షమించి, ఖాద్యశవమున దృశ్య మొనర్చి మీఁది పుట్టువున నులూకునికి శునక జన్మము కలుగకుండఁ జేసినటును, హరిమిత్రుని కరుణచేతనే ఉలూకుఁడు మహాగాయకు డైనట్లును చెప్పఁబడిన అద్భుతరామాయణము నందలి విషయములు లింగపురాణములో విడువఁబడినవి.

7 శ్రీకృష్ణ మందిరమున గానవిద్యాకోవిదుఁడైన నారదుడు మహదానంద మొందెననియు, తుంబురునిపైఁగల గానమాత్సర్య మాతని విడిచిపోయెననియు అద్భుతరామాయణము చెప్పిన విషయము లైంగములో లేదు.

8 ఈ యైతిహ్యమును సంపూర్ణముగ అద్భుత రామాయణమున నున్నట్లే లింగపురాణముచెప్పి, అందలి సర్గాంత శ్లోకమును (7-65-66) గద్యను విడచినది "ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అద్భుతోత్తర కాండే నారదగాన ప్రాప్తిర్నామ సప్తమస్సర్గః"

9 అద్భుత రామాయణమున ఈకథను వాల్మీకి భరద్వాజునితోఁ జెప్పఁగా లింగపురాణమున మార్కండేయ మహర్షి అంబరీషునితోఁ జెప్పెను.

ఇంతవఱకుఁ బైని చూపఁబడిన అద్భుత రామాయణ లింగ పురాణములలోని నారద గానమాత్సర్యవృత్తాంతమునందలి సామ్య భేదములను బరిశీలించినచో అద్భుతరామాయణ మహాకథా విబద్ధమైన యీ చిన్నకథ కడునిపుణముగ, 'సందర్భము చెడకుండ మూలకథ నుండి వేఱుచేయబడి యెట్లు లింగపురాణమునఁ బ్రక్షిప్తముగు ప్రవేశించినదియుఁ దెల్లమగుచున్నది.

## సూరన కథకు అద్భుత రామాయణమే మూలము.

1 అద్భుత రామాయణమున నారదుఁడు ఉలూకుని కడనుండి ప్రథమమునఁ దుంబురుని గృహమున కేఁగి తన వలన చిన్నభిన్నాంగు

లైన స్వరస్వరూపులను జూచెననియు వారాతనితో "నీవు మమ్ములను జంపుచున్నావు; తుంబురుఁడు మమ్ములను బ్రతికించుచున్నాఁడనియుఁ జెప్పిన,

"భవతాగేయతే యర్హి తర్హ వ్యవస్థే ద్రుటిహీనః
పునస్తుంబురు గానేన ఛిన్న భిన్న ప్రరోహణం
తుంబురుర్తీవయత్యేషత్వం మారయసి నారద"

(7-26, 27)

అను శ్లోకభావమును గ్రహించి సూరన తుంబురుని వీణాస్వర సమ్మేళన మసాధారణమని యిట్లు వ్రాసెను.

"పుచ్చుకొని పలికించి యపూర్వమైన
శ్రుతులపెంపు, విరోషతన తులమగుచుఁ
గడు వెలుఁగొనర్ప దానిన కడనపెట్టి
మిగుల లజ్జించి వచ్చితి సుగుడి యపుడు

(క. పూ. 2-85)

అని వ్రాసినాఁడు. తుంబురునిచే బ్రతికింపఁబడిన స్వరములిట నిర్దోషత వతులమైనవి.

2 హరిమిత్రుని కరుణచే ఉలూకుఁడాశ్రమమున మహాగాయకుఁడైనట్లును, అతవి యాదేశానుసారము ఉలూకుఁడు విష్ణుగాన మొనర్చి తరించినట్లును అద్భుత రామాయణమునఁ జెప్పఁబడిన,

"త్వాపద్య గాన యోగశ్చ ప్రాప్నోతు మత్ప్రసాదతః
స్తుహి విష్ణుంచగానేన జిహ్వాస్పష్టాచ జాయతా"

(7-83, 84)

అను శ్లోకభాగముల ననుసరించి, ఆశ్రమమున హరివర ప్రభావమున మణికంధరుఁడు గానవిద్యా కోవిదుఁడయ్యెననియుమ, ఆతఁడు నారదాదేశమున విష్ణుగావ మొనర్చెననియును కళాపూర్ణోదయమున సూరన వ్రాసెను.

3 వైకుంఠమున గానసభ జరుగుచున్నపుడు లక్ష్మీదేవి చెలికత్తెలచేఁ దఱుమఁబడిన నారదుఁడు కోపించి లక్ష్మిని శపించినటు గోప్యముగ నున్న ట్లే కళాపూర్ణుని కథయును దొలుత బ్రహ్మచే అద్భుత రామాయణమునఁ గలదు. సూరన దీని ననుసరించుటచేతనే కళాపూర్ణోదయమున నారదుని వేదననిట్లు వెల్లడించెను.

"అప్పుడు మము బోంట్ల కథల్
చెప్పఁగనేమిటికిఁ దారసిలి వేత్రధరుల్
రొప్పఁగఁ జనియెను నిలువక
యప్పర మేష్ఠియును నచటి కతి దూరముగన్"

(క. పూ. 2-71)

క్రైముత్యాలంకార యుక్తమగు నీ పద్యమున, సూరన 'బద్దల వారు, వేత్రహస్తుల'ని లక్ష్మీదేవి చెలికత్తెలను బురుషులుగా మార్చి యౌచితిని బోషించెను. ఈపై యుదాహృత భాగములో నేది లింగపురాణములో లేనందున పింగళి సూరన వ్రాసిన నారద గాన మాత్సర్య వృత్తాంతమునకు వాల్మీకి అద్భుత రామాయణమే మూల మనుట నహేతుకమును, సప్రమాణమును అగుచున్నది. పింగళి సూరన లింగపురాణమునఁగాక, అంతకంటెఁ బ్రాచీనమైన అద్భుత రామాయణమునుండే బహువిధములై యీ కథనందుండి గ్రహించి మార్పులను జేసి కళాపూర్ణోదయమున వాడుకొనెను. ఇంతేకాక కళాపూర్ణోదయ కథాకల్పనలో అద్భుత రామాయణ ప్రభావ మధికముగాఁ గలదని ఈ క్రింది వివరములు స్పష్టీ కరించుచున్నవి.

## అద్భుత రామాయణ కథ—

## బ్రహ్మలోక ప్రసిద్ధము—గోప్యము

సప్తవింశతి తమ సర్గమున వాల్మీకి తన శిష్యుఁడగు భారద్వాజునితో నద్భుత రామాయణమును గూర్చి యిట్లు చెప్పెను.

"సర్వం నవక్తు మిచ్ఛామి పునరుక్త భయాద్విజ
బ్రహ్మణా గోపితం తచ్చ అతోపి నతదుక్తవాన్"

(27-11)

అద్భుత రామాయణకథ తొలుత బ్రహ్మలోకమునందుండి,

జెప్పఁబడి బ్రహ్మలోకమున రహస్యముగ నుండినది.

"అని సరస్వతికిని కనక గర్భుఁడు రహ
స్యమునఁ జెప్పినటి సరసపుఁగథ"

(క. పూ. 5 43)

## వి ష్ణ్వా హా ర ము

వానర రూపముననున్న నారద పర్వతుల నడుమ పురుషోత్తముఁడు కన్పించుచున్నాఁడవిన శ్రీమతిని, పర్వతముని యాతని వక్షస్థలమున నేమి కన్పించుచున్నదని ప్రశ్నింప, నామె తానాతని యురమున నొక దివ్యమాలికను జూచుచున్నానని చెప్పెను.

"కన్యాతమాలా మాలాం వై చంచ ద్రూపాదునుత్తమాం
వక్షస్థలేస్య పశ్యామి" (4-12)

ఈ విష్ణు వక్షస్థలమందలి చంచన్మాలయే కళాపూర్ణోదయమందలి సూరనార్యుని విష్ణుకలాప కల్పనకు మూలమై యుండును.

## మాలతీ మాళవులు—సుగాత్రీ శాలీనులు

అద్భుత రామాయణమందలి మాలతీ మాళవులను పవిత్ర దంపతులు, కళాపూర్ణోదయమందలి సుగాత్రీ శాలీనులను బోలుచున్నారు.

"తత్రైవ మాళవో నామవైద్యో విష్ణు పరాయణః
దీపమాలాం హరేర్నిత్యం కరోతి ప్రీతిమానసః
మాలతీ నామభార్యాసీత్తస్య నిత్యం పతివ్రతా"

(5-9, 10)

మాళవుఁడట విష్ణున కనుదినము దీపమాల నొసఁగఁగా శాలీను డిట నిత్యము సరస్వతీదేవికిఁ బూలమాల నిచ్చి పూజించువాఁడు. సుగాత్రియు మాలతివలెఁ బరమ పతివ్రత.

## సా హ స కృ త్య ము లు

"కాష్ఠ శంకుభిరన్యోన్య శ్రోత్రాణి బిభిదుః కిల"
"ఇత్యుక్త్వాతేను నియతా జిహ్వాగ్రం చిచ్ఛిదుః స్వకః"
(5, 21,22)

అద్భుత రామాయణమున కౌశిక శిష్యులు కళింగాధీశుని నామ గానమును వినఁగూడదని చెవులను పొడుచుకొనియు, ఆతని స్తోత్ర మొనర్పరాదని జిహ్వాచ్ఛేదన మొనర్చుకొనియు, దమ విష్ణుభక్తిని బ్రదర్శించి ముక్తిని బొందఁగా కళాపూర్ణోదయమున మణిస్తంభుఁడు దూరశ్రవణ శక్తికై కర్ణపుటముల నారసములను బరపుకొనియును మణికంధరుఁడు సారస్వత ప్రౌఢిమార్థియై నాలుకఁ గోసికొనియును మృగేంద్ర వాహనాదేవి కృపచేఁ దమ తమ యభీష్టములను బడసిరి.

## వి మా న వ ర్ణ న ము

భువనేశ్వరుని కడకు హరిమిత్రుఁడెక్కి వచ్చిన విమానము సూర్యకాంతితోఁ దేజరిల్లుచున్నదని వాల్మీకిచే వర్ణింపబడినది.

"తతణం దైవయోగేన హరిమిత్రో మహాయశాః
విమానేనార్క వర్ణేన"........ (6-75)

కళాపూర్ణోదయమునఁగూడ నలకూబరుఁడెక్కి వచ్చిన విమానమును సూర్యునితో నుపమించెను.

"వారి విమాన రత్నమును వారిధరంబు మఱుంగుఁబాసి, బాలారుణ భానుబింబము దయాద్రి మఱుంగును బాయు చాడ్పునన్" (1-153)

## జ ల ప్ర వే శ ము

అద్భుత రామాయణమున, తనకు దొరికియని సముద్రునిపైఁ గోపించి లక్ష్మణుడు పాదోధిమధ్యమున దుమికెను.

"లక్ష్మణ క్రోధ సందీప్తః పపాతాబ్ధేర్జలాంతరే"

(16-11)

తన యభిమతమునకు విరుద్ధముగా సరస్వతీదేవిమండి వర

మును పొందిన సుగాత్రిసె గోరించిన శారీనుడిట్లే అగాధమైన శీతతాళ దఘ్నహ్రదమున దుమికెను.

"ఘనరోషు డగుచు ... ... ... హ్రదముననుటికెన్"

(క. పూ. 4.51)

## స్వస్థాన పాతము

సహస్ర కంఠరావణుడు, బలహీనకుగు శ్రీరామ సైన్యమును జంపనేలయని తలచి వాయవ్యాస్త్రముచే వారివారిదేశము లందుండునట్లు వారినిఁబడవైచెను. వారెల్ల తమతమదేశములుచేరి మిగులనాశ్చర్యము చెందిరి.

"యస్మాదస్మాత్సమాయాతా స్తంతందేశం ప్రయాపితాః"

"తేసర్వే స్వగృహం ప్రాప్తా అస్త్రవేగేన విస్మితాః

(21-9, 11)

ఇట్లే కళాపూర్ణోదయమున మణికంధరునిచే దేవికి బలిసీయఁబడిన కలభాషిణి, దేవివరముచే, పునస్సహితమస్తకయై, కనువిచ్చి నిజపురివర్తనియై స్వభవనారామ భూమియం దుండుటకు వెలుగందెను.

(4-186)

## సింహరథ—మృగేంద్ర వాహన

శ్రీరాముఁడొనర్చిన సీతాసహస్రనామస్తవములో నామె 306వ నామమున 'సింహరథ'యని స్తుతింపఁబడెను.

"వ్యోమలక్ష్మీ, స్సింహరథా, చకితాన్య మిత్రప్రభా."

కళాపూర్ణోదయమున మహిషాసురుని జంపిన మహాకాళి 'మృగేంద్రవాహన' యనుపేరుతోఁ బ్రసిద్ధి పొందినది. ఈ నామకలనకు, సూరనకి 'సింహరథ' యనుపదము ప్రేరకమై యుండవచ్చును.

## సుప్రసాదుఁడు

సహస్ర కంఠ రావణుని పుత్రులలో నొకనిపేరు 'సుప్రసాదుఁ'డని అద్భుత రామాయణమునఁ గలదు.

"మధుర స్సు ప్రసాదశ్చ కిరీటశ్చ మహాబలః"

"ఏతే రావణపుత్రాశ్చ మహావీర్య పరాక్రమాః" (19. 5, 9)

కళాపూర్ణనకు అభినవ కౌముదియందుఁ గలిగిన కుమారునకు నిట్లే పింగళి సూరన సుప్రసాదుఁడని పేరు బెట్టెను.

(క. పూ. 8. 253)

ఇంతవఱకుఁ జేసిన యుభయ గ్రంథములలోని సమాన లక్షణముల పరిశీలనమువలన, నీ రెండింటిలోను, దైవ, మానవ, దానవ తిర్యగాది పాత్రములు, వరములు శాపములు, పునర్జన్మలు, ఆకస్మిక సముద్ఘాతములు, అంతర్ధానములు, జలపతనములు, సరూపపాత్రద్వయచిత్రణములు, సాహస కృత్యములు, మున్నగు ననేకాంశములు సమములై యుండుటచేత పింగళి సూరన కళాపూర్ణోదయముపై వాల్మీకి అద్భుత రామాయణ ప్రభావ మధికముగాఁ గలదని స్పష్టపడుచున్నది.

### ఈ వ్యాసమునకుఁ దోడ్పడిన గ్రంథములు

1 సంస్కృతాద్భుత రామాయణము.

(జీర్ణావస్థలోనున్నను, తమ సంస్కృతాద్భుత రామాయణ గ్రంథమును బంపి నా కృషికి సంపూర్ణ సహకార మొసరిన అనావళి వాస్తవ్యులు బ్రహ్మశ్రీ కవిహంస వేదుల వేంకటశాస్త్రిగారికి కృతజ్ఞతలు).

2 లింగపురాణము.

3 ఆంధ్రాద్భుత రామాయణము.

4 ప్రబంధవాఙ్మయ వికాసము. ప్రాతకాని. ఉస్మానియా విశ్వవిద్యాలయము.

5 కళాపూర్ణోదయము. 1910 సం॥ వావిళ్ల ముద్రణ.

6 వ్యాసరత్నావళి.

7 భారతి; డిసెంబరు 1941.

8 Studies in Kalapurnodayam

# మహా సంప్రదాయం

## ఒక దశ అంతం అవుతోందా?

### వెర్నర్ హెయిసెన్‌బెర్గ్

[రచయిత 1932లో భౌతికశాస్త్రంలో పరిశోధనల కోసం నోబెల్ బహుమతి పొందాడు. 1946 నుంచి 1970 దాకా "మాక్స్ ప్లాంక్ ఇన్‌స్టిట్యూట్" డైరెక్టరుగా ఉన్నాడు. ప్రస్తుతం అలెగ్జాండర్ ఫాన్ హంబోల్ట్ పేర స్థాపింపబడిన సంస్థకి అధ్యక్షుడుగ ఉంటున్నాడు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని స్మిత్సోనియన్ ఇన్‌స్టిట్యూట్‌వారు కోపర్నికస్ (500)వ జన్మదినోత్సవం సందర్భంలో ఏర్పరచిన ప్రసంగం "ఎన్‌కవుంటర్" పత్రికలో వెలువడింది. ఇది దానికి అనువాదం. భారతిలో ఈ వ్యాసం ప్రచురణ ఎన్‌కవుంటర్ పత్రిక సౌజన్యంతో వీలయిందని పాఠకులు గమనించగోరుతాము. అనువాదకుడు సాధారణంగా చెలామణి అవుతున్న తెలుగు మాటలనే ఎక్కువగా వాడినట్లు విజ్ఞప్తి చేసుకుంటున్నాడు. కొన్ని మాటలు నిఘంటువుల నుంచి తీసుకున్నవి. వీటిలో కొన్ని కొందరికి ఎబ్బెట్టుగా తోచవచ్చు! చదువరులు వీటిని సహృదయంతో స్వీకరించగలరని అనువాదకుడి పేరుల ఉచ్చారణ విషయంలో కూడా పాఠకులు సహృదయం చూపగలరని అనువాదకుడు ఆశిస్తున్నాడు. సం.]

కోపర్నికస్ (1473-1973) యొక్క అయిదువందల జన్మదినోత్సవాన్ని ఇటీవలే మనం జరుపుకున్నప్పుడు ఇప్పటి విజ్ఞాన శాస్త్రం అతని కృషికి సంబంధించినదనీ, ఖగోళ శాస్త్రంలో అతను మొదలుపెట్టిన ధోరణి ఇంక మనకాలంనాటి శాస్త్రకృషిని శాసిస్తోందనీ మనం అనుకున్నాము. ఈనాటి సమస్యలు, పద్ధతులు, శాస్త్రీయ భావాలు కొంతవరకయినా శతాబ్దాలుగా విజ్ఞానశాస్త్రానికి తోడుగా వచ్చిన (లేక దారి చూపిన) ఒక శాస్త్రీయమయిన సంప్రదాయం యొక్క ఫలితాలని మన విశ్వాసం. అందుచేత, వర్తమాన కాలపు కృషి ఎంతవరకు ఈ సంప్రదాయం వలన నిర్ణయింపబడింది, దాని ప్రభావానికి లోనయింది-అన్న ప్రశ్న అడగటం సహజం. మనం కొన్ని సమస్యల పరిష్కారంకోసం ప్రయత్నిస్తూ ఉంటాము. ఇవి మన అభిలాష, ఇష్టాన్నిబట్టి ఎన్నుకున్నవా? లేక చరిత్ర క్రమంలో మనకి సంభవించినవా ? మన ఉద్దేశాన్నిబట్టి మన శాస్త్ర పద్ధతులని ఎంతవరకు ఎన్నుకొనగలము? అదివరకేఉన్న ఒక సంప్రదాయాన్ని ఏంతవరకు అనుసరిస్తాము ? ఇక, మన ప్రశ్నలని తయారు చెయ్యటానికి కావలసిన ప్రశ్నలని మనం ఏరుకొనటానికి ఎంత స్వేచ్ఛ ఉంది ?

మనం కొన్ని ప్రశ్నలకి సమాధానంకోసం చూస్తూ ఉంటాము. వీటినిబట్టి ఏ శాస్త్ర ప్రక్రియకయినా నిర్వచనం చెప్పగలము. కాని ప్రశ్నలని తయారుచెయ్యాలంటే ఒక దృగ్విషయాన్ని సాధించగల భావాలు మనకి అవసరం అవుతాయి. ఈ భావాలని సాధారణంగా శాస్త్రంయొక్క గత చరిత్రనుంచి తీసుకుంటూ ఉంటాము. అవి అప్పటికే దృగ్విషయంయొక్క స్వరూపం ఎటా ఉండటానికి వీలవుతుందో సూచిస్తాయి. అయితే మనం కొత్త దృగ్విషయ ప్రదేశంలోకి వెళ్ళదలుచుకున్నట్లయితే ఈ భావాలు పురోగతికి దోహదం కలిగించక పోగా దానికి అడ్డుపడే వ్యతిరేకభావాలు కావచ్చు. అప్పుడయినా మనం భావాలని వాడవలసిందే; మనకి సంప్రదాయం ప్రసాదించిన వాటిని వాడుకొనకుండా ఉండలేముకూడా. అందుచేత నేను ముందుగా సమస్యల ఎంపికలో సంప్రదాయంయొక్క ప్రభావాన్ని చర్చిస్తాను. ఆతరువాత శాస్త్రపద్ధతులలో దాని ప్రభావాన్ని, చివరికి మన పనిలో భావాలని సాధనాలుగా వాడటాన్ని చర్చకి వస్తువులుగా తీసుకుంటాను.

మన సమస్యల ఎన్నికలో మనం ఏంతదాకా సంప్రదాయానికి కట్టుబడి ఉంటాము ? మనం విజ్ఞాన శాస్త్రం చరిత్రలోకి తిరిగి చూసినట్లయితే కొన్ని కాలాలలో ఎంతో చురుకుగా పనిసాగితే మరి కొన్ని కాలాలలో చాలా మందకొడిగా సాగుతుందని తెలుసుకొనగలుగు

కాము. ప్రాచీన గ్రీసుదేశంలో తత్వవేత్తలు ప్రకృతికి సంబంధించిన దృగ్విషయాలని గురించి సిద్ధాంతానికి సంబంధించిన ప్రశ్నలని కొన్నిటిని వెయ్యటం మొదలు పెట్టారు. వాడుకకి ఉపయోగపడే విజ్ఞానం చాలా అంతకి ముందే ఉండేది. ఇళ్ళని కట్టటంలో, పెద్దరాళని పగులగొట్టి కదపటంలో, నావల నిర్మాణంలో ఎంతో చాకచక్యం ఏర్పడింది. కాని, పయితాగొరాస్ కాలం తరువాతనే ఈ చాకచక్యం తోబాటు శాస్త్రీయ విచారణకూడా వాడుకలోకి వచ్చింది. ప్రకృతిలోని దృగ్విషయాలకి గణితశాస్త్రంలోని సంబంధాలు ఎంత ప్రస్తుతమో పయితాగొరస్, అతని శిష్యులు కనుగొన్నారు. తదనంతరం గణిత శాస్త్రంలో, ఖగోళ శాస్త్రంలో, విజ్ఞానశాస్త్రంలో ఎంతో అభివృద్ధి వచ్చింది.

ఇంగ్లీషులో "హెల్లెనిస్టిక్" అనే కాలం అయిపోయిన తరువాత గ్రీసుదేశపు విజ్ఞానశాస్త్రం క్షీణించటం ప్రారంభించింది. తిరిగి ఇటలీలో మొదలయిన "రినెయిసాన్స్" (లేక పునరుజ్జీవనం) దాకా ఇది పుంజుకొనలేకపోయింది. క్షీణదశలో వ్యవహారజ్ఞానం బాగా అభివృద్ధి చెంది అరబ్బు దేశాలలో నాగరికత మంచి స్థాయిని అందుకొనగలిగింది. అయితే, ఈ అభివృది తోబాటు విజ్ఞానశాస్త్రం అభివృద్ధి కాలేదు, ప్రకృతి అవగాహన మరింత గాఢం కాలేదు. పునరుజ్జీవనం, మానవతావాదం ఆలోచనా ధోరణులతో స్వేచ్ఛ అధికం కావటానికి దారి చూసిన తరువాత, భూగోళ పరిశోధకులు ఇక్కడ విస్తరణ వీలవుతుందని చూపించిన తరువాత కోపర్నికస్, కెప్లర్, గెలీలియోల దర్శనాలు విజ్ఞానశాస్త్రంలో కొత్త ఉత్సాహాన్ని పుట్టించాయి. ఈ ఉత్సాహం మన కాలందాకా కొనసాగుతూ వచ్చింది. ఇది ఇంకా ఎంతోకాలం కొనసాగుతుందో లేదో చెప్పలేము. అదిపోయి కొత్త మార్గాలని అన్వేషించే అభిలాష ఏదయినా జన్మిస్తుందేమో చెప్పలేను.

ఈ విధంగా చరిత్రని సింహావలోకనం చేసినట్లయితే మన సమస్యల ఎంపికలో కొంత స్వేచ్ఛమాత్రమే ఉందని చూడగలుగుతాము. మనం చరిత్ర క్రమంతో ముడిపడిపోయాము. మన జీవితాలు ఈ క్రమంలో భాగాలు. మన ఎంపిక ఒక నిర్ణయానికిమాత్రం పరిమితం అయి ఉంటుందనిపిస్తుంది. మన కాలంలో జరిగే పరిణామంలో మనం పాల్గొంటామా లేదా (మన ప్రయత్నం, కృషిఫలితం ఇచ్చినా ఇవ్వకపోయినాసరే అన్న నిర్ణయమే ఇది. వీలుగా ఉండే సందర్భమే లేకపోయినట్లయితే మన కృషి అదృశ్యం అయిపోవచ్చు. ఆల్బర్ట్ అయిన్‌స్టెయిన్ గనుక 12వ శతాబ్దంలో జీవించి ఉంటే అతనికి మంచి శాస్త్రజ్ఞుడు కావటానికి అవకాశాలు ఉండి ఉండకపోవచ్చు. మంచి ఫలితాలు ఇచ్చే కాలంలో కూడా ఒక శాస్త్రజ్ఞుడికి తన సమస్యని ఏరుకునే స్వేచ్ఛ ఉండకపోవచ్చు. స్వేచ్ఛ అనేది ఉండకపోగా ఫలవంతమయిన కాలంలో మనం వాటిని తయారుచేసుకో నక్కర లేకుండా అవేమనకి అందుబాటులోకి రావచ్చు.

ఇది విజ్ఞాన శాస్త్రంలోనే కాదు (లలిత) కళ విషయంలో కూడా నిజమనిపిస్తుంది. 15వ శతాబ్దంలో, నెదర్‌లాండ్స్‌లో కొందరు చిత్రకారులు మనుష్యులని అప్పటి సమాజంలో ఉత్సాహవంతులయిన సభ్యులుగా చిత్రీకరించటం వీలవుతుందని తెలుసుకున్నారు. ఎందరో ప్రతిభావంతులు ఈ వీలుచేత ఆకర్షింపబడ్డారు. ఈ సమస్య పరిష్కరించటానికి వీరు ఒకరితో ఒకరు పోటీపడ్డారు. 18వ శతాబ్దంలో జోసెఫ్ హెయిడెన్ సాహిత్యంలో కనిపించే భావావేశాలని తన సంగీత సృష్టిలో వ్యక్తం చెయ్యటానికి ప్రయత్నించాడు. (రూసో, గోథేల రచనలలోనివి మరీ ప్రత్యేకంగా) అతనికన్నా చిన్న వయస్సు సంగీత విద్వాంసులు ఒకతరంవారు. (మోజార్ట్, బిథోవెన్, షూబర్ట్,) వియన్నాలో పోగుఅయి ఈ సమస్య పరిష్కారంలో పోటీపడ్డారు.

మన శతాబ్దంలో నీల్స్‌బోర్ ఒక పరమాణువు సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. రూథర్‌ఫోర్డు ఆల్ఫా కిరణాల ప్రయోగాలనీ, ప్లాంక్ కిరణ ప్రసారం సిద్ధాంతాన్నీ, రసాయనిక శాస్త్రంలోని యదార్థాలనీ కలిపి ఈ సిద్ధాంతాన్ని తయారు చెయ్యటానికి అతను ప్రయత్నించాడు. ఆ తరువాతి సంవత్సరాలలో ఎందరో యువ భౌతిక శాస్త్రజ్ఞులు ఈ సమస్య పరిష్కారంలో పాలుగొనటానికి కోపెన్‌హాగెన్‌కి వెళ్ళారు. సమస్యల ఎంపికలో సంప్రదాయం-అంటే చరిత్ర క్రమాభివృద్ధి—అతి ముఖ్యమయిన పాత్ర వహిస్తుందనటంలో సందేహంలేదు.

ఇది అభావాత్మకంగా కూడా నిజం. సాంప్రదాయ విషయాలలో ఇక కృషికి అవకాశాలు తక్కువ అని ప్రతిభావంతులు ఈ రంగాలని వదులుకోవచ్చు థామస్ అక్వినాస్ తరువాత తత్వవేత్తలు దైవానికి సంబంధించిన సమస్యలని వదిలి మానవతావాదం వయిపు తిరిగారు. మనకాలంలో కళలకి సంబంధించిన వస్తువులు కరువయిపోయాయనిపిస్తుంది ఈమధ్యే జర్మనీలో ఒక ఆధునిక కళా ప్రదర్శనం జరిగింది. కాస్సెల్ అనే నగరంలో జరిగిన ఈ ప్రదర్శన కళకన్నా రాజ

క్రియాలకోసమే అధికంగా ప్రచారం చేసింది. ఇది జరిగిన భవనం బయట విద్యార్థులు "కళ అనవసరం" అనే ఒక పెద్ద పోస్టర్‌ని అతికించారు. కొంతకాలం తరువాత విజ్ఞాన శాస్త్రం సాంకేతిక శాస్త్రపు విషయాలు శుష్కమయిపోయి యువతరంవారు మన హేతువాదపు ధోరణులని, ప్రయోజన వాదాలనీ తోసివేసి సరికొత్త కృషిలో మునిగిపోవచ్చు. ప్రస్తుతపు పరిస్థితిలో శుద్ధ, వినియుక్త విజ్ఞానశాస్త్ర సమస్యలని ఇంకా పరిష్కారంకోసం "ఇస్తూ" ఉంటారు గురువులు తమ శిష్యులకి. ఇది కొంతకాలందాకా సాగుతుంది. దీనికోసం ప్రయాస పడనక్కరలేదు.

విజ్ఞానశాస్త్రంకాని, లలితకళకాని అభివృద్ధి కావాలంటే వ్యక్తిగత సంబంధాలు సరిగా ఉండాలని ఈ సందర్భంలో చెప్పక తప్పదు. ఇది గురు, శిష్య సంబంధం అయిఉండనవసరంలేదు. ఒక లక్ష్యం కోసం పనిచేస్తున్న వ్యక్తులమధ్య గౌరవాభిమానాలు లేక స్నేహం ఉన్నాచాలు. బహుశ సంప్రదాయంలో ఇంతకన్నా కార్య సాధకమయిన సాధనం లేదేమో ! ఈ శతాబ్దంలో భౌతిక శాస్త్రం అభివృద్ధికి తోడ్పడిన కొన్ని వ్యక్తిగత సంబంధాలని గురించి చెప్తాను.

ఐన్‌స్టెయిన్‌కి మాక్స్‌ప్లాంక్‌తో మంచి పరిచయం ఉండేది; మాక్స్ బోర్న్‌కి ఐన్‌స్టెయిన్ మంచి స్నేహితుడు – పరిమాణ సిద్ధాంతాన్ని గణాంకశాస్త్రంద్వారా అర్థంచేసుకోవచ్చునన్న వాదాన్ని ఐన్‌స్టెయిన్ స్వీకరించలేకపోయినా; నీల్స్‌బోర్‌తో సందిగ్ధ సిద్ధాంతంలోని సంబంధాలు తత్వశాస్త్రం దృష్టితో చూస్తే ఎలాగ ఉంటాయో వర్ణించేవాడు. సాపేక్ష, పరిమాణ సిద్ధాంతాలు చాలా క్లిష్ట మయినవి. అసలు వీటి తాలూకు సమస్యలయొక్క శాస్త్రీయ మయిన అనుశీలన వాటిమీద పరిశోధనలు చేసినవారిమధ్య జరిగిన సంభాషణలలోనే కొనసాగింది.

1920 ప్రాంతంలో మ్యూనిక్‌లోని సోమర్‌ఫెల్డ్ బృందం ఒక పెద్ద పరిశోధనాకేంద్రంగా ఉండేది. పౌలి, వెంటెల్, లాపోర్ట్, లెన్ట్జ్ మొదలయినవారు ఈ బృందానికి చెందినవారే. మేమందరమూ కలిసి అంతక్రితమే జరిగిన ప్రయోగాలలో ఇమిడిఉన్న చిక్కులని, వింతలనీ గురించి ప్రతిరోజూ చర్చలు జరిపేవారము. సోమర్‌ఫెల్డ్ పెద్ద శాస్త్రజ్ఞులవద్దనుంచి తనకివచ్చిన ఉత్తరాలలోని ముఖ్యాంశాలని మాకు చదివి వినిపించేవాడు. వెంటనే చర్చలు మొదలయ్యేవి. నీల్స్‌బోర్, రూదర్‌ఫోర్డ్, ఓటోహాన్, లీసెమిట్నర్ లతో దగ్గిర సంబంధాలు పెంచుకున్నాడు. ప్రయోగం, సిద్ధాంతం వీటిమధ్య సహకారం బాగా కొనసాగేటట్టు చూడటం భౌతికశాస్త్రం అభివృద్ధిలో అతిముఖ్యమయిన కార్యక్రమం అని అతను నమ్మేవాడు.

నీల్స్‌బోర్ కాలపు భౌతికశాస్త్రం అభివృద్ధిమీద అతని ప్రభావం ఇంతా అంతాకాదు. ఇది అధికంగా అతని సాంకేతిక రచనల వలన వచ్చిన ప్రభావం మాత్రమేకాదు. ఇది పరిమాణ సిద్ధాంతాన్ని గురించి అతను తన తోటివారితో నిరంతరాయంగా జరిపిన చర్చలవలననే వచ్చిన ప్రభావం అనాలి. ఈ సిద్ధాంతంలోని చిక్కులు కొన్ని చాలా మౌలికమయినవనీ, వాటి పరిష్కారం తేలిక కాదనీ అతనికి తెలుసు. ష్రోడింగర్ "తరంగ యంత్ర గణితశాస్త్రా"న్ని ప్రతిపాదించినప్పుడు పరిమాణ సిద్ధాంతంయొక్క అతి ముఖ్యమయిన ఆకృతి బయట పడిందని అతను వెంటనే గ్రహించాడు. అయితే, పరమాణువులోని ఎలెక్ట్రానుల కక్ష్యలబదులు మూడు పరిమాణాలు (త్రీ డయిమెన్షనల్) కల "పదార్థపు-తరంగాల"ని ప్రతిపాదించినంత మాత్రాన అసలు కష్టాలు తొలగిపోవనికూడా అతను గ్రహించాడు. ఈ సమస్య పరిష్కారం నేరుగా చర్చలద్వారానే వీలవుతుందని నీల్స్‌బోర్ తలచి వెంటనే ష్రోడింగర్‌ని కోపెన్‌హాగన్‌కి పిలిపించాడు. రెండువారాలపాటు తీవ్రమయిన చర్చలు జరిగాయి. వీటి ఫలితంగా పరిమాణ సిద్ధాంతాన్ని అభివృద్ధి చెయ్యటానికి మంచి వీలుకలిగింది. బోర్ ప్రతిపాదించిన "పరిపూరకతాభావం" (కాన్సెప్ట్ ఆఫ్ కాంప్లిమెంటారిటీ) అభివృద్ధి, సందిగ్ధంలోని అంతరత సంబంధాల అభివృద్ధి రెండూకూడా వీటిఫలితంగానే కొంతవరకయినా సాధ్యం అయినాయనవచ్చు.

ఇంకా ఉదాహరణలని ఇవ్వనవసరం లేదనుకుంటాను. వ్యక్తులమధ్య సంబంధాలు విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి, సమస్యల ఎన్నిక-వీటి విషయంలో అతిముఖ్యమయిన పాత్ర వహిస్తాయని తెలుస్తూనే ఉంది.

విజ్ఞానశాస్త్రం చరిత్రలో సమస్యల ఎన్నికకి దారితీసిన ఇతర ప్రేరేపణలుకూడా ఉన్నాయని వేరే చెప్పనవసరంలేదు. విజ్ఞానశాస్త్రం యొక్క వినియోగం వీటన్నిటిలోనూ మనకి సుపరిచితమయినది. నౌకాయానానికి, భూమికొలతలకి, భగోళ, గణితశాస్త్రాలు ఉపయోగపడతాయని చాలా ప్రాచీన కాలమునే మానవులు తెలుసుకున్నారు

15వ శతాబ్దంలో నౌకాయానం ఎంత ముఖ్యమయిన పాత్ర వహించిందో యూరోపుని, మధ్యధరా సముద్రాన్ని వదిలి పశ్చిమంగా వెళ్ళిన అన్వేషకుల విజయాలే తెలుపుతాయి. ఈకాలం తదనంతరమే కోపర్నికస్ సమాపాదనాలు బయటపడటం కేవలం యాదృచ్ఛికం మాత్రం కాజాలదు. గెలీలియో కోపర్నికస్ భావాలని సమర్థించినప్పుడు అంతకిముందే కనిపెట్టబడిన టెలిస్కోపుని ఉపయోగించాడు. అంటే, వినియోగసాధనం విజ్ఞానశాస్త్రం అభివృద్ధికి ఉపయోగపడుతుందని ఒక చెంప నిరూపింపబడింది; మరొక చెంప విజ్ఞానశాస్త్రం ఇటువంటి సాధనాల సృష్టికి ఉపయోగపడుతుందనికూడా తేలింది. గెలీలియోకీ, అతని అనుచరులకీ విజ్ఞానశాస్త్రం యొక్క వినియోగంమీద ఆసక్తి ఎక్కువగాఉండేది. వారు యంత్రాలని ఎక్కువగా అనుశీలించేవారు (ఉదాహరణకి యంత్రంద్వారా పనిచేసే గడియారాలు), దృక్‌శాస్త్రానికి సంబంధించిన సాధనాలని ఎన్నిటినో కనిపెట్టారు. న్యూటన్ "కామ్" నదిమీద ఒక వంతెన కట్టాడు—(కేంబ్రిడ్జి ఊరులో) ఇటువంటి ఉదాహరణలు వేరే ఇవ్వవచ్చు. విజ్ఞానశాస్త్రాన్ని వినియోగించాలనీ, వినియోగాలు ఫలితాల ప్రాబల్యానికి పరీక్షలు కావటమేకాక ప్రయాస ఎంతవరకు న్యాయమో తెలుపుతాయనీ మన శాస్త్రసంప్రదాయం చెబుతూనే ఉంది. ఎన్నో తరాలవారు ఈ పద్ధతినిబట్టే తమ కృషిని కొనసాగించారు. పరమాణు భౌతికశాస్త్రాన్ని వినియోగించటంకోసం ఈ శతాబ్దంలో కొందరు శాస్త్రవేత్తలు ప్రయత్నించినప్పుడు వారు ఈ పాత సంప్రదాయాన్నే అనుసరిస్తూ వచ్చారు. మొట్టమొదటి వినియోగం యుద్ధంకోసం జరగటం వారికి నిరాశ కలిగించిందని వేరే చెప్పనక్కరలేదు. అయినా రసాయనిక మూలపదార్థాలని కొన్నిటిని ఇతరమూల పదార్థాలుగా మార్చటానికి వీలుకలుగటం విజ్ఞానశాస్త్రం విజయాలలో ఒకటి అని అనుకొనటం న్యాయమేకదా!

వినియోగంమీద ఆసక్తిని కొందరు సరిగా అర్థం చేసుకోరు. శాస్త్రజ్ఞుడు వినియోగంద్వారా "డబ్బు చేసుకొనటానికి" అల్ప ప్రయత్నాలు చేస్తున్నాడనుకుంటారువీరు. వ్యక్తినిబట్టి ప్రయోజనం మీద ఆశ ఉండవచ్చు, కాదనలేము:అయితేదానిని అతిచేసిచెప్పకూడదు. ఒకమంచి శాస్త్రవేత్త వినియోగాన్ని తలచుకుని సమ్మోహితుడు కావచ్చు. తను ప్రకృతిని బాగా అర్థం చేసుకున్నాడా, తనకి అర్థం అయినది అనుకున్నట్లు పనిచేస్తుందా? అని ప్రశ్నించుకుంటాడు అతను. పసిఫిక్ సముద్రంలో ఉదజని బాంబు పేలడానికి ముందు ఎనికో ఫెర్మీతో మాట్లాడుతూ, "ఇటువంటి పరీక్షలు చెయ్యటం ఆపితే మంచిది," అన్నాను నేను. "వీటివల్ల రాజకీయాలలో, ప్రాణికోటితో ఎటువంటి పరిణామాలు వస్తాయో", అన్నాను.

"అవును కాని ఇది ఎంత చక్కటి ప్రయోగం!" అని సమాధానం ఇచ్చాడు ఫెర్మీ. విజ్ఞానశాస్త్ర వినియోగాలని ప్రేరేపించే శక్తులలో ఇదే ముఖ్యమయినదని నా నమ్మకం. ప్రకృతిని అర్థం చేసుకున్నాడని పక్షపాతంలేని నిర్ణేత ఒకడు శాస్త్రవేత్తకి చెప్పాలి—ప్రకృతిని మించిన నిర్ణేత ఎవరు? తన ప్రయాస యొక్క ప్రభావం ఏమిటో కూడా చూడాలని శాస్త్రవేత్త కోరుకుంటాడు.

ఒక శాస్త్రజ్ఞుడు తన పరిశోధనా క్రమాన్ని ఎన్నుకున్నప్పుడు కొన్ని సిద్ధాంతాలని మనస్సులో ఉంచుకుని పని మొదలుపెడతాడు. అప్పటికి తెలిసిన దృగ్విషయాలకి సంబంధించిన కొన్ని ఊహలని ఆధారం చేసుకుని పరిశోధనలు ప్రారంభిస్తాడు. కాని ఏ భావాలు చివరికి స్వీకరణీయమయినవిగా తేలుతాయి? గతానుభవాన్నిబట్టి మనం ఒకటి తెలుసుకోవచ్చు–అదేమిటంటే భావాలని అనిరోధంకోసం, సుస్పష్టతకోసం మాత్రమే భావాలని మనముస్వీకరించము. వాటి వివరణ, రుజువులతో మనం పొలుగొనగలమన్న ఆశతోనే మనం వాటిని స్వీకరిస్తూ ఉంటామనిపిస్తుంది. మన ఉత్సాహం వెనుక శక్తి, మన ప్రయాస ఫలిస్తుందన్న ఆశ మనకి విజ్ఞానశాస్త్రంలో మార్గాన్ని చూపిస్తూ ఉంటాయి. వివిధ సైద్ధాంతిక భావాలని గురించి మనం కొన్ని కోరికలు కోరుకుంటాము. సహేతుకమయిన నిర్ణయంకన్నా ఈ కోరికలే బలవంతంగా ఉంటాయి. 1920 ప్రాంతంలోనే మాకు నీల్స్‌బోర్ పరమాణువు సిద్ధాంతం సరయినదని కాదని తెలుసు. కాని అది సరయిన దారిని చూపుతోందని మేము నమ్మేటట్లు నమ్మాము. ఆ సిద్ధాంతంలోని విరోధాలని విసర్జించి దానికి సంతృప్తికరమయిన స్వరూపాన్ని ఇవ్వగలమని ఆశించాము.

సమస్యల ఎన్నిక విషయంలో మాత్రమేకాదు విజ్ఞానశాస్త్రంలో సంప్రదాయం వహించే పాత్ర. శాస్త్రం క్రమంలో కంటికి అంత తేలికగా కనిపించని పొరలు కొన్ని ఉంటాయి. సంప్రదాయం వీటిమీదనే తన ప్రభావాన్ని పూర్తిగా చూపిస్తుంది. ఈ సందర్భంలో నేను "శాస్త్ర పద్ధతి"ని గురించి చెప్పాలి.

16, 17వ శతాబ్దాలలో కోపర్నికస్ గెలీలియో, వారి తదనంతరం వారు కనిపెట్టి, అభివృద్ధి చేసిన పద్ధతినే ఈ శతాబ్దం

లోనూ విజ్ఞాన శాస్త్రంలో మనం మొత్తంమీద వాడుకుంటున్నాము. ఒకప్పుడు "కాల్పనిక" శాస్త్రం ఉండేదనీ, పయిన చెప్పిన పద్ధతి ఈ శాస్త్రానికి భిన్నంగా ప్రత్యక్షానుభవం మీద మాత్రమే ఆధారపడుతుందనీ కొంతరు అంటారు. ఇది ఒక అపోహ. నిజానికి గెలీలియో అరిస్టాటిల్‌ని అనుసరిస్తూ వచ్చిన తనకాలపు సాంప్రదాయిక శాస్త్రాన్ని వదులుకుని ప్లాటో తాత్విక భావాలని తీసుకున్నాడు. అరిస్టాటిల్‌ది పరిశీలనమీద ఆధారపడిన విజ్ఞానశాస్త్రం. ప్లాటోకి నిర్మాణమే ప్రధానంగా ఉండేది. గెలిలియో "అనుభవం" అవసరం అని వాదించినప్పుడు గణితశాస్త్రం సహాయంతో తయారయిన నిర్మాణాల కాంతిలో కనిపించే అనుభవమే కావాలన్నాడు. ప్రత్యక్షమయిన అనుభవాన్ని వదిలి మనః కల్పితమయిన అనుభవాన్ని ఊహించినట్లయితే దృగ్విషయాలలో గణిత విషయిక నిర్మాణాలు కనిపిస్తాయని గెలిలియో, కోపర్నికస్‌లు ఇదరూ అనుకున్నారు. కొత్త గ్రహణ శక్తికి కొత్త సౌలభ్యం అనే పునాది పడినటు వారు భావించారు. బరువు వస్తువులకన్నా తేలిక వస్తువులో వేగంగా పడతాయని అరిస్టాటిల్ అన్నాడు. ఇది నిజమే. అయితే గెలీలియో శూన్యాకాశంలో అన్ని వస్తువులూ ఒకే వేగంతో పడ్తాయని ప్రతిపాదించాడు. అవి పాడే విధాలని గణితశాస్త్ర సిద్ధాంతాలు చక్కగా వర్ణిస్తాయని అతను అన్నాడు. అతని కాలంలో శూన్యంలో వస్తువులు పడటాన్ని సూక్ష్మంగా వర్ణించటానికి వీలు లేవుకాని గెలీలియో ప్రతిపాదనలు కొత్త ప్రయోగాలకి దారి తీశాయి. కొత్త పద్ధతి కనిపించే దానిని వర్ణించటానికి పూనుకొనలేదు; సాధారణంగా తటస్థపడని దృగ్విషయాల సృష్టికీ, ప్రయోగాల నిర్మాణానికి ఇది పూనుకుంది; గణిత శాస్త్ర సిద్ధాంతాలని ఆధారం చేసుకుని వీటిని గణించటానికి కూడా ఇది పూనుకుంది.

అందుచేత కొత్తపద్ధతికి రెండు అంశాలు అవసరంఅని గుర్తించాలి. ఒకటి, సూక్ష్మమయిన కొత్త ప్రయోగాలని నిర్మించటం. (ఇవి అనుభవాన్ని మనఃకల్పితంచేసి, దానిని వేరుగా ఉంచగలవు కనుక కొత్త దృక్సన్నివేశాలని సృష్టిస్తాయి) రెండోది, ఈ దృగ్విషయాలని గణిత సిద్ధాంత నిర్మాణాలతో పోల్చి చూడటం (ఈ గణిత సిద్ధాంత నిర్మాణాలని ప్రకృతి సిద్ధాంతాలుగా వర్ణించేవారు.) ఈ పద్ధతి నేటి విజ్ఞాన శాస్త్రం విషయంలో స్వప్రమాణ మయినదా అన్న ప్రశ్నలని చర్చించేముందు కోపర్నికస్, గెలీలియో, కెప్లర్‌లు దేనిని చూసుకుని ఈదారిని అనుసరించారో తెలుసుకొనటం అవసరం. దీనిని గురించి క్లుప్తముగా కొంచెం చెబుతాను.

సి. ఏస్. ఫోన్ వెయిట్ సెక్కర్ ఒక వ్యాసం రాశాడు. అందులో కోపర్నికస్ మొదలయినవారికి దారిచూపిన అధారం దేవుడికి సంబంధించినదని అతను వాదించాడు. ఇది సరయిన మదింపే అనిపిస్తుంది. గెలీలియో ప్రకృతి దేవుడి "రెండవ పుస్తకం" అన్నాడు. మొదటిది బైబిలు. ఈరెండవ పుస్తకంలోని అక్షరాలు గణిత శాస్త్రపు అక్షరాలేనని గెలీలియో అభిప్రాయం. ఈ అక్షరాలు నేర్చుకుంటేనే ఆపుస్తకాన్ని చదవగలమని అతను అనుకున్నాడు. కెప్లర్ "ప్రపంచంయొక్క సమ్మేళనం" గురించి రాసిన గ్రంథంలో ఈ ఈ భావాలని స్పష్టంగా ఇలాగ వ్యక్తపరిచాడు: "దేవుడు తన భావాల ప్రకారం విశ్వాన్ని సృష్టించాడు. ఈ భావాలనే ప్లాటో 'ఐడియాస్' అన్నాడు. ఇవే మూలభావాలు. వీటిని మానవుడు గణిత సిద్ధాంత నిర్మాణాలుగా అర్థంచేసుకోవచ్చు. మానవుడు వాటిని ఎందుకు అర్థంచేసుకోగలడంటే, అతనుకూడా దేవుడి ఆధ్యాత్మికాకృతిలోనే సృష్టింపబడ్డాడు కనుక. భౌతికశాస్త్రం సృష్టియొక్క దివ్యభావాల ప్రతిబింబం. అందుచేత, భౌతిక శాస్త్రం దేవుడిసేవతో సమానం.

[ ఇంకా ఉంది ]

# ఎవరు వీరులో....

కాలం కాంత స్వయంవరానికి వచ్చింది.
చేతిలో పూల మాల ధరించి
ఎవరు వీరులో ముందుకు రండి.
పరిశ్రమల పూలమాలలు మెళ్లో ధరించండి.

కొత్తగా పరిశ్రమలు పెట్టదలచినవారికి
ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో అవకాశాలు వున్నాయి.
ప్రభుత్వం సౌకర్యాలు కల్పిస్తుంది.

విద్యుచ్ఛక్తి, ముడి పదార్థాలు,
నీరు, ఫ్యాక్టరీ భవనాలు...
మీ బాగుకోసం... ... దేశం బాగుకోసం.

సమాచార పౌరసంబంధ శాఖ, హైదరాబాదు

No. 8/75-76

చర్చ :

# "బాలవ్యాకరణము - త్రిలింగలక్షణశేషము

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

నేను ఏప్రియల్ "భారతి"లో "బాలవ్యాకరణము – త్రిలింగ లక్షణశేషము" అను వ్యాసము వ్రాసితిని. దానిమీద శ్రీ పాతకోట రాధాకృష్ణ మూర్తి యనువారు జూన్ నెల 'భారతి"లో "కలగూరగంప" చర్చ చేసిరి. ఆ చర్చకు మూలద్రవ్యములు మూర్తిగారు నా వ్యక్తిత్వమునందు, వ్యాసమునందు నున్నవని తామూహించికొన్న దోషములు.

రాధాకృష్ణమూర్తిగారు విమర్శించునపుడు పక్షపాతము చూపరాదనియు, స్వపరభేదము పాటింపరాదనియు, సముచితత చాటవలెననియు, "స్వాభిమానమునకుఁ దావుండ రాదనియు నీతులు బోధించిరి. "సూరిపై స్వాభిమానమున బహుజనపల్లివారిని కించపరచుట సమంజసముగా"దని వక్కాణించిరి. "విమర్శకులు రెండువైపుల సావకాశముగా ప్రవర్తింపవలెనే గాని పక్షపాతము వహించుట భావ్యముగా"దని పలికిరి. "పరదోషేక్షణ దివ్యచక్షుష్కులగుట మంచిదిగాదు. గుణగ్రాహిత్వము గూడ మన కవసర"మని ప్రవచించిరి. వారు నా వ్యక్తిత్వమునందలి దోషములను గుఱించి వ్యంగ్యముగా వక్కాణించిన మాటలివి. మూర్తిగారికి నా వ్యాసము బొత్తిగా నర్థము గాలేదని చెప్పవలయును. శాంతం పాపమ్.

సీతారామాచార్యులవారు "త్రిలింగలక్షణ శేషము"నందు నెఱికొల్పిన కొన్ని లక్షణములు చిన్నయసూరికిఁ దెలియునని నిరూపించుట నా వ్యాసముయొక్క ముఖ్యలక్ష్యము దానికై యా యిరువురు శిష్యుల జీవితములందు సంభవించిన సన్నివేశములను చారిత్రక సత్యములను నేను నా వ్యాసమున వర్ణించితిని. సూరి నిఘంటువునుండి బాలవ్యాకరణమునుండి సాక్ష్యములు ప్రేకరించి చూపితిని. నేను పని చేయుట సూరిపై నాకుఁగల దురభిమానముగాఁ దోఁచినది. "సముచితత్వ'మగు మూర్తిగారికి! అది నా దురభిమానము గాదనియు సూరి ప్రతిభా దర్శనమనియు "గుణగ్రాహిత్వము" ముద్రకట్టిన మూర్తిగారు గుర్తింపలేకపోవుట దురదృష్టము

చిన్నయసూరి శేముషీబలమును, ఆచార్యులవారి యపాండిత్యమును గడగట్టి గంటవాయించుచుఁ జాటవలసిన యక్కఱ నాకు లేదు. నాకు సూరి చుట్టమై యాచార్యులవారు కాకపోయిరా? ఆ గురు శిష్యుల యంతస్సారము నిదివఱకే యాంధ్రదేశ మాకళింపు చేసికొనెను. నాకంటె, రాధాకృష్ణ మూర్తి గారికంటె ఘనులయినవారి కైవారములను సూరి జీవించియున్నప్పుడు, కన్నుమూసిన తరువాత—వందయేండ్లపైగా—నందుకొనెను. వారుగాని నేనుగాని చేతనైనచోఁ జేయఁదగినది సూరి యుపజ్ఞను గైవారమును సాక్షాత్కరింపఁజేసి కొనుటయే. ఆచార్యులవారిపట్ల నా కెట్టి యసూయయు లేదు. నేనాశించిన పదవి వారికిఁ బ్రాప్తించిన యెడల నాకు వారిపట్ల వైరముగలదని యనుట కవకాశముండెడిదేమో! అట్టి సన్నివేశము సైతము సంభవింపదాయె.

మూర్తిగారు "పరదోషేక్షణ దివ్య చక్షుష్కు" లగుట మంచిదిగాదనిరి. ఎంత గొప్పమాట! ఆచార్యులవారి యగుణములను మాత్రమే నేను జూచితినని వారి యభిప్రాయము. అనఁగా నాచార్యులవారిలో దోషము లున్నవని వా రంగీకరించుచున్నారన్న మాట. ఇది వారి యౌదార్యమునకు గుర్తు. నాకు దివ్య చక్షువు లేదు. మానవమాత్రుఁడను. చర్మ చక్షువు మాత్రమే నాకున్నది.

మూర్తిగారు నా వ్యాసమునందలి దోషములను-దా మూహిం చినవని-మాత్రమే చూపిరి గాని గుణములనుగూర్చి యొక్క మాట చెప్పుటకు వారికి నోరాడలేదు. వారు గుణగ్రాహిత్వము, నిష్పక్షపాతము, రాగద్వేష రాహిత్యము మున్నగు మాటలను చిలుక పలుకులవలె వల్లించువారేకాని వానిని దమ రచనావ్యాసంగమున నందుఁ జూపువారుగారు. నా వ్యాసమంతయుఁ దప్పుల తడిక యనఁగా, వారు మచ్చునకు నొక కొన్నిటిని జూపి, మిగిలిన దోషము లుపేక్షామాత్ర దండ్యములనికిదయుదలఁచి తమ హృదయ వైశాల్య మును జాటిరేమో తెలియదు. నా వ్యాసములో గ్రహింపఁదగిన సత్య ములు లేవని వే ననుకొనను. దానిని జదివిన సహృదయు లెవ్వరు ననుకొనరు.

రాధాకృష్ణమూర్తిగారికి నా వ్యాసతత్త్వమేకాదు బాల వ్యాకరణ రహస్యమును బట్టునడలేదు. వారు నేల విడిచి సాము చేసిరి. సూరి వ్యాకరణ రచనా వ్యాసంగ మొక తపస్సు అది చిర కాలము సాగినటిది. తత్ఫలము బాలవ్యాకరణము. తద్రచనమునకు ముందు సూరి నాలుగు వ్యాకరణములు రచించెను. అవి యాయనకు సంతృప్తి నొసఁగలేదు. వ్యాకరణ తత్త్వము నాకళించికొన్న సూరి రచనా వ్యాసంగమునఁ జరమ సృష్టి, బాలవ్యాకరణము. దానిని గూర్చి యాయనయే "దిఙ్మాత్రదర్శనముగ" 'మును మదుపజ్ఞం బగుచున్' 'తెనుగునకు శబలక్షణ' మను పద్యముఁ లోఁ జెప్పెను.

సూరియే బాలవ్యాకరణ పీఠికతో "........కాఁబట్టి యిట్టి కొలఁది వారింపఁబూని పెక్కు లక్ష్యములు పలుమాఱు సావధానముగాఁ బరిశీలించి, రచనా ప్రణాళిక నిర్ణయించుకొని, నా నేర్పుకొలఁదిని సంస్కృత భాషలో సూత్రగ్రంథమొకటి కావించితిని. ఆ గ్రంథము బాలురకు సుసాధము గాకుండుట వలన దానియందలి సూత్రములు కొన్ని తెనిఁగించి ప్రకృత గ్రంథరూపముగాఁ రచించినాఁడ"నని వక్కాణించెను.

బాలవ్యాకరణ పాఠ ప్రవచనమునకు జీవనమెల్ల జన్నె కట్టిన పెద్దలు సైతము "......నాలుగేండ్లు మరలఁ బరిశ్రమించి, పూర్వ రచనములలోఁ దాను సేకరించి యుంచిన విషయము లన్నింటిలో ముఖ్యములు, అవశ్యజ్ఞాతవ్యములు, నిష్కృష్టములు, నిరంతరావశ్య కములునగు ప్రధాన విషయము లెన్నుకొని, సూత్రరూపమును క్రమవిన్యాసమును మార్చి లక్ష్యములు కూర్చి సర్వాంగసుందరమయిన బాలవ్యాకరణమును" నిర్మించెననియు, "తన మొదటి వ్యాకరణము లందలి విషయములు పెక్కింటిని విడిచిపుచ్చియు, గొన్నిటిని మార్చు కొనియు, సార్వత్రికములయి సకల సమ్మతములగు లక్షణములు మాత్రమే గైకొని, సంగ్రహరూపమున బాలవ్యాకరణమును రచించి నాఁడు. ఇది మనయూహకాదు. ఈ యంశము లన్నిటిని "మును మదుపజ్ఞం బగుచున్" ఇత్యాది గ్రంథాంత పద్యములందు నాతఁడే స్పష్టముగా సూచించియున్నాఁడు..." అనియు నిగ్గు తేల్చిరి.

ఈ విషయములు నా వ్యాసమునఁ గలవు. మూర్తిగారు వానిని గూర్చి యాలోచింపరైరి. ఆచార్యులువారు చెప్పిన కొన్ని లక్ష ణములు సూరి యెఱిఁగినవేయని తన్నిఘంటు వ్యాకరణములను ప్రమాణముగాఁ జూపి నిరూపించుటయే నా వ్యాస ప్రయోజనమని గ్రహింపక, బాలవ్యాకరణ రచనా ప్రణాళిక పరిశీలింపక మూర్తిగారు "మీ రాచార్యులవారిని ద్వేషించుచున్నారు. సూరిపట్ల మీకు దురభి మానము మెండు. ఆచార్యులవారు చెప్పినవి యెఱిఁగిన సూరి వానిని బాలవ్యాకరణమునఁ జేర్పలేదేమి? సూరి సూత్రముల కవవాదములు లేవా?" యను వితండవాదమునకు దిగిరి నేను సూరికోపు పేసి కొంటినను తలంపే మొదలు వారికిఁ గలిగెను. అది నా వ్యాసము నందలి విషయములు సబల ప్రమాణము లగునా? కావా? యని గమ నింపనేలేదు. ఇఁక నక్కడినుండి విమర్శకునకు ననుచిత త కావలయు నన్నవారే "యాచార్యులవారిని సమర్థింపు మెట్లు? సూరి దోష ములు చూపు మెట్లు?'యని యారాటపడిరి. ఆ యారాటము వారు రచయితలకు నావశ్యకమని యన్న "గుణగ్రాహిత్వము'లేమిని వెల్లడించెను.

తద్భవములలో నలఘురేఫము కలదని యాచార్యులవారు చెప్పినమాట సూరికిఁ దెలియునని నిరూపించుట నా లక్ష్యము దానికి సాక్ష్యముగా సూరి నిఘంటు వాక్యమును దార్కాణించితిని. "కాఱియ', శబ్దము కడ నాయన వ్రాసిన వాక్యమది. తద్భవములలో నలఘు రేఫము లేదని బాలవ్యాకరణమునఁ బ్రవచించిన సూరి నిఘంటు రచనా కాలమునాఁటికిఁ దన యభిప్రాయమును మార్చుకొనెనని యంటిని. అహోబల పండితుఁడును దద్భవములలో నలఘురేఫ మున్నదని యంగీకరించె ననియుఁ దద్వాక్యముల నెత్తి చూపితిని.

తద్భవములలో నలఘురేఫమున్నదని యంగీకరించిన సూరి యా మాట సూత్రబద్ధము చేయుదేమి? యని మూర్తిగారి సవాలు. చిన్నట్టున వంతరాం రామకృష్ణారావుగారు ".....కావున తద్భవము లలో శకటరేఫ మరుదు గావునఁ దద్భవములలో శకటరేఫము లేదను లాక్షణిక మతము నిట (బాలవ్యాకరణములో సూరి) సూచించెనని గ్రహింపనగు"నని చెప్పిన మాటలు మూర్తిగారి సవాలునకు సమా ధానము లగును.

అహోబల పండితుఁడు చెప్పినంత మాత్రమున నంగీకరింప వలయునా? యని మూర్తి గుండె దిటవుతోఁ బ్రశ్నించిరి. ఈ ప్రకరణమున నహోబలల పండితుని మాటకు, సూరి వాక్యములకు లేని విలువ తమ పలుకులకుఁ గలదని మూర్తిగారనుకొనుట యప్రాప్త మగు నధికారమున క్రలు చాఁచుటయే. ఆచార్యులుగారు చెప్పినమాట సూరికిఁ దెలియునని నిరూపించుట నా లక్ష్యము. దానికి నా సాక్ష్యము చూపితిని. నా లక్ష్యమున కీ పని చాలును కవి ప్రయోగములు చూప వలసినచోటు గాదిది. అహోబల పండితుఁడుగాని, నేనుగాని కవి ప్రయోగములు చూపలేదని మూర్తిగారొక యభియోగము తెచ్చిరి. అహోబల పండితునిమాట యయథార్థమని వారనుకొన్నచో ఆ యభినవ నన్నయభట్టారకులు తద్భవము లన్నవి తద్భవములు గావనియు, వానిలో శకటరేఫము లేదనియు వైయాకరణ శిరోమణి యగు మూర్తిగారే ఋజువు చేయవలయును. ఆ పని వారు చేయరైరి. చేసినచో వారు చిన్నయసూరిని గూడ మించిపోయెడివారు. చేయఁదగిన పనిని చేయక యసందర్భముగా కవిప్రయోగములు కావలయు ననిరి.

పోనిండు మూర్తిగారి కోర్కెనేల నిరాకరింప వలయును? వారు ప్రయోగాభిలాషులు గాన యివిగో! ప్రయోగము లిచ్చుచున్నాను.

1. తేఱకొనఁజూచి నగియు నీకెఱుఁ డధముఁ డగుట......

(భారతము. శాంతి. ఆ3. పద్య 489)

2. అఱువది లక్షలు రావణు
నఱుబాహు బలంబు వీరు; లొంగి నాఁకమునన్
గఱకెక్కినారు; వారం
దఱు మూలబలంబు దొరలు ధరణీనాథా!

(భాస్కర. రామా; యుద్ధకాం; పద్య 434)

3 కఱకులై పెరిగిన కుఱువెండ్రుక కలతోడ
బట యొఁదలఁ గావిసాగ యమర

చిన్నయసూరి సంధి. 28వ సూత్రమునకు "కఱకుటమ్ము" అను లక్ష్యమును జూపెను. ఆ సూత్రమును మఱియొకచోట నెత్తి చూపిన మూర్తిగారు దానిక్రిందనున్న మూఁడు లక్ష్యములలో "నిగ్గుటద్దము" 'పంచపుటలుక' యను రెండిటిని జూపి "కఱకుటమ్ము"ను వదలిరి. దానికొక కారణము కలదు. అహోబల పండితుఁడు "కఱకు" తద్భవమనియు, నందు శకటరేఫము కలదనియు ననెను. అహోబల పండితుఁడు కవి ప్రయోగములు చూపలేదని మూర్తిగా రనుచున్నారు. సూరి చూపిన "కఱకుటమ్ము" నుదాహరించినచోఁ దాము అహోబల పండితునిపయి తెచ్చిన యభియోగమునకు వ్యతిరేక సాక్ష్యమగును. చూచితిరా మూర్తిగారి తంత్ర పాటవము!

4 వెఱఁగంది శౌరి యిట్లనుఁ
దెఱవా! మీ తండ్రి నిటు దెగి చంపిన యా
మొఱకు శతధన్వుఁ డిప్పుడు
పఱకెన మోమోట లేక నా చక్రమునన్

(విష్ణు. పురా, ఆ 6, పద్య 283)

5 మొఱకు వెండుకలును ముసురు మీసములుఁ
గఱకు నల్లని మేను గల చోరు నొకని

(ద్విపద హరిశ్చం ద. ఉత్తర భాగ. 2269)

6 సాటిరఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజు తోడ నీ
కాటి మద్భలంబునకుఁ గాఁదగునే? వివిధాస్త్ర సంపదల్

(భారతము. కర్ణ. ఆ3. పద్య 10)

కోట పేటలనుగూర్చి నేను వ్రాసినది మూర్తిగారికి నంతు పట్టలేదు, కోటపేటలు వైకృతములని సీతారామాచార్యులవారు చెప్పిరి. కోట వైకృతమని సూరి యంగీకరించె ననుటకుఁ దన్నిఘంటు ప్రమాణమును జూపితిని.

పాపకోటవారికి సూరిపేట తెలియలేదు. నిర్బిందుకమయిన పేట దేశ్యమనియే సూరి యభిప్రాయము. కానిచో నాయన దేశ్యమును నిరూపించు లక్షణముకడ దాని నుదాహరించెడివాఁడు గాఁడు. సూరి దేశ్యముగా సంభావించిన నిర్బిందుకమగు పేట శబ్దము సబిందుకమని భ్రాంతిపడి, తిలింగ లక్షణశేషకర్త దానిని వైకృతముగా నిరూపించెను. నేను జెప్పనెంచిన దింతే నా మాటల కుపష్టముగా పజ్జలవారి వారి వాక్యములను గూడ నుదాహరించితిని. దీనిలో వర్జ్యము గాని దేమున్నది?

సూరి సబిందుకమగు పేట శబ్దమును దేశ్యముగా నిరూపించి నచో సీతారామాచార్యులవారి వివరణము సమంజసముగా నుండెడిదే. సూరి యుదాహరింప దాని నుదాహరించినట్లు వ్రాయూహించిరి.

రెందుకనగు పేట శబ్దమును గూర్చి సూరి యభిప్రాయమేమో ఎవరి కెఱుక? ఆయన చూపని దానినిగూర్చి యాయన యభిప్రాయ మేమి? యను ప్రశ్నమున కిట తావే లేదు. ఆచార్యులవారు పొంపడి తనునదే ప్రకృతాంశము.

"అనంతములగు సమహత్తుల కందు వర్ణకము పరంబగు పుడు నగాగమము కొన్నియెడలఁ గానంబడియెడి" అను లక్షణము సూరికిఁ దెలియునని నేను నిరూపింపఁగా నది బాలవ్యాకరణమున లేదేమి? యని మూర్తిగారు ప్రశ్నించిరి. బాలవ్యాకరణమున లేకపోవుటకుఁ దద్దచనా ప్రణాళికయే హేతువు. సూరికిఁ దెలియునని నిరూపించుట నా లక్ష్యము. దానికి బాలవ్యాకరణ సూత్రవచనా విధానము నుదాహరణముగాఁ జూపితిని.

కౌరవ సభలో లజ్జా
వారధిఁ దగ నుద్ధరింపవా ద్రౌపది? న
వ్వారీతి నుద్ధరింపుము
నీరజదళనేత్ర! కలుష నీరధివలనన్

ఇది చిన్నయసూరి తన నిఘంటువులో నుదాహరించిన పద్యము వావిళ్ల ప్రతిలో "లజ్జావారిధి దిగ నుద్ధరింపవా" యను పాఠమున్న దనియు, నది ప్రకరణోచితము గాదనియు నే నంటిని. ఇట నుట నా తొందరపాటని మూర్తిగారు తమ తొందరపాటును వెల్లడించిరి. "దిగ" నని యుండుట సమంజసమఁట! "దిగు" ధాతువునకు నవతరణార్థమునుగాక "పడు" అను నర్థమును జెప్పుకొనవలయు నఁట! మూర్తిగారు "దిగు" ధాతువునకు "పడు" అను నర్థమున్న దనుటకు నిఘంటు ప్రమాణమును జూపిరా? కవి ప్రయోగములు నుదాహరించిరా? వారేమియుఁజేయరైరి కవి ప్రయోగములు చూపవలసిన దిటి తావులలోనే. వానిని జూపనిచో "నేను జెప్పితిని. నీవు వినవలె" నన్నట్లుండును. ఇప్పటున వారు తగని చర్చకు దిడి పొరపడిరి.

జైమిని భారతము మా పార్శ్వగ్రంథము. పై పద్యమే సందర్భము నందలిదో నాకుఁ దెలియును. ప్రకరణము పట్టి చూపుటకు వారు శ్రమ పడుట వ్యర్థము. సందర్భము లెస్సగా విచారించినఁ బయి పద్యమున "దిగ" ననియుండరాదు ఉన్నచో ద్రౌపది లజ్జా వారిధిలో దిగిన దను దురర్థము దోఁచును. ఆమె కౌరవ సభలో లజ్జావారిధియందుఁ దనంత తాను దిగలేదు. ప్రకరణమునుబట్టి యట "తగ" ననియే యుండవలయును. ఇవి ధర్మనందనుని పలుకులు. ఆతఁడు "మానము దక్కునట్లు ద్రౌపదిని లజ్జావారిధి వలన రక్షించినట్లే నన్నును కలుషనీరధి వలన రక్షింపు" మని యనుటయే సమంజసము. ద్రౌపదీ ధర్మనందన రక్షణములు తుల్యములు. తుల్యములని నిరూపించుటకే రెండుచోట్ల సముద్రార్థక శబ్దములను, ఏకవిధ విభక్తిని శాబ్దిక శిల్పవేత్తయగు పినవీరభద్రుఁడుపయోగించెను. కాన వారిధివలన నని యుండుటయే యుత్తమము.

"తగ" యను పదమును వివిధార్థములందు తిక్కన కొన్ని వందలసారులు భారతమునఁ బ్రయోగించెను. ఆ కవి బ్రహ్మ ప్రయోగము లోక కొన్ని చూడుఁడు.

వైదికమార్గ నిష్ఠమగు వర్తనమున్ దగ నిర్వహించుచున్
(విరాట. ఆ 1. పద్య 15)

అగు: నది యట్టిద; దైవము
తగ నిచ్చిన యవ్వరంబు దప్పునె; మనకున్
(విరాట. ఆ1. పద్య 63)

కీడు రాకుండఁ దగఁ బరికింపవలయు
(విరాట. ఆ4. పద్య 229)

కాన సహించి పాండవులఁ గౌరవులం దగఁ గూర్పు నేర్పునన్
(ఉద్యోగ. ఆ3. పద్య 75)

ప్రియ మెసఁగం దగం బిలిచి పెట్టెడు కూడది లెస్స కూడు... ...
(ఉద్యోగ. ఆ3. పద్య 222)

తగ మనస్సైన్యమున్ గురుఁ డుదగ్రగతిన్ నడిపింప......
(ద్రోణ. ఆ1. పద్య 132)

కర్మఫలంబు నర్పితముగాఁ దగ నీశ్వరునందుఁజేతఁ... ...
(శాంతి. ఆ1 పద్య 149)

తగ దీనులఁ బ్రోచినతఁడు దలిశాబ ముఖీ!
(అనుశాస. ఆ5. పద్య 96)

చనుఁగాక యతండు చనిన నద లిక తగన్
(అశ్వమేధ ఆ4 పద్య 78)

తిక్కన యీ ప్రయోగములలోఁ గొన్నిటియందు 'తగ' నే యర్థ

ము వాడెనో యాయర్థమువనే పినసీరభ దుండును దానిని వాడెను కావ చిప్పయమూరి పాఠమే సమంజసము మూర్తిగారు వావిళ్ల పాఠమును వలచి వ్రాసిన వ్రాత లప్రమాణికములు.

"అనేక కర్తృక క్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబు లగు" నని సీతారామాచార్యులవారు చెప్పిన సూత్రము వివరణను గోరుచున్నదని నేనంటిని. నా మాట కుపబలముగా "భూవరుండు మహోజ్జ్వలంబుగ బరివారము చిత్తములందు మెత్తురే!" యను తిక్కన ప్రయోగము నెత్తి చూపితిని. నేనిట్లు వ్రాయుట యాచార్యుల వారిని నిందించుటయని మూర్తిగా రనుచితముగాం దలంచిరి. నా రాచార్యులవారిని సమర్థించుటకు దిగి పడినతంటా లప్రియమని గావు. అవి యప్రియము వారి వ్యాకరణ శాస్త్ర పఠనము పునాది లేనిదని రుజువుచేయుచున్నవి. "ఆచార్యులుగారు చెప్పినది నిత్యవిధిగాదు. "అగు" నని సూత్రమున నున్నంత మాత్రమున నది నిత్యవిధి యని భావింపరాదు" — ఇవి వారు చేసిన వ్యాకరణశాస్త్ర రహస్యోపదేశములు! మూర్తిగారు సీతారామాచార్యులవారి సూత్రమునకు సంప్రదాయ విరుద్ధముగా దుర్వ్యాఖ్యానము చేసిరి. నిత్యవిధి గాదని తాము భావించినచో సీతారామాచార్యులవారు సూత్రమున పరిభాషా వైకల్పిక బహుళపదములలో నేయొకటియైన వాడియుండెడివారే. నా రావిధముగా వ్రాసిన సూత్రములు కలవు. నిత్యవిధి యని భావించుటచేతనే వారు సూత్రము నావిధముగా వ్రాసిరి. 'అగు" నని యన్నపుడు నిత్యవిధి గానిచో ద్విలింగలక్షణ శేషమును దిరిగి వ్రాయవలసియుండును. అప్పుడు సీతారామాచార్యులవారు వ్యాకరణరచనా సంప్రదాయ మెఱుంగని వారై యప్రతిష్ఠ పాలగుదురు. మూర్తిగా రాచార్యులవారిని తమ పాండిత్యమునకు బలిచేయుచున్నారు. ఆచార్యులవారిని దక్కువ పఱచుచున్నది నేనా? మూర్తిగారా? విజ్ఞులు వివరింతురు గాక!

"సంస్కృతమున పాణిని సూత్రములకు వార్త్తికములు వెలసినవి—వానికి మహాభాష్య మవతరించిన" దని తమ సంస్కృత వ్యాకరణ శాస్త్రపాండిత్యము ప్రదర్శించిన మూర్తిగారు పాణినీయులు వ్యాకరణ సూత్రములను సంజ్ఞా పరిభాషా-విధి-నియమ-అతిదేశ-అధికారము లని యాఱు తెగలుగా విభజించి రన్నమాట మఱచిరి. ఆచార్యుల వారి సూత్రమీ షడ్విధ సూత్రములలో నేదియుం గాదా?

"అగు" నన్నపుడు నిత్యవిధిగా భావింపరాదని మూర్తిగారి రాద్ధాంతము. నేనాచార్యులవారి దోషములను దూర్పారబట్టుటకు దొరకొంటినని దలంచి భ్రాంతిపడిన మూర్తిగారు పోటీకి సూరిగారి దోషములు చూపదలంచి తమ వాదమున కనుకూలముగా బాల వ్యాకరణమునందలి "కర్మధారయంబులందు తత్సమ కచ్చు పరంబగునపుడు టుగాగమంబగు" నను సూత్రమున సామాన్యతరముగా నుదాహరించిరి. సుప్రసిద్ధ ప్రకాశికాకర్త చూపిన "దుక్కిటెద్దు" "పట్టూరు" "ప్రక్కటెముక" లత్సూత్ర విరుద్ధములుగానున్న వని యుగ్గడించిరి. నేనాచార్యులగారి సూత్రము వివరణను గోరుచుండనంగా వారు సూరి సూత్రమును వివరింపవలెననిరి. సందర్భ వేఱనుమాట మాత్రము మఱచిరి. ఆచార్యులవారి సూత్రమున విరుద్ధముగానున్న యొక మహాకవి ప్రయోగమును నేను జూపితి. సూరి సూత్రమునకు విరుద్ధముగా కర్మధారయములలో నుత్తున కచ్చుపరంబగునపుడును టుగాగమముకాని యొక మహాకవి ప్రయోగమును మూర్తిగారు నుదాహరింపవలయును. వా రాపని చేయలేదు. అది చేసినపుడే వారు సూరి సూత్రము నుదాహరింప నర్హులగుదురు.

మూర్తిగా రుదాహరించిన సూరి సూత్రము నిత్యవిధియే కాని కర్మధారయ సమాసములో నుత్తున కచ్చు పరమగునపుడు టుగాగమము వైకల్పికముగా నగు లక్ష్యము లోకమున కొన్ని గుర్తించి సూరి పయిసూత్రమునకు దరువాతనే "కర్మధారయంబునందు బేర్వాది శబ్దముల కచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగు' నను సూత్రమును రచించెను. పేను శబ్ద ముదంతము. కర్మధారయ సమాసమున దాని కచ్చుపరమగు నను టుగాగమము కాదు. దాని తుది నాల్గవకు ద్విత్వము ప్రయోగములోం గనంబడుచున్నది. ఈ విషయమును సూరి గుర్తించెను. కావుననే సూత్రాంధ్ర వ్యాకరణములో "పెన్నురవి" అని "పెను" శబ్దమునకు నాదేశముగా "పెన్ను" విధించెను. ఆచార్యుల వారేమో "పెను" శబ్దనకారమునకు ద్విత్వము విధించెను. (చూడు. త్రిలింగ. శేష; సంధిపరి. సూత్ర 9)

సూరి పట్టెటూరి నెఱుంగనివాఁడు గాఁడు దుక్కిటెద్దును జూడనివాఁడు గాఁడు. ప్రక్కటెముకను గుర్తింపనివాఁడుగాఁడు. బాల వ్యాకరణ రచనా పద్ధతిలో వానికిం దావులేదు, "దిక్కుదర్శనముగ" మున్నగు సూరి పద్యములు, ప్రాజ్ఞుల పలుకులు తెలియని మూర్తిగారు సూరిని ముదాయింజేసిరి.

నా వ్యాస లక్ష్యమును బండిత ప్రకాండులగు మూర్తిగారు గ్రహింపరైరి. గ్రహింపలేనివారు గ్రహింపని యటుండక నేను సూరిని బొగడి, సీతారామాచార్యులవారిని దెగడితినని యూహించిరి. ఆయూహ యనాలోచనమునకు దారితీసెను. అది యనుచితములగు నధిక ప్రసంగములకు, వ్రాతలకుఁ గారణమయ్యెను. అవి వన్నెకాక సూరినిగూడ జెనకెను.

# ప్రథమాంధ్ర శతకము

## శ్రీ వి. సత్యనారాయణ

ఆంధ్ర వాఙ్మయమున శతకములు ప్రత్యేక ప్రక్రియగా వెలసి యున్నవి. ఇందు ఆత్మాశ్రయ కవితా లక్షణము ఉండుటచే భావకవులకు నొజ్జబంతియై యున్నది. శతక రచన కొన్ని ప్రత్యేక నియమములను కలిగి కావ్య నాటకాది రచనలనుండి వేరగుచున్నది. శతకములను ప్రాచీన లాక్షణికులు కొందఱు క్షుద్ర ప్రబంధముల కోవలోనికిని, మరి కొందఱు చాటు ప్రబంధముల యందును జేర్చిరి. శైలీపాటవమునందు శతకములు కావ్యములతో దులతూగ లేకపోయినను, వీనియందును భావోన్నతమైన గొప్ప రచనాశక్తి యున్నదని[1] విమర్శకులు భావించి యున్నారు.

ఆంధ్రలోకమున శతకములు కోకొల్లలు; దశశతాధికమై యుండును. వేదాంత శతకములు, ఉత్సాహవృత్త శతకములు పద్య లక్షణములను గొన్నిపేర్ల పెరిగినట్లు కనబడుచున్నది ఇందువలన మనకున్న శతకములకంటె బోయినవే యధికముగా కన్పట్టుచున్నవి. తాళపత్ర గ్రంథములలో ప్రతిదినము ప్రాత శతకములు నూతనముగా గనబడుచునే యున్నవి పరిషత్తు, ప్రాచ్యలిఖిత పుస్తకాగారము, అడయారు పుస్తకాలయములలో రమారమి 300 వ్రాత శతకము లున్నవి. నాకడ నచ్చుపడినవి 300కు పైగా నున్నవి నాకు దొరకని వెన్నియున్నవో! మనకీ వఱకు 600 శతకములకంటె నధికముగా గనబడుచున్నవి."[2] అని యొకచోటను, "ఆంధ్రభాషలో రమారమి 600 శతకములు కనబడినవి"[3] అని మరియొకచోటను శతక కవుల చరిత్ర యందగపడుచున్నది. కావున శతకములు ఆంధ్రవాఙ్మయమున ప్రత్యేక శాఖగా వెలయుటయేగాక పరిమితి యందును బహుసంఖ్యాకమై యొప్పుచున్నవి.

ఎన్నియో శతకములు నష్టమైనవియును, అజ్ఞాతములైనవియును గలవు. కవిత్వ ధోరణిగల కవులు ప్రబంధాదిగ్రంథ నిర్మాణములకు పూర్వమున శతకములను రచియించుట సామాన్యము. నన్నయ తిక్కన పోతనాది మహాకవులును శతకములను రచించినట్లు ప్రతీతి గలదు.[4]

శతక లక్షణము లన్నియు గలవని మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారమును వదలివేసినచో యథావాక్కుల అన్నమయ్యగారి సర్వేశ్వర శతకము మొదటిదని కొందఱును, పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకము.

ఆంధ్ర వాఙ్మయమున నన్నెచోడ కవిరాజశిఖామణి రచిత కుమార సంభవమును గూర్చి తెలియని సాహిత్య రసికుడు లేడన వచ్చును. కావున దానిని గూర్చి వివరించుట చర్విత చర్వణమే యగును. ఇతడు నన్నయ తిక్కనల నడిమికాలమువాడని అధిక సంఖ్యాకులచే నిర్ణయింపబడినది. కవి కాలనిర్ణయము యీ వ్యాసోద్దేశము కాదు గాన యిందును ఆ నిర్ణయమే అనుసరింపబడినది.

నన్నెచోడుడు కుమార సంభవమునందు 'దారిద్ర్య విద్రావణ' యను మకుటముతో నొక దశకమును రచించియున్నాడు; ఇదియే ప్రస్తుత వ్యాసము యొక్క చర్చనీయాంశము.

కీ. శే. మానవల్లి రామకృష్ణకవి కుమార సంభవ ద్వితీయ సంపుట లఘుటీకయందు దారిద్ర్య విద్రావణ దశకమును గూర్చి యిట్లు వ్రాసిరి. "ఈ పద్యదశకము కవి బాల్యమునందో యెప్పుడో తెనిగించియుండి తరువాత దీనిలో చేర్చుకొన్నట్లు తోచుచున్నవి.'[5]

నన్నెచోడుని కాలచర్చ యనెడి గాలిదుమారం రేగుటకు కవిగారు ఆద్యులైనట్లే దీనికి నీ వారే ఆద్యులైనారు.

కవిగారి యీ పంక్తులను గూర్చి 'నన్నెచోడుని కవిత్వము'[6] నందు రెండుచోట్ల యిట్లు పరామర్శింపబడినది—

1. "కవిగారి భావమే నిజమైనచో విని సది మాత్రమేకాక మటికొంత యుండవలయును."

2. "ఇంకొక్క విషయము ఈ దారిద్ర్య విద్రావణ దశక మును జదివినచో నిక్కడ స్తుతించు వాడింద్రుడే [7] యయినను వాతఁడే వీనిని బలికినట్లు కాక ఇంద్రముఖమున కవియే శివుని స్తుతించుచున్నట్లు కాననగును: కవి యిటు తానే తన భావములను వెలువఱచు కవిత యాత్మాశ్రయ కవిత యగునుగదా! (Subjective Poetry) ఈ పద్య దశకము ఆత్మాశ్రయ కవితా శాఖకుఁ జెందిన దానివలె నున్నది. లేనిచో 'నిన్నెదం దలఁపంగాంచి సురేంద్రుఁడై వెలయఁడే' (10–91) యని యింద్రుడే శివునితో ననునా? అటే, చివరి పద్యమున నీస్తవముఁ బఠించిన వారి కశేష సుఖము లొసంగు మని శివుని వేడినట్లు గలదు (10 99) దీనినిబటి శ్రీ కవిగారి యూహయే సమంజసమేమో?"

నన్నెచోడుఁడు బద్యదశకముకన్నా నధికమే రచించినటు కవిగారి భావమై యున్నటుగా పై మాటలవల దెలియుచున్నది. మానవల్లి వారు "ఈ పద్యదశకము" అని మాత్రమే నుడివిరి. వారి ఊహాపథమునందు నన్నెచోడుని శతకము పొడమినదో లేదో? ఇక 'తెనిగించుట' యెట్టిదో కవిగారు స్పష్టీ కరించలేదు. దేనినుండి తెనిగించుట? సంస్కృతమునుండియా? కన్నడమునుండియా? 'బాల్యమునంద'నుటచే యిది సంస్కృత కుమార సంభవమునుండి తెనిగించుట యని యనుకొన నవసరములేదు. కావున యీ తెనిగించుట సందిగ్ధ విషయమే. [8]

దారిద్ర్య విద్రావణ దశకమునందు శతక లక్షణము లున్న ట్లును అందుచేత శతక వాఙ్మయ ప్రారంభము నన్నెచోడునితోనే యని 'నన్నెచోడుని కవిత్వము' [9] నందు నిర్ణయింపబడినది. ఇట్లు చూచిన శతక వాఙ్మయ లక్షణములు కొన్ని ఆదిపర్వము నందలి ఉదంకుని నాగస్తుతి [10] యందును యగుపించుచున్నవి. అట్టిచో శతక వాఙ్మయ ప్రారంభము నన్నయతోనే యని యందుమా? అయి నను నన్నెచోడుడు శతకమును రచించినటు యీ గ్రంథమునందు పేర్కొనబడలేదు.

శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు నన్నెచోడకవి కాల నిర్ణయమును యతని గూఢవస్తుమయ కావ్యమునుండి గణిత రూపక చరిత్రాదుల నాధారముగా నిర్ణయించిరి. 'అన్యతారక నితతుల వాద రించి', 'జయచైత్ర సంపదన్' 'దశశతకరములు' మొదలగు వాని యాధారముగా వారు కాలనిర్ణయము గావించినారు. అందు కొనింటి జ్యోతిష శాస్త్ర మర్యాద ననుసరించి గణించిరి మిగిలిన వానిని కేవల సంఖ్యామాత్రములుగానే గ్రహించిరి.

ఉదా:–'దశశతకరములు' – 'దశశత మనగా :
'దశోత్తర శత'మని శేషం ౧౧౦
'దశశత మని సహజము ౧౦౦౦
౧౧౧౦

"ఏ క్రమ శకము 'దశ + శత + దశశత (౧౧౧౦) వరంబులు ప్రశస్త శాసన లిఖితాక్షరంబులయ్యె నని 'వి(స్ఫు రత్) జయ చైత్ర సంపద' చెప్పక చెప్పుచున్నది.""

ఇటు నన్నెచోడుడు కుమారసంభవమునందు గణిత సంఖ్యల నాధారముగా అచట నచట నేదోయొక విషయమును స్ఫురింపజేయు నట్లుల రచించినట్లుగపడుచున్నది,

ఇట్లే నన్నెచోడుడు దారిద్ర్య విద్రావణ శతకమును రచించె ననుటను తన గూఢవస్తుమయ కావ్యమున గూర్చెనేమో బరి శీలింతము.

నన్నెచోడుడు 'శతకము'ను రచించెనని నాకగపించుటకు నాధారమైన విషయము లివి :

1. నన్నెచోడుడు దారిద్ర్య విద్రావణ దశకమును పూర్తి శతకలక్షణములతో రచించుట.

2. "కవిత్వ ధోరణిగల కవులు ప్రబంధాది కృతి నిర్మాణము లకు పూర్వమునను శతకములు రచియించుట సామాన్య" మని కాశీ నాథుని నాగేశ్వరరావు పంతులుగారు వచించుట. [12]

3. 'తెలుగున శతక వాఙ్మయ ప్రారంభము నన్నెచోడుని లోనే' యని శ్రీ అమరేశం రాజేశ్వర శర్మగారు నుడువుట. [13]

4. 'ఈ పద్యదశకము కవి బాల్యమునసో యెప్పుడో తెనిగించి యుండి తరువాత దీనిలో నెక్కించు కొన్నట్లు తోచుచున్నది." యని కీ. శే. మానవల్లి రామకృష్ణకవిగారు పలుకుట [14] దీనికి కొంత వివరణ యవసరము. తిక్కనాదులు కొందఱు తమ ఒక కావ్యము నందలి బద్యముల నింకొక కావ్యములోనికి సందర్భానుసారముగా

మకొనుట కనిపించును[15] కావున నన్నెచోడుడును తన శతక చనం డి మేలియైన వానిని దశవృత్తములనేర యందు చేర్చుకొని నాడని యూహించినాను.

5. నన్నెచోడుడు తన గూఢ వస్తుమయ కావ్యమునందు సంఖ్యకుం బ్రాముఖ్యత నిచ్చుట. శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి గారు చూపినవిగాక యెన్నింటినైనను జూపవచ్చును. (అ) ఏకాదశ రుద్రులను వ్యంగ్యము చేయుటకై కావ్యాదిని 11 పద్యములను రచించుట. (ఆ) శిల్ప శాస్త్రమందలి స్త్రీ లక్షణములను వ్యంగ్యము చేయుటకు పార్వతి యౌవన వర్ణన సందర్భమున 32 పద్యములను రచించుట. (ఇ) ద్వాదశాదిత్యులను సూర్యవర్ణనయందు 12 పద్యములు రచించుటచే సూచించుట[16] (ఈ) స్త్రీల విషయమై పురుషులు 8 విధములుగ ప్రవర్తింతురని చెప్పుటలో పార్వతి యష్టమూర్తి యగు శివుని కొఱకు తపస్సు చేయుటను సూచించుట[17] (ఉ) శివుని అష్టమూర్తిత్వమును కవిస్తుతి యందు 8 పద్యములు రచించుటతో సూచించుట.[18] (ఊ) షష్ఠ్యంతము లెనిమిది. శివుని అష్టమూర్తిత్వ సూచన[19]

కుమార సంభవ కావ్యమున శివుని స్తుతించు సందర్భములెన్ని యేనియు గలవు. కాని దారిద్ర్యవిద్రావణ దశకమును నిపుణముగ దశమాశ్వాసమునందే నన్నెచోడుడు తన గూఢ వస్తుమయ కావ్య సూచ్యార్థముగా చేర్చి యున్నాడు. దశమా శ్వాసము; (×) దశ వృత్తములు (10×10 = 100)–ఇది శత సంఖ్యను సూచించు చున్నది.

సామాన్యముగా శతక నామములు మకుటముతోడనే ప్రవర్తితము. ఈ దశకమునందు దారిద్ర్య విద్రావణ మకుటమున్నది. కావున నిది తొలుత శతకమై యుండనోపు.

శత సంఖ్యను మరియొక విధముగానూ వ్యంగ్యముగా సూచించి యున్నాడు. చూడుడు: దారిద్ర్య విద్రావణ దశకము గ్రంథమునందు 90వ పద్యముతో మొదలై 99వ పద్యముతో ముగియు చున్నది. ఈ సంఖ్యలను జాగ్రత్తగా గమనింపవలెను. ఈ పద్యములను మరి యెచట వ్రాసినను దాను సూచింప దలచుకొన్న వ్యంగ్య శతకము స్ఫురించకుండా పోవును. పై రెండు సంఖ్యలను కలిపిన 189 సంఖ్య యగును. దీనియందు దారిద్ర్య విద్రావణ స్తోత్రారంభమునకు ముందటి పద్య సంఖ్య తీసివేయుడు (189–89 = 100). ఇదియు శత(క) సంఖ్యయే యగుచున్నది.

ఇది గాక ఇంకొక విధముగా గూడ శత(క) సంఖ్యను కవి సూచించియున్నాడు. దశకప్రాసంతర వచనము శత(క) సంఖ్య గలది. చివరి పద్యమునే 100వ పద్యముగా రచింపగూడదా యనిన 99వ పద్యమున ఫలశ్రుతి చెప్పబడినది. అది యీ వచనమునందు ఫలించినది. కావున వచనమునే 100వ దానినిగా రచించినాడు. అట్లుకానిచో పైన చెప్పిన శత(క) సంఖ్య యొక్క వ్యంగ్య స్ఫూర్తి గోచరింప కుండెడిది. కావున నన్నెచోడుడు కుమార సంభవమునకు ముందొక శతకమును రచించి యుండవలెను. బహుశ అది దారిద్ర్య విద్రావణ శతకమై యుండును.

ఇట్లు నన్నెచోడుడు తన కుమార సంభవమునందు తన పూర్వ రచిత దారిద్ర్య విద్రావణ శతకమునుండి పద్యదశకమును చేర్చుకొని యుద్దానిని వ్యంగ్యముగా స్ఫురింపజేయుటకు వీలుగా దశమాశ్వాసమునందు జొనిపి తన గూఢవస్తుమయ కావ్య లక్షణమును నిరూపించెను. కావున తెలుగునందు మొట్టమొదటి శతకము సర్వేశ్వర శతకముగాని, వృషాధిప శతకముగాని కాక దారిద్ర్య విద్రావణ శతకమగుచున్నది పండితులు దీనినిఁబరిశీలింతురు గాక!

## అధో జ్ఞాపికలు

1. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము — శతకములు పుట 278— శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం.
2. శ్రీ వంగూరు సుబ్బారావు, పు. ××VI
3. Ibid. ×××IV
4. ఆంధ్రపత్రిక—శ్రీ నాగ్గుంపు ఉయంతి సంచిక—శతక వాఙ్మయము, పు 145.

5. మానవల్లి కవి—రచనలు, సంపా : శ్రీ నిడదవోలు వెంకటరావు గారు మరియు డా. పోణంగి శ్రీరామ అప్పారావు పంతులుగారు, పు 55—ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, ప్రచురణ 1972.

6. శ్రీ అమరేశం రాజేశ్వరశర్మగారు, పు 128 మరియు 129.

4. దారిద్ర్య విద్రావణస్తవముగావించిన వాడింద్రుడు కాడు. చూ. హరివర మేషి పురందర ప్రబోధితుడై సురగురుండఖిల జగద్గురువకు గృతాంజలియై" 610—89, అశ్లేషస్తవానంతరమునందలి వచనమున" అని స్తుతించినంత గురునకుం గరుణించి." కు.సం. 10—100 యని గలదు. కావున దారిద్ర్య విద్రావణస్తవముగావించినవాడు సుర గురుడు (బృహస్పతి, కవుల చరిత్రయందు దారిద్ర్య విద్రావణ స్తవముగావించిన వాడు బృహస్పతి యనియే పేర్కొనబడినది.వావిళ్ళ ప్రతియందలి స్తుతి పూర్వవచనము (10—89) పై విధముగనే యున్నది. స్తుత్యనంతరం వచనము (10—100) నందు మాత్రము "అని స్తుతించిన నమరేంద్రునకుం గరుణించి" యని గలదు. సురగురువిబ్రబోధించిన వారిలో పురందరుడు (—ఇంద్రుడు) గూడ గలడు. ఇట్లు తనచేత తానే ప్రబోధింపబడుట అసమంజసము. కావున నిది దప్పుబాఠము.

ి. బహుశ రామేశకవి కృత దారిద్ర్య విద్రావణ శతకమును నన్నెచోడుడు తెనిగించినవాడేమో ? రామేశకవి దారిద్ర్య విద్రావణ శతకము రచించుటయు మాహాయే. అయినను శతకములు తెనిగించినవి ప్రాచీనములు లేవు. కావున నిదియు సందిగ్ధ విషయమే.

9. పు 123—9, శ్రీ అ. రా. శర్మగారు.

10. భార.ఆది. ప. ప్రథమాశ్వాసము, పద్యములు 104—107.

11. నన్నెచోడ కుమార సంభవకాలము, భారతి—విక్రమ సంవత్సరము—వైశాఖ మాసము. పు. 591

12. శతక వాఙ్మయము—పు 145, ఆంధ్రపత్రిక—శ్రీ నాగేశ్వర శత జయంతి సంచిక.

13. నన్నెచోడుని కవిత్వము, పు 123—9.

14. మానవల్లి కవి—రచనలు, పు 55.

15. చూ. నిర్వచనోత్తర రామాయణము—పీఠిక, డా. పాటిబండ మాధవ శర్మగారు, పు. L × × VII—వీనినేగాక మరికొన్నిటిని గూడ జూపవచ్చును. ఇక ఉద్భటుడు కావ్యాలంకారసార సంగ్రహమునందుదాహరణములుగ తన కుమార సంభము నుండి శ్లోకములను గ్రహించియుండుట విమర్శకులకు దెలియని విషయముగాదు.

16. కు. సం. అష్టమాశ్వాసము, పు. 182—193

17. కు. సం. సప్తమాశ్వాసము, ప. 36.

18. 19. నన్నెచోడకవి శైవ సంప్రదాయము—శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు, భారతి—ఏప్రిల్ 1969.



# కలగూరగంప

## "కంజూగల్ రాదర్ దాన్ అమాటరీ..."

ఒకప్పుడు భారతదేశంలో సంస్కృతానికి ఉన్నస్థానం ఇప్పుడు ఇంగ్లీషుకి ఉందంటే ఒకవిధంగా నిజమనిపిస్తుంది—మన "పాత మతాచారాల"కి కట్టుబడి ఉన్నామనుకున్నవాళ్ళు కూడా ఇంగ్లీషు వాడినంతగా 'తమ' భాషలని వాడరు, దేవుడికి సంబంధించిన చర్చ కూడా ఇంగ్లీషు జరిగినంతగా (కనీసం ప్రముఖ చర్చా వేదికలద్వారా) తెలుగువంటి భాషలలో జరగటంలేదేమో!

ఇటువంటి పరిస్థితులలో ఒక పెద్ద ఇంగ్లీషు రచయిత చచ్చిపోయినప్పుడు అతన్ని గురించి (తెలుగులోనయినా) ఎందుకు రాయకూడదనిపిస్తుంది. ఇంగ్లీషు నవలలకి—సహజంగానే—ఉన్నంత ఆదరణ ఆ భాషలోని కవిత్వానికీ, నాటకాలకీ భారతదేశంలో ఉండి ఉండదు. నవలలు అనగానే మామూలుగా ఇంగ్లీషు సాహిత్యంతో పరిచయం ఉందనుకునేవాళ్ళకి స్కాట్, ఆస్టెన్ ఫీల్డింగ్, స్మాలెట్, థాకర్, హార్డీ, డికెన్స్, మామ్, గ్రీన్ పేరులు గుర్తుకి వస్తాయి. పి. జి ఉడ్‌హౌస్ వెంటనే జ్ఞాపకం రాకపోవచ్చు. (ఎన్నో ఏళ్ళక్రింద ఒక అబ్బాయి నన్ను "మేరీకారెల్లి నవలలు చదివారా?" అని అడిగాడు. లేదంటే అతను—"ఐ సపోస్ యూ'రీడ్ ఓన్లీ పి. జి. ఉడ్ హౌస్ ఎండ్ అగాథా క్రిస్టీ!" అని నన్ను కొట్టిపారేశాడు...) కాని, ఇంగ్లీషులో ఏమాత్రం ప్రవేశం ఉన్నా ఇతని పుస్తకాలు చదవటం మొదలుపెట్టినవాళ్ళకి జీవితం అంతా విడిచేబంధం ఒకటి ఏర్పడితీరుతుంది. ఆమధ్య 'ఎన్‌కౌంటర్' పత్రికలో రాస్తూ హిలరీకార్క్ ఉడ్‌హౌస్‌కి అతనికి పాఠకులతో ఉన్న సంబంధం "కన్‌జూగల్ రాదర్‌దాన్ అమాటరీ—నెవ్ గోస్ టు హిమ్ ఎగెయిన్ ఎండ్ ఎగెయిన్," అన్నాడు.

నిజంగానే పి. జి. ఉడ్‌హౌస్ పుస్తకాలని ఎక్కడయినా మొదలుపెట్టి, ఎప్పుడయినా ఆపవచ్చు. చదివిన భాగమే మళ్ళీ మళ్ళీ చదువుకోవచ్చు, తోచినంత నవ్వుకోవచ్చు-అసలు కొంచెం ఆలోచించి చూస్తే ఆంగ్లనవలా రచయితలలో హాస్యానికి ప్రాధాన్యత ఇచ్చిన వాళ్ళకన్నా గొప్ప రచయితలు ఎవరు ఉన్నారన్న అనుమానమే గట్టిపడుతుంది. స్మాలెట్, డికెన్స్‌లని మించిన వాళ్ళెవరయినా ఏ భాషలోనయినా ఉన్నారా అనిపిస్తుంది. [ఈ రోజులో పాశ్చాత్య సాహిత్యాన్ని ఆవరించిన 'మూడ్' విషాదానికే ముఖ్యమయిన స్థానం ఇస్తోందని కొంతకాలం క్రింద జె. బి. ప్రీస్ట్లీ అన్నాడు. విషాదానికి తగిన గౌరవాన్ని ఇస్తూనే—హాస్యం వెనుక విషాదం దాగి ఉంటుందని కూడా అంటారుకదా!—'హ్యూమరిస్ట్' కావాలనుకున్నందుకు సిగ్గు పడనక్కరలేదు.] ఆధునిక రచయితల "సాహిత్యపు పూర్వీకులు" ఎవరు అన్న ప్రశ్న వచ్చినప్పుడల్లా ఇటువంటి వాళ్ళతో పోలికలకోసం వెతకకుండా ఉండలేము. ఉడ్‌హౌస్ ఏరి వంశానికి చెందినవాడే కావచ్చు; కాని, అతనిలో థాకరీ ప్రభావం నాకు బాగా కనిపించింది, ఒక ముఖ్యమయిన తేడాతో. థాకరీలో కొంచెం బాధ కలిగించే పదును, వాడి ఉంటాయి. [అతను వ్యక్తిగా ఎంత నెమ్మదివాడని చదువుతామో అంత విసురుగా మాటలు రాస్తాడు. అయితే, చదివేవాళ్ళ బాధ ఎక్కువసేపు నిలవదు!] ఉడ్‌హౌస్‌లో ఎప్పుడయినా కోరలు బయట పడ్డాయన్న అనుమానం కూడా వెనువెంటనే వస్తూ ఉంటుంది.

బెర్టీ ఊస్టర్‌ని జీవ్స్ ఎన్నోసార్లు కించపరుస్తాడు. ఒకవిధంగా హింస పెడతాడు. కాని, ఎప్పుడో తప్ప ఇందులో నిజమయిన క్రౌర్యం స్ఫురించదు. అసలు బెర్టీ ఊస్టర్ జీవ్స్‌మీద ఎంత ఆధారపడతాడో అంతగా అతని సామర్థ్యం (లేక చాకచక్యం) కావాలని పట్టు పడతాడు. ఒకసారి, "ఐ వాస్ గెటింగ్ ఫెడ్ అప్ విత్ ది చాప్" అని కూడా సణుగుతాడు. తమ మధ్య ఫ్యూడల్ బంధం ఉందని ఊస్టర్ నమ్మకం అయి వుండవచ్చు. ఉడ్‌హౌస్ పేరు పెరిగిన కొద్దీ కొందరికి ఒక సందేహం వచ్చింది అతని పుస్తకాలలో పనివాళ్ళు (అంటే సేవకులు, పరిచారకులు మొదలయినవాళ్ళు) ఎక్కువ. దీనినిబట్టి ఉడ్‌హౌస్ ఇప్పటి కాలానికి తగిన నమ్మకాలు లేనివాడేమో అన్న సందేహం వాళ్ళకి వచ్చింది. ఈ సందేహం అంతగా పట్టించుకోనక్కరలేనిది. (అసలు కొందరికి ఎ[illegible]మయిన నమ్మకాలు ఉండాలన్న నిర్బంధం ఏమిటి? టి. ఎస్. ఎలియట్, ఎజ్రాపౌండ్‌లు పెద్ద వామపక్షం వారు కారుకదా...) జీవ్స్ తన 'యజమాని' ఊస్టర్‌మీద అధికారం చలాయించినట్టే ఉడ్‌హౌస్ నవలలన్నిటిలోనూ పనివాళ్ళదే పంతం చెల్లుతూ ఉంటూ ఉంటుంది. ధనిక[illegible] ఉన్నాయని చెప్పుకునే వాళ్ళతో కనిపించే స్వామిభక్తి వాళ్ళని ఖండించే వాళ్ళలో కని

పించదు: మత విశ్వాసం ఏదయినా మితిమీరితే అది భక్తిని ఏక్కువ చేస్తుందన్న ఆరోపణని తోసివెయ్యటం తేలికకాదు.

పిక్విక్ పేపర్స్ చదివితే కనిపించే పిక్విక్, వార్డ్‌వ్ మీద వెక్కిరింత క్రమంగా వారిమీద ఇష్టంగా మారిపోతుంది. అదేవిధంగా జీవ్స్ కూడా క్రమంగా ''మెర్తా''బడి బెర్టీ ఊస్టర్‌కి ఒక రకం స్నేహితుగా మారిపోతాడు. జీవ్స్ నవలలకి ఉన్నంత పేరు తక్కిన వాటికి లేదుకాని ఈ మధ్య ఎవ్వడో ఉడ్‌హవుస్ తనకి లార్డ్ ఎమ్స్వర్త్ అంటే ఉన్నంత ఇష్టం తక్కిన పాత్రలమీద లేదన్నాడు. నేను ఇంతదాకా వచ్చిన ఉడ్‌హవుస్ నవలలన్నీ చదివా ననుకుంటాను. నాకు దొరికిన అతని పుస్తకాన్ని దేనినీ ఎంతో కొంత చదవకుండా ఉండను. వాటిని గురించి ఆలోచించినప్పుడల్లా ఒక చదువరిగా, అందులోను ఇంగ్లీషువాడిని కాని చదువరిగా, ఈ అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవించకుండా ఉండలేను. పందులని (గుమ్మడికాయలనీ, పువ్వులని కూడా) పెంచటంలో మునిగిపోయిన ఈ బ్రిటిష్ ఎర్ల్ ఇరవయ్యవ శతాబ్దపు చికాకులతో చితికిపోతున్న వాళ్ళకి ''మనం కలుసుకొనగలిగితే బాపుందునే ఇతన్ని!'' అనిపించేట్టు ఉంటాడు. ఇతని భవనం బ్లాండింగ్స్ కాసిల్ ఒకరకమయిన భూతలస్వర్గం. దీనిని గురించి చదివి ఆనందించే పాఠకులకి ఒక అనుమానం రాక మానదు రచయితకి ఎమ్స్వర్త్ చెల్లెలు లేడీ కాంస్టెన్స్ అంటే కూడా నిజంగా ఇష్టం అని! వీళ్ల ఇద్దరి సోదరుడూ అయిన గాల హాడ్ త్రీప్వుడ్ సంగతి సరేసరి అతని పేరు అతనికి అన్ని విధాలుగానూ సరిపోయింది. గాలహాడ్‌కి అంతస్థులో గొడవలేదు. అతనొక కోరస్‌గరల్‌ని పెళ్లిచేసుకుందామను కుంటాడు కాని వీలవదు; అతని నిరాశలో చదువరులు పాలుపంచుకోకుండా ఉండరు. ''గాల్లీ'' త్రీప్వుడ్‌ని తలుచుకుంటే పిక్విక్ పేపర్స్‌లోని వెల్లర్‌లు ఇద్దరూ గుర్తుకి వస్తారు. ఇంతకన్నా గొప్ప గౌరవం ఎవరికి మాత్రం ఉండగలదు?

జీవ్స్ పుస్తకాలు (నిజానికి వీటిని బెర్టీ ఊస్టర్ పుస్తకాలు అనలేమె !), ఎమ్స్వర్త్ పుస్తకాలు రెండు తెగల ఉడ్‌హవుస్ పుస్తకాలు. ఇవి పోగా మల్లినర్ (ముల్లినర్ అనాలా ?) కథలుకొన్ని ఉన్నాయి. ఇవి ఇంగ్లీషు కథలు చదివిన వాళ్లందరికీ ఎంతో ముఖ్యమయిన ''సాహిత్య వంశానికి'' చెందిన వనిపిస్తాయి డికిన్స్ పాత్రలు కొందరు అలి నట్లు కథలు అల్లుతాడు మిస్టర్ మలినర్. వాటిలో ఉడ్‌హవుస్ వ్యక్తిత్వం కొంత తొంగిచూస్తుందని నాకు చాలాసారులు తోచింది. ఉడ్‌హవుస్ పుస్తకాలు రాసి సంపాదించినంత ధన ఎందరో సంపాదించి ఉండరు. అతనికి అతని భాషమీద ఉన్న ''ఒ కారం'' ఎవరికి ఉండి ఉండదంటేకూడా అతిశయోక్తి కాకపోవచ్చు అతని నవలలలోని సంఘటనలు నమ్మశక్యం కానంత చాకచక్యంతో కూర్చబడినవని ఎవరికయినా అనిపిస్తుంది. ఎంత తెలివిక్త డిటెక్టివ్ రచయితకూడా ఇతనితో ఈ విషయంలో సరితూగలేడు అయినప్పటికీ ఉడ్‌హవుస్ హాలీవుడ్‌కి వెళ్లి పెద్ద రచయిత కాలేపోయాడని వింటాము. హాలీవుడ్ సినిమా నిర్మాతలమీద అతని ఎంత తక్కువ అభిప్రాయముందో మల్లినర్, ల్యాలెన్ (ఉదా ఈ విధంగా ఉన్నా లేకపోయినా ఫరవాలేదనుకుంటాను !) కథ చదివితే కొంత తెలుస్తుంది. కాని ఉడ్‌హవుస్‌లో ద్వేషం, విష ఉండవు—ఉండలేవు. ల్యాలెన్‌ని గురించిన అవహేళనకూడా నెప్పి కలిగించదు. ఈమధ్యవచ్చిన ''బాచిలర్స్ ఎనానిమస్'' నవలలో అతను చాలా బోళా మనిషిగానే కనిపిస్తాడు...(ఉడ్‌హవుస్ బ్రాడ్వే సంగీతప్రు నాటకాలలో పాటలురాసి మాత్రం బాగా ఆర్జించాడని చదువుతాము. మరి సినిమాలో ఎందుకు ''వయికి'' రాలేదో అర్థంకాదు. గ్రాహమ్ గ్రీన్, ఆల్డస్ హక్స్లీ, ఎరిక్ ఆంబ్లర్‌లు సంపాదించుకున్న పేరు సయితం ఇతను తెరమీద సంపాదించుకోలేకపోయాడు !) యుక్రిడ్జ్ స్మిత్ కథలనిగురించి ప్రత్యేకంగా చెప్పుకోలేముకాని స్మిత్ బ్లాండింగ్స్ కాసిల్‌కి కూడా వెడతాడు. యుక్రిడ్జ్ పుస్తకాలలో ఒకప్పుడు మన దేశంలోకూడా కొందరికి తెలిసిన స్కూళ్లు, స్నేహాలు, క్లబ్బులని పోలినవి కనిపిస్తాయి...

ఉడ్‌హవుస్ నవలలలో ఒక వింతరకంవి వేరే ఉన్నాయి— ''పిక్కాడిల్లీ జిమ్, ది స్మాల్ బాచిలర్, బిగ్‌మనీ'' వంటివి. ఇందులో డబ్బున్న మధ్యవయస్సు ఆడవాళ్లు, వారి అసహాయులయిన భర్తలు మామూలు యువ ప్రేమికులతోబాటు దర్శనం ఇస్తారు. వీటి కథలు ఎంతో జాగ్రత్తగా అల్లి ఎన్నిసారులు చదివినా ఆశ్చర్యం కలిగించేట్టు ఉంటాయి. వీటిలో అమెరికా వాతావరణం ఎంతోకొంత ఉండితీరుతుంది. డబ్బున్న అమెరికా వాళ్ళకి ఇంగ్లాండు మీద ఉండే మోజు కూడా వీటిలోని పాత్రలు చూపిస్తూ ఉంటారు. అమెరికాలో ''గాంగ్స్టర్లు'' (వీరిని బందిపోటు దొంగలనాలా గజదొంగలనాలా?) కొన్ని పుస్తకాలలో వచ్చి పోవటానికి తగిన సన్నివేశాలు, వీరితోబాటు డిటెక్టివ్‌లు...

ఉడ్‌హవుస్ ''సీరియస్'' పుస్తకాలు రాయలేదా అంటే, రాసి చూశాడనే అనాలి. కాని, నేనుచదివి జ్ఞాపకం ఉన్న ఒక పెద్ద

ప్రేమకథ నన్ను ఏమాత్రం ఆకర్షించలేకపోయింది! దీనిని గురించి ఆలోచించినప్పుడు ఉడ్‌హవుస్ రెండో ప్రపంచ యుద్ధంముందు బెర్లిన్ రేడియోమీద ఏదో ప్రసంగాలు చేసినందుకు అతన్ని కొందరు ఛీ కొట్టిన సందర్భాలు గుర్తుకి వస్తాయి. ఈ ప్రసంగాలని "ఎన్‌కౌంటర్" పత్రిక మళ్లీ అచ్చువేసింది. అవి ఉడ్‌హవుస్ రాజకీయ చైతన్యం ఎంత అమాయకమయిఉండాలో తెలుపుతాయి (ఒక కథలో బెర్టీ ఊస్టర్ గాంధీగారు బీఫ్ సరిగ్గా తింటే స్వరాజ్యం గురించి మాటాడడంటాడు. ఉడ్‌హవుస్ వెక్కిరింతలని పట్టించుకునేవాళ్ళు సురదృష్టవంతులనే అనాలి:) అతని నవలలోని పాత్రలు కొందరు కన్సర్వేటివ్ సభ్యులుగానే నిలబడుతూ ఉంటారు - ఉదాహరణకు సర్ గ్రిగరీ పార్స్లో. కాని, కన్సర్వేటివ్ పార్టీలో వాళ్ళకి అతనంటే (ఉడ్‌హవుస్ అంటే) ఇష్టంలేదుట. ఈపారీ సమావేశంలో ఒకసారి అతన్ని పొగిడే తీర్మానాన్ని ఎవరూ ఆమోదించలేదుట. ఇక లేబర్ "కీచుగొంతుక' రకం రాజకీయ వాదులు ఉడ్‌హవుస్ హేళనకి గురి కావటంలో ఆశ్చర్యమేలేదు...[ఇతని నవలలో బాగా డబ్బుఉన్న పాత్రలు అందరూకూడా నవ్వుల పాలు అయ్యేవారే...]

పి. జి. ఉడ్‌హవుస్ పుస్తకాల అట్టలమీద ఎందరో పొగడ్తలనో అతని ప్రకాశకులు అచ్చువేస్తూ ఉంటారు. ఆ పుస్తకాలని చదివి సంతోషించిన వాళ్ళకి తమ అభిప్రాయాలవంటివేచాలా పెద్దవాళ్లకి కూడా ఉన్నాయి కదాఅని సంతోషం వేస్తుంది. ఇవిలిన్‌వా అన్నాడు: "హి విల్ కంటిన్యూ టు రిలీస్ ఫ్యూచర్ జనరేషన్స్ ఫ్రమ్ కాప్టివిటీ దట్ మే బీ మోర్ ఇర్క్‌సమ్ దాన్ అవర్ ఓన్" అని. పర భాషలో, పరదేశం వాళ్లని గురించి, మన జీవితంలో ఏమాత్రం సంబంధంలేని విధంగా కథలు రాసిన పెల్హమ్ గ్రాన్‌విల్ ఉడ్‌హవుస్‌కి (పెల్‌హామ్ గ్రాన్‌విల్ వోడ్ హవుస్ అని నేను అనుకునేవాడిని: అతను చచ్చిపోయినప్పుడు వచ్చిన రాతలనిబట్టి మొదటి, చివర పేరుల ఉచ్చారణ వేరేఅని తెలుసుకున్నాను! మధ్య దాని సంగతి తెలిదు...) మాటలలో చెప్పలేనంత రుణపడిఉన్న ఒక చదువరి ఈ దేశంలో అతని పుస్తకాలని చదివేవారి సంఖ్య ఇంకా పెరగాలని కోరుకుంటున్నాడు. అతని కథలని అనువాదం చెయ్యటం వీలుపడనిపని కాని ఇన్ని వందలఏళ్ళ ఇంగ్లీషువారి పాలనకిందఉన్న "భారతీయులు" ఇంకా వారి భాషద్వారానే తమ విజ్ఞాన సంస్కృతులని పెంచుకుంటున్న వాళ్ళు ఎన్నో విధాలుగా అనుకరణ కోసమయినా ప్రయత్నించవచ్చు. "అనుకరణ సాహిత్యాన్ని" తక్కువగా చూసే మేధావులు ఒకసారి తెలుగులో సాటిలేని ముగ్గురుని గురించి ఆలోచించవచ్చు...

అంతా తీసి, కొంచెంకూడా చేదులేక మొహం మొత్తు, తుంది అన్న ఫిర్యాదు కొంతసేపుకూడ నిలవదు. కథానాయకులు, నాయికలు అన్నవారు ఉంటే వారు హేళనకి గురికాని సందర్భం ఉండదు. ఇక అంటే అగాథాలాంటి "మర్యాదస్తురాళ"ని గురించి రాస్తూ ఉడ్‌హవుస్ పాతలద్వారా వెన్నెలలో నృత్యాల ప్రసక్తి తీసుకు వస్తాడు. ఒక్కొక్కచోట మనుష్యులని పనులేని కత్తితో చర్మం వొలిపించటం, ఆడవాళ్ళని గొంతునులిమి బాస్పరస్ నదిలో పడెయ్యటం ప్రసక్తి కూడా వస్తుంది. భీభత్సం కావాలనుకున్న వాళ్ళకి ఇవి కొంత సంతృప్తిని ఇవ్వవచ్చు...

— శి. రా.

## రామాజిపల్లె శాసనము

స్వస్తిశ్రీ మను మహా
సామంత చెఱుకు సం
హ దుస రంకుశ అన్వయ
రాజ్యము సేయుచుండ అం
తటి పోలకమ్మకు సిరు నే
గుడి వెనుకగా వెలిపొల (ము) నిని
ఆ చం దార్కము గా నిచ్చె.

రామాజిపల్లె అచంపేట తాలూకాయందు లింగాల రోడ్ పై నున్నది. అచట గ్రామము వెలుపలగల చెఱువు కట్ట వెనుక ఒక నల్లరాతిపై ఈ శాసనము చెక్కబడియున్నది. శాసనశిల ప్రస్తుత ఒక గ్రామ దేవత గుడిముందు కొలది దూరమున పడియున్నది. స్థానికులా గ్రామమునకు పూర్వము "అంతటి" యను పేరు గలదని ఆదేవతకు "అంతటమ్మ" అని వ్యవహారమని చెప్పుదురు. శాసనమున దేని "పోలకమ్మ" యని పేర్కొనబడినది. బహుశా ఈ పోలకమ్మ ఆనాడు ప్రచారముందున్న పోలేరమ్మ దేవతగా వచ్చును. నేడు కలువకుర్తి తాలూకా యందలి పోల్కంపల్లి ఈ దేవతపేరున "పోలకమ్మపల్లె" యని వెలసిన గ్రామమనుటకు కవకాశమున్నది.

ఈ శాసనమున తేది లేదు. కాని, దీనిగల లెలియు చెఱుకు అన్వయ చరిత్రకు క్రొత్తవాడని నా యభిప్రాయము కనుక చరిత్రజ్ఞులకిది యుపయోగింపగలదని తలతును.

— శ్రీ కపిలవాయి లింగమూర్తి

# గ్రంథ విమర్శలు

## తెలుగు నవలా సాహిత్యము

[రచయిత: సాహిత్యభూషణ - శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు, ఎం.ఏ. మూల్యం: ఇరువది రెండురూపాయలు. పేజీలు: ఆరువందల ఇరువది ఎనిమిది. ప్రతులకు: రచయిత పేరు, ఖమ్మం అని వ్రాసి తెప్పించుకొనవచ్చును.]

నేటి ఆధునిక పరిస్థితుల కాలగమనంలో నవలలయొక్క పరిధి చాలా విస్తృతమైనది. ఈ నవలా వ్యాప్తిని అరికట్టగలశక్తి మరి యే యితర సాహిత్య ప్రక్రియకు లేదు. పాఠకుల వ్యామోహం నవలల పైన అధికమయ్యింది. ఈ నవలా సంరంభంలో ప్రాచీన కావ్య పఠనం మరుగున పడిపోయింది. ప్రపంచ సాహిత్యంలో నవలా రచనకధిక ప్రాముఖ్యం లభించింది.

ఈ నవలా రచన యూరప్‌లో బాగా వ్యాప్తిలోకి వచ్చింది. అటుపిమ్మట ఇతర సాహిత్యాలల్లోని నవలలపై యూరప్ నవలల ప్రభావం స్పష్టంగా కానవస్తుంది. నవలంటే ఒక పెద్ద కథ. సామాజిక జీవనానికి ప్రతిబింబం. మానవుని విచిత్ర ప్రవృత్తులు, మోసాలు, క్రౌర్యాలు, మంచి, చెడులు మున్నగునవి యెన్నో అందులో ఉంటాయి. అమెరికన్ నవలాకారుడైన **Marion Crawford** అను నతడు నవలను **Pocket theatre'** గా పేర్కొనుచు **"a long narrative in prose detaiting the actions of fictious people."** అంటే **Meredith "a summary of actual life"** అని ఒక్క ముక్కతో తేల్చాడు. **H. James 'The Art of Fiction'** అను గ్రంథంలో **"is in its brodest definition a personal' a direct impression of life."** అంటూ తన అభిప్రాయాన్ని వెలబుచ్చాడు. ఎవరెన్ని విధాలుగా చెప్పినా నవల మానవజీవితానికి ప్రతిరూపమన్న సిద్ధాంతాన్ని దాటి చెప్పలేదు. ఈ నవల వ్రాయటం కష్టమే అయినప్పటికి **W. H. Hudson "any one can write a novel who has pens, ink, and paper at command and certain amount of leisure and patience"** అని చమత్కారంగా చెప్పినప్పటికి యదార్థం లేకపోలేదు. పుస్తకతోనే ఎవరూ నవల వ్రాయరు. సాధనలో ఒక మెట్టుపైకి వెళ్ళినప్పుడది సాధ్యమగును.

తెలుగు నవలకు వయసు వందఏండ్లు దాటింది. 'నవల' అను పదం తెలుగులో మొదటగా కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు 1897వ సంవత్సరంలో వివేక చంద్రికా విమర్శనమను 'రాజ శేఖర చరిత్ర పై విమర్శ వ్రాస్తూ "ఆంగ్లేయ భాషలో (Novel) అనునీ పదము క్రొత్త యను నర్థముగల 'నవ్' అను పదమునుండి పుట్టినది. ఈ 'నవ్' అనుదానికి 'నవ' యను సంస్కృత పదంబునకును సంబంధము తేటతెల్లంబేకదా? కావున నవల యనగా 'నవాన్ ప్రాప్, లాతి గృహ్ణాతీతి నవలా' అనగా క్రొత్త విశేషంబులు గలదను యర్థము నిచ్చుచున్నది. హూణభాషయందును నీ మాటకిదే యర్థ మగుటచే నవలను పదమునకు సరియైన వేరొక సంస్కృత పదము లేకయి ప్రయత్నము చేయక 'నవల' యని యీ పదమును నేనిట వాడుచున్నాన"ని పేర్కొన్నారు 'నవల, అనే అర్థంలో 'శ్రీరంగ రాజ చరిత్ర' కర్త శ్రీ గోపాలకృష్ణమశెట్టిగారు 'నవీన ప్రబంధము' గా చెప్పారు. అయితే 'చింతామణి' పత్రికలో నవలల పోటీలు నిర్వహించిన సందర్భంగా నవల 'వచన ప్రబంధము'గా గుర్తింపబడి ఆ పదమే వాడబడింది. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు తమ స్వీయ చరిత్రలో నవలను 'ఆఖ్యాయిక' గా వ్యవహరించిరి. 'చింతామణి' పత్రికలో వచన ప్రబంధమును గూర్చి ఈ విధంగా చెప్పబడింది. "ప్రబంధమనగా కల్పితమైనకథ. ఆ కథను పురాణేతిహాసాదుల నుండిగాని, చరిత్రములనుండిగాని గైకొని కథాసారస్యమున కనుకూలముగానుండునట్లుగున దానికి నూతనాంశములను జేర్చి పెంచి వ్రాయవచ్చును; లేదా కవి మొదటినుండి కడవరకును స్వబుద్ధిచేతనే నూతన కథను కల్పించియైనను వ్రాయవచ్చును. ... శృంగారమో వీరమో ఏదోయొక రసమును ప్రధానముగా జేసికొని వివిధ రససంయుతము నుండునట్లుగాని యీ యారసమును పోషించుటకయి వివిధ కష్టసుఖములను ప్రయత్నములను కార్యవిఘాతములను కార్యసాఫల్యములను మధ్యమధ్య సందర్భోచితముగ దీసికొని వచ్చుచు కథయంతయు నొక్కని చరిత్రవలె నుండునట్లు వ్రాయవలెను." ఈ లక్షణాలే తెలుగు నవలకు ముఖ్యం.

నవలా ప్రక్రియ తెలుగులో ఆంగ్ల భాషా ప్రభావంతో అభివృద్ధి చెందింది. నాటినుండి నేటివరకు వచ్చిన నవలలపై విమర్శ

...త్యకంగా వ్రాయబడిన గ్రంథాలు ఇటీవలనే వచ్చాయి. ఆ గ్రంథా... మొదటిది మొదలి నాగభూషణ శర్మగారి 'తెలుగు నవలా ...సం'. రెండవది పులా తోట వెంకటేశ్వర్లుగారి 'తెలుగుసాహిత్య ...సము'. మొదటి దానినిగూర్చి చెప్పటం అప్రస్తుతం. రెండవ ...నిగూర్చి ముచ్చటించటం ప్రస్తుతం.

గ్రంథమునంతయు నాలుగు విభాగాలుగా చేయబడింది. ప్రథమభాగంలో నవలల పుట్టుక, ప్రధానాంగములు-విషయ ...ము, భిన్నరూపములు, ప్రక్రియననుసరించి నవలలు, వస్తు...ననుసరించి నవలలు, నవలాకారుని బాధ్యతలు.

ద్వితీయభాగంలో భారతీయ నవ్య సాహిత్య మహోదయము, ...ర్వ రంగము, ఉత్తరరంగము.

తృతీయ భాగంలో నవలాసాహిత్యస్వర్ణయుగము, తెలుగు ...ల విస్తృతికి సంస్థలు వ్యక్తుల కృషి; ఇందులోనే ద్వితీయదశ, ...తీయదశ.

చతుర్థభాగంలో తెలుగునవలావికాసమునకు తోడ్పడిన వివిధము...వ పత్రికలు, ప్రచురణ సంస్థలు, సాహిత్యసంస్థలు, విశ్వవిద్యా...యములు చేసిన కృషి వివరింపబడింది.

శ్రీ వెంకటేశ్వర్లుగారు తెలుగు తొలి నవలా రచయిత ...వరు ? అన్న అంశమును 80వ పేజీలో తడివిమాచి వీరేశలింగం ...తులుగారే తొలి నవలా రచయితగా పేర్కొన్నారు. ఇది సమం...నముకాదు.

తొలి నవలా రచయిత నరహరి గోపాలకృష్ణమశెట్టిగారు. ... 1872లో 'శ్రీరంగరాజ చరిత్ర' అను నవలను వ్రాసిరి. ...కే 'సోనాబాయి పరిణయము' అనే నామాంతరము గలదు. ఇదియే ...లి తెలుగునవల. నవలకు చెప్పిన లక్షణాలు ఈ నవలయందు ...స్పష్టముగా నున్నవి. చింతామణి పత్రిక చెప్పిన కల్పితకథ, విష...యము పురాణాదులనుండి గ్రహించి మాతనాంశములు చేర్చి పెంచి వ్రాయుట. కథ చరిత్రగా వ్రాయుట. శృంగార వీరరసాల ప్రాము...ఖ్యము. మానవుని కార్యసిద్ధి. ఈ లక్షణాల కనుగుణంగా 'శ్రీరంగ రాజ చరిత్ర' ఉన్నది. నవలలో కథాకల్పన ఉన్నది. కథానుగుణంగా మాతనాంశములు పెంచి వ్రాయబడ్డాయి. కథలో చారిత్రకాంశము చోటుచేసికొన్నది. శ్రీరంగరాజు సోనాబాయి అనే కన్యను ప్రేమిం చుట, ఆమెను కాపాడుటకు శ్రీరంగరాజు కొండవీడు పోవుట వంటి ఘటనలు శృంగార వీరరసాల ప్రాధాన్యం ఉన్నది. రంగరాజు సోనా బాయిని వివాహమాడుటలో కార్యసిద్ధి కానవచ్చు చున్నది. అంతేగాక నాటి హిందువుల ఆచారధర్మములుకూడ వివరింపబడ్డాయి. ఇందు స్పష్టంగా లక్షణాలు గోచరిస్తున్నను వీరేశలింగం పంతులుగారినే తొలి నవలా రచయితగా ఎలా అంగీకరింపగలం. వెంకటేశ్వరు గారు సరియైన కారణములు-చూపింపలేదు. పరిశీలన లేకయే ప్రథమ నవలాకర్తగా సమర్థించటం సబబుగ లేదు.

వీరేశలింగం పంతులుగారు తమస్వీయ చరిత్రలో 'తెలుగున మొదటి వచన ప్రబంధము నేనే చేసితిని' అని పేర్కొన్నారు. గోపాల కృష్ణమశెట్టి గారు పంతులుగారికంటే ముందుగానే నవలను వ్రాసిరి అయినప్పటికి శెట్టిగారి నవలను పంతులుగారు గుర్తింపలేదు. గుర్తించినయెడల తమ స్వీయ చరిత్రలో ఆవిధంగా వ్రాసియుండక పోవచ్చును గదా.

విడదవోలు వెంకట్రావుగారు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి 'మహాశ్వేత'ను ప్రథమ నవలగా పేర్కొన్నారు. 'మహా శ్వేత' బాణుడు వ్రాసిన 'కాదంబరి'కి అనువాదము. ఇట్టి అను వాదముగానున్న దానిని నవలగా అంగీకరించుట 'చింతామణి' పత్రి కలో పేర్కొన్న లక్షణానికి విరుద్ధం. వెంకట్రావుగారు 'మహాశ్వేత'ను ప్రథమ నవలగా పరిగణించుట పొరపాటు పడ్డారనిపిస్తుంది. ఏవిధంగా చూచినప్పటికి నరహరి వారి 'శ్రీరంగరాజ చరిత్ర'యే ప్రథమనవలగా అంగీకరింపక తప్పదు. 'తెలుగు నవలా సాహిత్య వికా సము' యొక్క కర్త ఈ విషయాన్ని గుర్తించాలి.

98-114, 150-164 వరకునున్న పేజీలలోని విషయ మనవసరము. ఇందులో ఎక్కువగా కవితా వికాసానికి సంబంధించి వది కాని నవలా వికాసానికికాదు. ఉపోద్ఘాతమధికమైన కారణంచేత అసలు చెప్పవలసింది మరుగున పడిపోయింది. సాహిత్యంకంటె రాజకీయ, సాంఘిక పరిస్థితులపై పాఠకుల దృష్టి నిలుస్తుంది. 105 వ పేజీలో వ్రాసిన "ఆంధ్రదేశములో జరిగిన సంఘటనలు". అను అంశంలో చెప్పిన వాక్యాలే నవలలకు సంబంధించినది. ఇది నవలావికాసానికి ప్రయోజనం కల్పించిన ప్రస్తావన. ఇదంతా చదివిన తరువాత నవలలనుగూర్చి ఏమి చెప్తారన్న సందేహం కలుగుచుండును.

160 వ పేజీలో బసవరాజు గీతాన్ని వెంకటేశ్వర్లుగారు తప్పుగా ఉదాహరించారు.

కొల్లాయి గట్టితేనేమి
మా గాంధి మాలడై తిరిగితేనేమి ?

కాని బసవరాజు అప్పారావుగారి గీతం ఈవిధంగా ఉన్నది.

కొల్లాయి గట్టితే నేమి
మా గాంధి కోమటై పుట్టితేనేమి ?
(బసవరాజు గీతాలు 155 వ పేజి)

కాల్పనిక ప్రభావముగల విశ్వనాథ, చలం, బాపిరాజు, నవలలను ముచ్చటించారు. వీరిని గూర్చి వివరణ స్వల్పంగా ఉన్నది. కథను పాఠకుడు అర్థం చేసికొనే విధంగా వివరించారే తప్ప విమర్శనాత్మకంగా లేదు. రచయితల నైపుణ్యము నుగ్గడింపవలెను. ఎందువలనంటే వీరు ముగ్గురు తెలుగు నవలా వికాసానికి బహుధా తోడ్పడినవారు. కాల్పనిక వాదాన్ని హైందవ సంస్కృతీ పునరుజ్జీవనోద్యమంతో సంబంధం కల్పించినవారు విశ్వనాథ. ఈ వాదంలో చలం మునిగిపోయి అందలి ప్రేమానుభూతిని స్త్రీ స్వాతంత్ర్యము, లైంగిక స్వేచ్ఛలలో ముడిపెట్టి నవలలు చిత్రించారు. ఆ నవలల్లో వావివరుసలు లేని సమాజాన్ని చూపించారు. చారిత్రిక సత్యాలు చెదరిపోకుండ భారతీయ సంస్కృతిని ప్రదర్శించినవారు బాపిరాజు. కనుక వీరిని సమగ్రంగా రచయిత చర్చించియుండిన బాగుగా నుండెడిది. అప్పుడు పాఠకుడు వీరి రచనలను గూర్చి అధికంగా తెలిసికొనే అవకాశం కలిగేది.

261 నుండి 273 పేజీలవరకు చెప్పిన మాటలు అవసరవాస్తవంగా ఆ యా పరిస్థితులు నవలా రచనకు దోహదం చేసేను. 1962లో జరిగిన ఇండియాపై చైనాదాడి, 1965లో పాకిస్తాన్ ఇండియాపై యుద్ధం, 1971లో బంగ్లాదేశ్‌పై పాకిస్తాన్ పోరాటం మున్నగునవి తెలుగు నవలలపై ప్రభావాన్ని చూపలేదు. ఆయా పరిస్థితులకు కవులు ఉద్రేకపూరితులై కవితను సృష్టించారు.

నవీన నవలా రచయిత కొవ్వలి వారు వెంకటేశ్వర్లుగారి దృష్టికి కంపించినట్లులేదు. కనీసం వారు వ్రాసిన రెండు మూడు నవలలను గూర్చి ప్రస్తావించిన రచయితకు న్యాయం చేకూర్చినట్లగును. లేడి రైటర్సులో శ్రీమతి పవని నిర్మల ప్రభావతిని గూర్చి ముచ్చటించలేదు. ఆమె దరిదాపు ఏడు, ఎనిమిది నవలలుపైగా వ్రాసారు. ఆ యా నవలల్లో మధ్యతరగతి ప్రజల బాధలు, వ్యథలు, సంపన్నుల అహంకారాలు, వయసులోనున్న భార్యాభర్తల వింత ప్రవృత్తులు వ్యక్తమగును.

నేటి యువలోకం మూర్తీభవించిన మూర్తి శ్రీ వీరాజీ. ఉత్తమ నవలాకారుడు. కళాశాలల్లో జరిగే పరిస్థితులను ఆధారం చేసుకొని రచించిన నవలలు మనకున్నప్పటికి వారు వ్రాసిన 'ఇద్దరం ఒకటే' అను నవల చాల మంచిది. అత్యాధునిక యువలోకం పాఠకుల ముందు ప్రత్యక్షమవుతుంది. కథాసంవిధానం, పాత్ర చిత్రణ, సన్నివేశ కల్పన, మొదలగు వానియందు కడుశ్రద్ధ వహించి రచించిన నవల. ఇట్టి రచయితలే యువతరానికి ప్రతినిధులుగానుండిన నవలా వికాసానికి కొండంత బలం వస్తుంది. శ్రీ పుల్లాభొట్లవారు వీరిని గూర్చి ఇంకా కొంత సమాచారం అందించిన యెడల సమగ్రత కలిగెడిది.

ప్రచురణ సంస్థలను కూడ నవలా వికాసంలో ఒక భాగంగా పేర్కొన్నారు. సామాన్యంగా ఈ ప్రచురణ సంస్థలు క్రీధన సముపార్జనే ప్రధాన కర్తవ్యంగా భావించినవి. అందువల్లనే మంచి నవలలు ప్రచురించుటకు ముందుకువచ్చి నవలాకారులకు చేయూతనందించారు. ముందు తమ స్వార్థం తరువాత పరార్థం కొరకు ప్రాకులాడారు. అయితే ప్రత్యేకంగా ప్రచురణ సంస్థలను గూర్చి చెప్పనక్కరలేదు. ఈ ప్రచురణ సంస్థలకు వినియోగించిన కాలాన్ని ఆధునిక నవలాకారుల రచనల గూర్చి వివరించటానికి వినియోగించిన సందర్భోచితంగా ఉండేది.

21వ పేజీలో "శ్రీపతులు ముసాళ రంగనాయకమ్మ ', వాసిరెడ్డి సీతాదేవి 'స త' నవలలకు బహుమతి )" అని వ్రాసారు. ఈ రచయిత్రులలో రంగనాయకమ్మ గాని వాసిరెడ్డి సీతాదేవికాదు.

గ్రంథానికి 'తెలుగు నవలా సాహిత్యవికాసము' అను పేరు ద స్పష్టంగా కానిస్తున్నది. లోపల పేజీలందు 'నవలా ' అని మాత్రమే ఉన్నది. సాహిత్య అనే పదం ఎందువలన ంగా లోపించిందో తెలియజేసిన కారణం అంగీకారంకాదు. ుక పేరు పెట్టవచ్చును గదా.

గ్రంథంలో ము ద్రారాక్షసాలు ఉన్నాయి:- ప్రతిష , పాత్ర ములు ప్రధాన్యత వస్తవ దృష్టి-ఆవస్యకత-విమర్శించి- ప్రసాన విజాన చంద్రికావమండలి-నాటుకోనిన – ఆసించిన- సియించుచు- కొమఖాజా-యుద్ధానంతరము-ఊర్వసి-మరణం -మిక్కిలి అభిమానము- ధ్యానకటకము-ప్రధామచేసి – షషి- జలి-ధృడ-జన్మాస్థానము చిలకించు-విసవము-భూయిష – నముది-వలజ-గౌల-నవాలా-రంజింప-చిక్కులు లో 'లు' డింది. ఇనాలోకప్రాప్తి. ఈ దోషాలను పునర్ముద్రణలో సవరి ) భావింపవచ్చును.

వెంకటేశ్వరు గారి విమర్శ చాలా ఘాటుగాఉన్నది. దీని రణగ 187వ పేజీలో చలాన్నిగూర్చి "ఆ అగాధమైన ో ఎంత సేపటికి ఆయనకు కనబడ్డది, ఆయన చూచినది, ంచినది లైంగిక సుఖము, స్త్రీస్వాతంత్ర్యము రెండే. మరొక ు ఆయనకు పట్టలేదు. ఆయన పట్టించుకోలేదు. స్వాతం ముఖ్యముగా లైంగిక స్వాతంత్ర్యం ఆయన ధ్యేయము" ఈ ) యథార్థము. రచయిత విమర్శకిది నిదర్శనంగా ఉన్నది. ఈ మాటలు చలం భక్తులకు నచ్చకపోవచ్చును. లైంగిక ం ప్రబోధించి స్త్రీ సమాజాన్ని చలం నాశనం చేసారు. బంధనలులేని జీవితం కావాలని ఉద్బోధించుటయేగాని దాని గే పరిణామాలు నవలలు వ్రాస్తున్నపుడున్న ఉద్రేకావస్థలో కపోయారు. సెక్సు స్వేచ్ఛలో మునిగి ఆచరణ సాధ్యమా డా లన్న విచక్షణ చేయక వివాహబంధంపై ధ్వజమెత్తి సమా జానికి పురిటినొప్పులు కలిగించి సంస్కరణ వాదిగా నిలబడ్డారు,ఆయా రెణులు చలాన్ని గొప్ప రచయితగా చేసాయి. అయితే ఆయన సిద్ధాంతాలు అంగీకారయోగ్యంకాదు. కాని అద్భుతమైన శైలి సృష్టించారు. వాక్యవిన్యాసం చాల చిత్రంగా ఉంటుంది. అట్టి శైలి తెలుగు నవలాకారులలో ఎవరికి అలవాటుపడియుండలేదంటే ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు.

227-242 వరకు గల పేజీలందు గోపీచంద్ నవలా వైశిష్ట్యన్ని చూపించారు సుదీర్ఘమగు చర్చ జరిగినందువలనే వారి యొక్క స్వరూపం తెలిసింది. ఆయనలో నిండియున్న హేతు వాదం, ఆధ్యాత్మిక భావం, మానవతావాదము, మనోవైజ్ఞానికత, అరవిందుని తత్త్వములు ఏ విధంగా వారి నవలలందు ప్రదర్శింప బడినవో వెంకటేశ్వర్లుగారు విశదంగా వివరించారు. దీనినిబట్టి గోపీచంద్ నవలల స్వరూప స్వభావములు తెలిసికొనవచ్చును.

474 మొదలు 504 వరకు నున్న పేజీలలో నున్న సమా చారం చాల ప్రధానమైంది. అనువాద నవలల ప్రాముఖ్యాన్ని వివరిస్తూ, అవి తెలుగులో ఎటి స్థానాన్ని వహించియున్నవో స్పష్టం చేసారు. ఈ అనువాద ప్రకరణంలో బంకిం-రవీంద్రుడు, శరత్, ప్రేమ చంద్ మున్నగువారినిగూర్చి వివరించుటచేత అనువాదముల ప్రత్యేకత వ్యక్తమగుచున్నది.

గ్రంథమునందు చేసిన విభాగములను బట్టి నవలాసాహిత్య మంతయు పరిశీలనము చేయబడింది. నేటి నవలా రచనకధికంగా తోడ్పడుచున్న రచయిత్రులనుగూర్చి కూడ సద్విమర్శ చేయబడుటయే గాక బాలసాహిత్యాన్ని పర్యావలోకనం చేసారు. ఈనాటి రచయితలు గాని విమర్శకులుగాని బాలసాహిత్యమనిన చిన్నచూపు చూస్తున్నారు.

---

బాలసాహిత్యకర్తలైన చింతా దీక్షితులు, కె. సభా. మున్నగు వారిని పేర్కొన్నారు. వీరు బాల సాహిత్యమునకు చేసిన సేవనుగూర్చి సంక్షిప్తంగా ఉన్నప్పటికీ చక్కగా విషయమునకమరియున్నది.

ఇక శైలిని గూర్చి ప్రత్యేకంగా చెప్పకపోయినను గ్రంథం చదివితే సులభంగా ఉన్నదని తెలిసికొనవచ్చును. అన్నింటికంటె గొప్పవిశేషం వెంకటేశ్వర్లుగారు సరళగ్రాంథికంలో ఈ గ్రంథం వ్రాయుటయే. ఈనాడు విశ్వవిద్యాలయ ప్రొఫెసర్లు, విద్యావేత్తలు వ్యావహారిక భాషా ప్రాముఖ్యాన్ని దేశంలో గుర్తింపబడటానికి నానా ప్రయత్నాలు చేసే తరుణంలో 'తెలుగు నవలాసాహిత్య వికాసము' వారికి ఒక గుణపాఠం నేర్పగలదని ఆశింపవచ్చును. మలి ముద్రణలో కూడ ఈ శైలినే అనుసరింపగలరని భావింపవచ్చును. గ్రంథాన్ని గ్రాంథికంలో వ్రాసి ప్రచురించుటయే రచయితయొక్క సాహసం తెలియుచున్నది.

ఈ గ్రంథం దరిదాపు 682 పేజీలు నవలలనుగూర్చి చర్చ ఉన్నది. తక్కిన పేజీలందు విషయసూచిక, సుస్వాగతం, నివేదనము మున్నగునవి ఉన్నాయి. ఈ కరువురోజుల్లో రచయిత శ్రమించి ఉద్గ్రంథాన్ని ప్రచురించి ఆంధ్రుల కందించినందుకు మనసారా అభినందింపవచ్చును.

తెలుగు నవలా వికాసము ఈ వందసంవత్సరాలనుండి ఏవిధంగా జరిగినదన్న విషయం తెలిసికొనాలంటే వెంకటేశ్వర్లుగారు రచించిన ఈ గ్రంథ మవశ్య పఠనీయము. నవలా రచన సులభమే అయినను వానిని గూర్చి విపులంగా చర్చించి ఒక సిద్ధాంతం చే కష్టం. వీరు గ్రహించిన విషయము విస్తృతమైనది. విమర్శ టచ్చట ఘాటుగా, నిష్పక్షపాతంగా, క్రమవిరిగకుండ సాగకుండా ఉన్నది. నచ్చిన రచయితను, అతిగా పొగడుట, నచ్చను, నవలాకారుని తెగడుటవంటి విషయములు పరిమితముగా విమర్శ సూటిగానే ఉన్నది. అయితే ప్రతి విషయం వివరించే ఉపోద్ఘాత సుదీర్ఘమయ్యింది. దానినే గనుక సంక్షిప్తం చేసి ఉన్నట్లయిన చక్కగా నుండెడిది. ఇందలి కొన్ని విమర్శలు చదివిన ఆయా నవలలు పఠింపవలయునను కుతూహలము కలుగును. మరికొన్ని విమర్శలు చూచిన ఆసక్తిజనకంగా కానిరావు. వి పరిశ్రమను గుర్తించి గ్రంథమును ఆదరింపవలయును.

సాహిత్యభూషణ శ్రీ పులా వొట్ల వెంకటేశ్వ తెలుగు నవలా సాహిత్యమునందలి తీరుతెన్నులు ప ఈ గ్రంథము ప్రకటించినట్లుగానే ఇతర సాహిత్య ప్ర గూర్చి కూడ త్వరలో వ్రాసి ప్రచురిస్తారని తలంపవచ్చును.

మొత్తముమీద ఈ గ్రంథముపై డాక్టర్ బొడ్డపాటి కుటుంబరావుగారి "ఆంధ్రనవలా పరిణామము", మొద భూషణశర్మగారి "తెలుగు నవలా వికాసము" అను గ్ర ప్రభావమున్నట్లు చెప్పవచ్చును.

— శ్రీ రామమో

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 7

BHARATI September 7 th 1975 Regd. No. H/VJ-70



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M125 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Navaya |
| స్కాన్ చేసినది | Naveena |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |